# శ్రీ శారదాదేవి చరిత్ర

రచయిత :

శ్రీ చిరంతనానందస్వామి






శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4

1959

2

చెన్నపురి శ్రీరామకృష్ణమఠాధ్యక్షునిచే ప్రకటింపఁబడినది.

నాల్గవ కూర్పు



XXII—6-1959

ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారిచే 1947, '48-వ సం.
ఉభయభాషాప్రవీణపరీక్షలకు పాఠ్యగ్రంథముగా
నియమింపఁబడినది.

వెల : రూ. 2.00

ది జ్యూపిటర్ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు—మ్ర

# తొలినుడి

నారీమణుల నవీనప్రాచీనాదర్శములు శ్రీ శారదాదేవియం దద్భుతసమన్వయము నొందుట గాంచి, "శ్రీ శారదాదేవి పురాణయుగమునకు భరతవాక్యమా, లేక నవీనయుగమునకు నాందియా?" యని సోదరి నివేదిత భావగర్భితముగాఁ బ్రశ్నించియున్నది. "భారతనారీత్వాదర్శమును గూర్చిన శ్రీరామకృష్ణుని పరమసిద్ధాంతమే శ్రీ శారదామాత" యని యామెయే మఱియొకప్పుడు పలికియున్నది.

"శ్రీ శారదాదేవి శ్రీరామకృష్ణునకు సహధర్మచారిణియై యొప్పుటయేగాక, యాయనచే (షోడశీపూజయందు) సాక్షాత్ పరమేశ్వరీస్వరూపముగా నారాధింపఁబడియెను. భార్య పరమేశ్వరిగాఁ బూజింపఁబడుట యపూర్వసంఘటనము గదా!...మాతృదేవి యెంతటి మహనీయవ్యక్తియో లోకమింకను గుర్తింపఁజాలకున్నది. ఆమె జీవితౌన్నత్య ప్రాముఖ్యములను బాగుగా గుర్తించుట లోకమున కంతకును ఉదారదృష్టి నలవడఁజేయఁగలదనుట నిస్సంశయము" అని స్త్రీసముద్ధరణోద్యమమున పేరు గాంచిన విదుషీమణియు యోగినీమణియు నగు గౌరీమాయి వచించియున్నది.

శ్రీ శారదాదేవిజీవితము విహంగకూజితము కాని సింహగర్జనము కాదు. ఆమె జీవయాత్రాపథమున వెల్గొందు తేజము ప్రశాంత మనోహర చంద్రకాంతి కాని ప్రచండ దుర్నిరీక్ష్య సూర్యప్రభ కాదు. ఆమెజీవన

విశేషములు సాగరాంతర్గత మౌక్తికములుగాని మహోత్తుంగ తరంగములు కావు.

లోకులు ఘనమైనవని కొనియాడు సంఘటనములు శారదాదేవిచరిత్రమునం దంతగాఁ గానరావు. కాని మన మొకవిషయమును గమనింపవలసియున్నది. ఉత్తమోత్తమౌన్నత్యము తాత్కాలికములగు నార్థిక రాజకీయాదివిజయములచేఁగాక, సార్వకాలికములగు సౌశీల్యపారమార్థిక సంపదలచే గణనీయమై వెలయుచుండును. శ్రీ రామకృష్ణపరమహంస స్వయముగాఁ దన ప్రియశిష్యుల నిరువురను శ్రీ శారదాదేవియొద్ద మంత్రోపదేశము నొంద నియమించెనన్నచో, ఆమె పారమార్థిక ప్రతిభాతిశయ మెట్టిదో తెలియఁగలదు. ఉత్తమోత్తమయగు సతియు మాతయు సన్న్యాసినియు గురువునై వెల్గొందిన శ్రీ శారదాదేవి నిజముగా సర్వజనాదర్శనీయురాలు. అత్యంతసరళము, నిరాడంబరము నగు నామెస్వభావవర్తనము లనేకులయం దపూర్వపరిణామమును గల్గించి మించెను. సంశయాందోళితుల చిత్తములం దామె శ్రద్ధాభక్తులను నెలకొల్పెను, దుర్బలమానసుల కాత్మవిశ్వాసమును బురికొల్పెను, దుఃఖితులకు చిత్తశాంతిని జేకూర్చెను.

స్వయముగా ధీనిధులయ్యు, యతివరేణ్యులయ్యు, శ్రీరామకృష్ణునిశిష్యులు మఠసేవాసంఘములందలి ప్రధాన కార్యనిర్వహణమున మాతృదేవియభిప్రాయము . నరయువారు, అరసి శిరసావహించువారు. ఆమెసమ్మతిని బడసియే, యామెయాశీర్వాదము నందియే, శ్రీ వివేకానందస్వామి

పశ్చిమఖండమునఁ దనవేదాంతదిగ్విజయయాత్రకై బయల్వెడలెను.

శాఖోపశాఖలతో జగద్వ్యాప్తమై యలరారు శ్రీరామకృష్ణమఠసేవాసంఘములనెడి మహావృక్షమునకు నిజముగా శ్రీ శారదాదేవియే మూలము.

చారిత్రకరచనమున నీ గ్రంథకర్త (ఇదివఱకు మాధవచైతన్య బ్రహ్మచారి) తొలియత్నమగు శ్రీ వివేకానంద జీవితచరిత్ర * యాంధ్రసోదరుల యాదరాభిమానములను బడసియుండుట ముదావహము. మఱియత్నమగు నీ శారదాదేవిచరిత్రమున శైలి మఱింత సరళముగను సులభముగను నొనర్పఁ బ్రయత్నింపఁబడియున్నది. జిజ్ఞాసువులతోడను శిష్యులతోడను మాతృదేవి యొనర్చిన సంభాషణములందలి ప్రధానవిషయములు † 'మాతృదేవి సందేశము' అను ప్రకరణమునఁ బొందుపఱుపఁబడినవి. స్త్రీసముద్ధరణమునుగూర్చియు నారీమణుల యాదర్శములను గూర్చియు మాతృదేవి యభిప్రాయములు 'స్త్రీసముద్ధరణ

---

* ఈ గ్రంథ మాంధ్రవిశ్వకళాపరిషత్తువారిచే (1945-వ సం॥) ఉభయభాషాప్రవీణ ప్రాథమికపరీక్షకును, మద్రాసు విశ్వవిద్యాలయము వారిచే 'ఇన్టర్‌మీడియేట్' నకు (వరుసగా 1944, '46, '47-వ సం॥ పరీక్షలకును,) అన్నామలై విశ్వవిద్యాలయమువారిచే 'ఇన్టర్‌మీడియేట్' నకు (1945-వ సం॥ పరీక్షకును) పాఠ్యగ్రంథముగా నియమింపఁబడి యున్నది.

† శ్రీ శారదాప్రసంగములు అను నామమున మాతృదేవి సంభాషణలు ప్రత్యేక గ్రంథరూపమునఁ బ్రకటింపఁబడి యున్నవి.

సమస్య : మాతృదేవి' యను ప్రత్యేకప్రకరణమున క్రోడీకరింపఁబడినవి.

ముఖ్యముగా ఆంగ్లమున మాతృదేవినిగూర్చి ప్రకటింపఁబడియున్న గ్రంథములనుండి కథావస్తువు గ్రహింపఁబడియున్నది.

శ్రీ రామకృష్ణమఠము
మైలాపూరు, చెన్నపురి
సెప్టెంబరు, 1943

గ్రంథకర్తయు
ప్రకాశకులును

# మలికూర్పు

ఇది పరిష్కృతమైన కూర్పు. విషయవిన్యాసమున మార్పు లేకున్నను, మూఁడు నాలుగు పాదదీపికలు (Foot notes) మాత్ర మిందుఁ జేర్పఁబడినవి.

గుంటూరుజిల్లా, తెనాలి వాస్తవ్యురాలు, శ్రీ కొండా రంగనాయకమ్మగారు—కీర్తిశేషులు శ్రీ కొండా సుబ్బారావు గారిభార్య—ఏడువందల రూపాయలను, పెదపాలెము వాస్తవ్యురాలు, శ్రీ వాసిరెడ్డి పార్వతమ్మగారు—కీ. శే. శ్రీ వా. వేంకటప్పయ్యగారి భార్య—నాలుగువందల రూపాయలను, చినపాలెము వాస్తవ్యురాలు, శ్రీ వాసిరెడ్డి అన్నపూర్ణమ్మ గారు—కీ. శే. శ్రీ వా. పెదకోటయ్యగారి భార్య—నూట యఱువదియాఱు రూపాయలను ధనసాహాయ్య మొనర్చి యీ కఱవుకాలమున ఈ కూర్పు తొలికూర్పుకంటె సర్వవిధములను మేలుగా వెలువరించుటకును వెల తగ్గించుటకును దోడ్పడియున్నారు. శ్రీ శారదా రామకృష్ణులు సర్వదా వారిని వారికుటుంబములను అనుగ్రహింతురుగాక!

శ్రీ రామకృష్ణమఠము
మైలాపూరు, చెన్నపురి
మార్చ్, 1947

చిరంతనానందస్వామి

శ్రీ

# విషయసూచిక

# విషయసూచిక

## శ్రీ శారదాదేవిమహత్త్వమును దెలుపుచు
## శ్రీవివేకానందస్వామి యొకసోదరశిష్యునకు వ్రాసినలేఖ*

అమెరికా సంయుక్తరాష్ట్రములు,
1894.

....అద్భుతమగు మాతృదేవిజీవితార్థము, జీవితప్రాముఖ్యము, నీకు — నీకననేల — మీలో నెవ్వరికిని ఇంకను బోధపడలేదు. కాని క్రమముగాఁ దెలియఁగలదు. శక్తివినా లోకమునకుఁ బునర్జీవనము లేదు. సమస్తదేశములందును మనదేశ మతిబలహీనమై వెనుకఁబడియుండుటకు హేతువేమి? శక్తి యిచట నగౌరవింపఁబడుచుండుటయే. భారతదేశమున నా యద్భుతశక్తిని బునర్జీవింపఁజేయుటకే అమ్మ జన్మించినది. ఆమెను మూలాధారముగాఁ జేసికొని గార్గులును మైత్రేయులును లోకమున మఱల ప్రభవింతురు. అన్నా! నీ కిపుడు తెలియకున్నది. కాని క్రమముగా నంతయుఁ దెలియఁగలదు. అందుచే నాకు మొట్టమొదట కావలయునది యామెమఠము...శక్తికటాక్షము లేనిదే యేమియు సాధింపఁజాలము. అమెరికా, ఐరోపాఖండములలో నాకు గోచరించిన దేమి?—శక్తిపూజ, శక్తిపూజ. కాని తెలియక వా రామెను (శక్తిని) ఇంద్రియతృప్తికై యారాధించుచున్నారు. అకలంక

* ఈ రచయితచే అనువదింపఁబడిన శ్రీ వివేకానంద లేఖావళి నుండి యుద్ధృతము.

హృదయముతో, శుద్ధసాత్త్వికభావముతో, శక్తిని తమ మాతృదేవతగా నారాధించువా రెట్టి శ్రేయము నొందుదురో యూహింపుము! నానాఁటికి నాకు సంగతులు స్పష్టమగుచున్నవి, దృష్టి వికసించుచున్నది. కావున మాతృదేవికై మొదట మనము మఠము నిర్మింపవలయును. మొదట మాతృదేవియు నామెకుమార్తెలును, * తరువాతఁ దండ్రియు నాతనిపుత్రులును †—బోధపడినదా? తండ్రికటాక్షముకంటె తల్లికటాక్షము నాకుఁ గోటిరెట్లు మాన్యము. మాతృదేవి యనుగ్రహమును ఆశీస్సులును అన్నియు నాకు వరప్రసాదములు...ఆమె యాజ్ఞాపించినఁ జాలును, ఆమె 'భూతములు' ఏమైనను సాధింపఁగలవు. సోదరా! నే నమెరికాకు వెళ్లుటకు ముందు న న్నాశీర్వదింపుమని యమ్మకు (మాతృదేవికి) వ్రాసినాను. ఆమెయాశీస్సులు లభించినవి, ఒక్క దుముకులో సముద్రమును లంఘించినాను. చూచితివా (ఆమెమహిమ!)...

సదా
మీ వివేకానందుఁడు



* శిష్యురాండ్రు.

† శ్రీరామకృష్ణుఁడును ఆతని శిష్యులును.



## సోదరి నివేదిత మాతృదేవికి వ్రాసిన లేఖ

కేంబ్రిడ్జి, మెసాచుసెట్స్,
11-12-1910.

అమ్మా,

నేఁడుదయము, పెందలకడనే, నేను చర్చ్ (Church) కి *...సోదరినిమిత్తము ప్రార్థించుటకై వెళ్లినాను. అట నందఱును ఏసుమాతయగు మేరీనిగూర్చి తలఁచుచుండిరి, అకస్మాత్తుగా మీరు నాకుఁ దలఁపునకు వచ్చితిరి. మీ యనుంగు మోము, ప్రేమంపుఁ జూడ్కులు, మీ తెల్లని చీర, మీ కంకణములు—ఇవన్నియు నా మనస్సున భాసించినవి. పాపము, వ్యాధిగ్రస్తురాలగు...సోదరి కామె మందిరమున నుపశాంతినిఁ జేకూర్చి యామె ననుగ్రహింపఁదగినది మీ సన్నిధియే యని నాకుఁ దోఁచినది. మఱియు—మీరు ఎఱుఁగుదురా? — శ్రీరామకృష్ణు నారాత్రికసమయమున మీ గదిలోఁ గూర్చుండి నేనేమో ధ్యానింపయత్నించుట వట్టి యవివేకమని తలఁచినాను. మీ పాదసన్నిధిని బసిబిడ్డనై యుండుట నాకుఁ జాలదా యను సంగతిని నేనేల గ్రహింపనైతిని? అమ్మా! నీవు ప్రేమమూర్తివి! ఆవేశముతో, ఉద్రేకముతోఁ గూడిన మా ప్రేమవంటిదియు, లోకుల

---

* క్రైస్తవ ప్రార్థనాలయము.

ప్రేమవంటిదియుఁ గాదు నీ ప్రేమ,—ఎవ్వరికిని హాని కలిగింప నిదియు, ఎల్లరకును మేలొనఁగూర్చునదియు నగు మధుర మంజుల ప్రశాంతి నీ ప్రేమ. చిద్విలాసమయమై యది స్వర్ణకాంతుల నీనుచుండును. కొలఁది నెలలకుఁ బూర్వము, గంగాయాన మొనరించుటకుముందు, నీ పాదసన్నిధికిఁ బరుగునవచ్చి, యానానంతరము మఱల నీ చరణోపాంతమున వ్రాలిన నాఁటిభానువార మెంత మహానందదాయకము! నీవు నా కొనరించిన యాశీస్సున, నీ గృహమున నేను బొందిన స్వాగతమున నేమి దివ్యస్వాతంత్ర్యము ననుభవించినాను! అమ్మా! శారదామాతా!—అద్భుత స్తవమునో, ప్రార్థననో రచించి నీకుఁ బంపవలయుననుకొనుచుందును. కాని యదియు నార్భటముగా, ఏమో యట్టహాసముగాఁ దోఁచును!—ఎందువలననో చెప్పఁజాలను. నిజముగా నీవు భగవానుని యద్భుతరచనము — లోకమునకు స్వయముగా శ్రీరామకృష్ణుఁడు ప్రసాదించిన ప్రేమామృతకలశము — మహనీయులు దుర్లభులగు నీ దినములలో నాతఁడు తన సంతానమున కొసఁగిన దివ్యసాంకేతికము—నిజముగా నించుక వేడుకకుఁ గానిచో, నీ సముఖమున మేము మౌనముదాల్చి నిశ్శబ్దముగా నుండవలసినవారము! "భగవానుని యద్భుతరచనములు" అన్నియు—మలయమారుతము, రవితేజము, గంగామాధురి, వనసౌరభము—నివన్నియు—నజ్ఞాతముగా మన జీవనమునఁ జొచ్చిలుచు, నిరాడంబరమై వెలయుచుండును గదా! ఇవియు నీవలెనే ప్రశాంతములుగదా!

అమ్మా! నీ శాంతికవచమును దీనురాలగు...సోదరికిం బ్రసాదింపుము. అపుడపుడు నీ భావనయేకదా, రాగవిరహితము, ద్వేషవిరహితము నగు శమమును (మాకు) ఒనంగూర్చినది! తామరాకుపై మంచుబిందువులీల సంగవిరహితమై భగవద్భావమునం దొడంకు నీ భావనయేకదా మధుర ప్రసాదము!

అమ్మా, తెలియనిదానను, సదా నీ పిల్లను.

నివేదిత

14B



మనోనిగ్రహమును నైర్మల్యమును అమూల్యమైన సంపదలు

—శ్రీ శారదాదేవి

ఓమ్

నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ శారదాదేవి చరిత్ర

శ్లో. "పవిత్రం చరితం యస్యాః పవిత్రం జీవనం తథా,
పవిత్రతా స్వరూపిణ్యై తస్యై దేవ్యై నమో నమః."

## మొదటి ప్రకరణము

## వంశ చరిత్ర

సంసారము తాపత్రయతరంగములతో భయంకరమై కాన్పించు సాగరమయ్యు, శమదమాది సుగుణ రత్నాకరము. బాహ్యకల్లోలములచే భ్రమసి లోకు లిందలి రత్నములను జేపట్టవెఱతురు. కాని మహాత్ములు వీనిని గ్రహించి తమ జీవితమును జాజ్వల్యమాన మొనర్చుకొనుటయేగాక, సంసారమున నెల్లరకును మార్గదర్శకులై వెలయుచుందురు. ఆత్మమోక్ష జగత్కల్యాణములేగదా మహాత్ముల యాశయములు! ఏతదాశయసిద్ధికై వా రెంతటి త్యాగమునకైనను వెనుదీయరు, ఎట్టికష్టములనైనను బాటింపరు. విశ్వమానవప్రేమ — సర్వభూతప్రేమ — వారల హృదయమునఁ బొంగి పొరలుచుండును. వీరే భగవదంశ సంభూతులనియు, అవతారమూర్తులనియు పూజింపఁబడు

చుందురు. ఏ కే దేశమున మనినను వీరలజీవితము సర్వ మానవసంపదయై, విశ్వకల్యాణ హేతుభూతమై విరాజిల్లు చుండును. శ్రీ శారదామణీదేవి యిట్టి మహనీయమూర్తులం దుత్తమగణ్యురాలు. తనభర్తయగు శ్రీరామకృష్ణపరమ హంసచే పూజల నందిన యీమెచరిత్రము సర్వజనాదర్శ ప్రాయముగదా!

కలకత్తానగరమునకుఁ బడమట నించుమించు చెఱువది మైళ్లదూరమున బంకూరాజిల్లా కాగ్నేయపుసరిహద్దుననున్న జయరాంబాటి యను పల్లెటూరు మాతృదేవిజన్మస్థానము. ఈమెజీవితవాహినిచందముననే స్వచ్ఛమై యొప్పు నమొదార్ అను జీవనది యీగ్రామమున కుత్తరదిశగాఁ బ్రవహించుచుండును. నేఁటి ప్రయాణసౌకర్యముల ధర్మమాయని కలకత్తానుండి జయరాంబాటిఁ జేరుట కొక్కపూఁటచాలును; కాని మనకథాకాలమున కాలినడకనైనను, పాలకి నెక్కి వెడలినను రెండుదినముల కదనముగాఁ బట్టెడిది. మార్గమో, పొలములును, దుర్గమారణ్యములును! ఇందులకుఁదోడు దారిలో బందెపోటుదొంగలవలని గండములు!

చుట్టుపట్టులగ్రామములతోఁ బోల్చిచూచినచో నించుమించు నూఱుకుటీరములకుఁ దావలమగు జయరాంబాటి చిన్నపల్లెయని చెప్పవలసివచ్చును. కాని సారవంతమైన నేల. పందొమ్మిదవశతాబ్దపుఁ దుదిభాగమున మన్నెపుజ్వర మందు కాలిడుటకుముందు జయరాంబాటిలో జీవనము హాయిగనే యుండెడిదని చెప్పవచ్చును. శీతల, ధర్మ, సింహవాహిని మున్నగు గ్రామదేవతల యుత్సవములును దుర్గా కాళీ

పూజలును దోలపూర్ణిమ మున్నగు పండుగులును గ్రామవాసులకు నేఁటికిని ఉత్సాహజనకములై, యానందదాయకములై యలరారుచుండును.

ముఖ్యముగా వ్యవసాయులకును శిల్పులకును నావాసమగు జయరాంబాటిలో రెండే బ్రాహ్మణకుటుంబము లుండెడివి — అందొకటి వంద్యోపాధ్యాయకుటుంబము, రెండవది ముఖోపాధ్యాయకుటుంబము. మాతృదేవి ముఖోపాధ్యాయకుటుంబమును సుప్రకాశితమొనర్చిన కుమారీరత్నము. ఈమెతండ్రియగు రామచంద్రముఖోపాధ్యాయునకు త్రైలోక్యనాథుఁడను మహాపండితుఁడును (ఈతఁడకాలమృత్యువు పాలయ్యెను) ఈశ్వరచంద్రుఁడను నాతఁడును నీలమాధవుఁడను నైష్ఠికబ్రహ్మచారియు సోదరులై వెలసిరి. వీరందఱును నేకకుటుంబముననే మెలఁగిరి.

రామచంద్రముఖోపాధ్యాయుఁడు సిరిసంపదలకుఁ గొఱవడినను సుగుణములకుఁ గొఱవడినవాఁడు కాఁడు. దానశీలుఁడు, ఋజుమార్గవర్తనుఁడు, సద్భక్తుఁడు నగు నాతఁడు బ్రాహ్మణాదర్శమూర్తియై యొప్పెను. కాలాంతరమున మాతృదేవి యాతనిగుణగణముల నిట్లు వెల్లడించియున్నది: "మా నాయన చాల మంచివాఁడు; గొప్ప రామభక్తుఁడు; శాస్త్రోక్తమగు బ్రాహ్మణజీవితమునం దాతనికి పరమనిష్ఠ. దొరకినది గదాయని విచక్షణత విడిచి దానములకుఁ జేయి చాపువాఁడు కాఁడు. ఆతనికి హుక్కాపట్టు టనిన ప్రీతి. పొగఁబీల్చుచు, నాతఁడు మా యింటిముంగిలినుండి పోవు

నే బాటసారినైనను 'నాయనా! లోపలికిరా, పొగపట్టు' మని ప్రేమమీఱఁ బిలుచువాఁడు; అతఁ డంతటి నిష్కపటి, వినయవంతుఁడు.''

అతని యుదారహృదయమును బ్రకటించు సంఘటనము లనేకములుగలవు. రక్తాక్షినామ (క్రీ. శ. 1864-వ) సంవత్సరమున వంగదేశమందంతటను గాటకము చెలరేఁగి ప్రళయ తాండవ మొనర్చుచుండ, ''అన్నమో రామచంద్రా!'' యని పలవించు వేలకొలఁదిజనులకు రామచంద్రుఁ డన్న ప్రదానము గావించి ప్రాణదాన మొనర్చెను. స్వయముగాఁ గొలఁదియెకరముల వరిపొలమును సాగుచేసియు, పౌరోహిత్యమునొనర్చియు, జందెములు వడకియు నెట్టులో జీవనోపాధి నార్జించుకొను పేదయయ్యు, రామచంద్రుఁడు ముందటి వత్సర మదనముగాఁ పండినపంటవలన లభించిన ధాన్యపు రాశినిఁ దనయోగక్షేమముల నీసడించి జనులను రక్షించుటకై యథేచ్ఛముగా వినియోగింపసాగెను. ఏమి దీనజన వాత్సల్యము! ఇట్టి దీనజనబాంధవుని పుత్త్రికామణియై జన్మించిన శ్రీ శారదామణీదేవి లోకసేవాపరాయణయైనచో నం దాశ్చర్య మేమున్నది?

తన పదియవయేఁట జరిగిన యీ సంఘటనమును గూర్చియే మాతృదేవి కాలాంతరమునఁ దనశిష్యులతో నిట్లు వచించియున్నది: ''ఒకప్పుడు జయరాంబాటిలో గొప్పకాటకము సంభవించి జననాశనము గలిగించినది. లెక్కలేనంతమంది జనులు మా యింటి కన్నాతురులై వచ్చెడివారు. అంతకు ముందటిసంవత్సరము పండినపంట

వలన మా యింటఁ జాలబియ్యము నిలువయుండెను. ఆ బియ్య మును బప్పును గలిపి మా నాయన పులగము వండువాఁడు. ఆ పులగము ననేకములైన కుండలలోఁ బెట్టియుంచువారము. కుటుంబములోని వారికందఱకును అదియే యాహారము. కాటకముచేఁ బస్తుపడియున్న జనులును ఆ పులగమునే తినువారు. ఐనను మా నాయన యిట్లు వచించువాఁడు: 'మంచి బియ్యము కొంచెము మా శారదకు వండి పెట్టవలయును. ఆమె యా యన్నము తినును.' ఆఁకలిబాధచే నల్లాడువా రొక్కొక్కప్పుడు తండోపతండములుగా వచ్చుటచే వండిన పులగము చాలకుండెడిది. అప్పుడు వెంటనే మఱల వండి మూఁకుళ్లలో నా వేఁడిపదార్థమును బోయ నేను దానిని విసనకఱ్ఱతో విసరి చల్లార్చుదానను. ఆఁమ్మున కంటిపెట్టు కొనిన కడుపులతో జనులు దానికోసము కనిపెట్టుకొనియుండు వారు. ఒకనాఁడొక కడజాతిస్త్రీ వచ్చినది. చింపిరితలతో డను జింతనిప్పులవంటి కన్నులతోడను గూడిన యామె వాల కము వెఱ్ఱివాలకము. పశువులకోసము గోలెములో నాని యున్న కుడితినిఁజూచి వెంటనే దాని నామె తిన నారంభిం చినది. 'ఇంటిలో పులగ మున్నది. వెళ్లి తిను' మని మే మామెకుఁ జెప్పితిమిగాని దానికోసము కనిపెట్టుకొని యుండు నంతటి యోపిక యామె కెక్కడిది? దహించుకొనిపోవుచున్న కడుపుఁజిచ్చును భరించుట మాటలా?''

రామచంద్రునిభార్య శ్యామసుందరీదేవి యాతనికిఁ దగిన యిల్లాలు, సుగుణరాశి. ఆమె సమీపగ్రామమగు సిహోరునందలి హరిప్రసాద మజుందారుని కొమార్తె.

పాటుపడి పనిచేయఁజాలిన దృఢగాత్రయు సమర్థురాలగు గృహిణియు నగు నీమె రామచంద్రునివలెనే మహోత్తమాదర్శముల నుపాసించుచుండెడిది. మాతృదేవి వచించిన రీతిని "ఆమె మాయమర్మములెట్టివో యెఱుఁగని సత్యకాలపుస్త్రీ. సహజముగా నెల్లరియందును ప్రేమానురాగములను జూపుచుండెడి యిల్లాలు." ఆమె గొప్ప భక్తురాలు. పదిమందికి అన్నముపెట్టు టనినను, తనువు దాఁచుకొనక పరులకై పనిచేయుటనినను నామెకు పరమానందము. ఒరుల యోగక్షేమముల నామె తనవని భావించెడిది. కాలాంతరమునఁ దనకొమార్త శిష్యవర్గము నామె మాతృప్రేమతో నాదరించెడిది. మాతృదేవియే యిట్లు వచించియున్నది: "భక్తులలో నెవ్వరైనను మా యింటికి వచ్చినంతనే మా యమ్మ పట్టరానియానందముతోఁ బొంగిపోయెడిది. 'ఆహా! ఇదిగో, మా మనుమఁడు వచ్చినాఁడు!' అని యామె గొంతెత్తి పలుకును. వారి నామె ప్రేమమీఱ నాదరించును. ఈ భక్త కుటుంబము నామె తనకన్నబిడ్డలవలెనే గారాబముతోఁ జూచెడిది."

## రెండవ ప్రకరణము

## జననము : విద్యాభ్యాసము

శ్రీ శారదామణీదేవి * యీ పుణ్యదంపతులు నోఁచిన నోముల పంటయై ప్రమాదీచనామ సంవత్సర మార్గశిర బహుళసప్తమీ గురువారమున, ఉత్తరఫల్గునీనక్షత్రయుక్త మిథునలగ్నమున (1853–వ సంవత్సరము, డిసెంబరు, 22–వ తేదీని) జన్మించెను. ప్రకృతివిహారభూమియు పూర్వాచారములకుఁ బట్టుఁగొమ్మయు నగు నా పల్లెటూరిలోఁ బుట్టి పెరిఁగిన మాతృదేవి ఎట్టిశిక్షణమును విద్యాబుద్ధుల నొందెనో మనము ఊహించుకొనవచ్చును. చిన్ననాఁటి నుండియు నామె తల్లికి వంటపనియందుఁ దోడ్పడుచు నావశ్యకమగునప్పు డెల్లఁ దానే గృహకృత్యములను జాలవఱకు నిర్వహించెడిది. ఇవ్విషయమై తన బాల్యానుభవములను స్మరించుచు నామె యిట్లు పలికియున్నది : ''నేను వంటచేయ మా నాయన పెద్దయన్నపు గూనను పొయిమీఁదినుండి క్రిందికి దింపుటకై నాకు సాయపడువాఁడు.'' బాల్యమునఁ దన కలవాటగు నితర కార్యములను గూర్చి యామె యిట్లు వచించెను : ''నా చిన్నతనమున నొక్కొక్కప్పుడు కుత్తుకబంటినీటిలో దిగి యావుల కోసము గడ్డి కోయుదానను. పొలములోఁ బనిచేయు కూలివారి నిమిత్త ముపాహారములను దీసికొని

* జ్యోతిశ్శాస్త్రగణన ననుసరించి యీమె కిడఁబడిన నామము ఠాకూర్మణి.

పోవుదానను. ఒక యేఁడు చీడపట్టి వరిపైరు పాడగుటచే నేను బొలములు తిరిగి ధాన్యమును బోగుచేయవలసి వచ్చినది.''

బాల్యమునుండియు నుత్తమాశయముల నుపాసించిన మాతృదేవి యల్లరిచిల్లరియాటలనిన రమించెడిది కాదు. చిన్ననాఁటి చెలికత్తెయగు నఘోరమణి మాతృదేవి బాల్య క్రీడలను గూర్చి యిట్లు వచించెడిది: ''తల్లి కల్లకపటము లెట్టివో యెఱుఁగని ముద్దరాలు. ఆమె యొకరిజోలి కెన్నఁడును బోయెడిదికాదు. ఆటలలో నెవ్వరితోడను నామె జగడమాడి యెఱుఁగదు. ఇతరు లొకరితో నొకరు జగడమాడునప్పు డామె మధ్యవర్తినియై నెయ్యమును నెలకొల్పెడిది. ఆటా డుచో నామె యిల్లాలుగను గృహ యజమానురాలుగను వర్తించును. బొమ్మలతో నామె యాటలాడుకొనుచుం డెడిది. మట్టితోఁ జేయఁబడిన కాళీ లక్ష్మీ విగ్రహములను బూవులతోడను బిల్వపత్రములతోడను అత్యంత భక్తితో పూజించెడిది. జగద్ధాత్రీ పూజా సమయమున నొకప్పు డామె నిశ్చలముగాఁ గూర్చుండి తన్మయురాలై దేవిని ధ్యానించుచుండ హలధరపుష్కరవాసి యగు రామ హృదయఘోషాల్ అది గని నిశ్చేష్టుఁడయ్యెను!''

పసిబాలికయేమి! పరమేశ్వరీ ధ్యాననిమగ్నతయేమి! అనేకజన్మ సముపార్జిత తపఃఫలము! శారదాంబరో! ధ్యానము నీకు బాల్యక్రీడ కావుననే శ్రీరామకృష్ణ పరమ హంస సహధర్మచారిణి వైతివి!

కుటుంబమునఁ దమ్ములను గాపాడుచు మాతృదేవి చాలసేపు గడపుచుండెడిది. ఒకొక్కప్పు డామె వారితో

నా పల్లెటూరి యందలి పాఠశాలకుఁ బోవుచుండెడిది. కాని యా కాలమున నా పల్లెటూరిలో బడిచదువు స్త్రీల కావశ్యకమని తలఁచువా రెవ్వరు? మాతృదేవి స్వయముగా విద్యాభ్యాసమున విశేషప్రీతి వహించినను నామె విద్యా విషయమున శ్రద్ధవహించువా రెవ్వరును లేరైరి. విద్య యందలి మక్కువచే నామె కాలాంతరమున స్వయంకృషి నొనర్చి చదువనేర్చెను. ఇవ్విషయమునే స్మరించుచు నామె యిట్లు వచించియున్నది : "లక్ష్మియు (శ్రీరామకృష్ణున కన్నకొమార్త) నేనును (వంగీయ) ప్రథమబోధినిని గొంచెము చదువువారము. హృదయుఁడు* నాచేతిలోనుండి పుస్తకము లాగివేసెను. అతఁ డిట్లన్నాఁడు: 'స్త్రీలకుఁ జదువేమి? స్త్రీలు చదువను వ్రాయను దగదు. ఈ రీతిని క్రమముగా నవలలను నాటకములను జదువుటకై యాయి త్తపడుచున్నా వా యేమి?' కాని లక్ష్మి పుస్తకమును విడువలేదు. ఆమె యాతనికుటుంబములోని వ్యక్తియే కావున (చనవుచే) నాతని మాటలను బాటింపక తనచదువు సాగించినది. నేనును రహస్యముగా నొకయణాపెట్టి యొక ప్రతినిఁ గొంటిని. లక్ష్మి యూరిలోని బడికిఁ బోయెడిది. ఇంటికి వచ్చి నాకు నేర్పెడిది. కాని చాలకాలమునకుఁ బిమ్మట నిజముగా దక్షిణేశ్వరమునఁ జదువుట చాలవఱకు నేర్చినాను. ఠాకూరు (అనఁగా శ్రీరామ కృష్ణుఁడు) అప్పుడు శ్యామపుష్కరమునకు చికిత్సనిమిత్తము

---

* శ్రీరామకృష్ణునకు మేనత్తకొమార్తయగు హేమాంగినీదేవి పుత్త్రుఁడు. ఈతఁడు చాలకాలము శ్రీరామకృష్ణునకుఁ దోడునీడయై వర్తించెను.

వెళ్లియుండిరి. నేనప్పుడు కేవల మొంటరిగా నుండుదానను. గంగాస్నానార్థము భావముఖోపాధ్యాయుని కుటుంబములోని యొకబాలిక దేవాలయోద్యానమునకు (అచట గంగ దగ్గఱగా నుండును గావున) వచ్చెడిది. అప్పుడప్పుడు నాతో నామె చాలసేపు గడపెడిది. నాకు పాఠముచెప్పి పిమ్మట నెంతవఱకు నేర్చితినోయని పరీక్షించుచుండెడిది. దేవాలయ వనమునుండి నాకుఁ బంపఁబడు కూరగాయలను, తినుబండారములను విశేషముగా నే నామె శ్రమకుఁ బ్రతిఫలముగా నిచ్చుదానను."

"స్త్రీలకుఁ జదువేమి" యఁట! "స్త్రీలు చదువను వ్రాయను దగ" దఁట! దేశసౌభాగ్యహేతువగు స్త్రీవిద్యను నిరసించు నిట్టి యవివేకహృదయు లెందఱో నేఁటికిని మన దేశమున నుండుట దేశదౌర్భాగ్యముకాక మఱేమి? విద్య యెవ్వరికైనను జ్ఞానదాయకమేకదా! జ్ఞాన మొకరికి మంచిని మఱియొకరికిఁ జెడుగును గలిగించు ననఁజెల్లునా? దీప సాహాయ్యమున నొకఁడు దొంగదస్తావేజులను సృష్టించుచుండ మఱియొకఁడు భాగవతపారాయణము చేయుచున్నచో, ఆ దోషాదోషములను దీపమునకంటఁగట్టు మతిహీనుఁడెవ్వఁడని శ్రీరామకృష్ణపరమహంస పలికియున్నాఁడు. విద్యావిషయము కూడ నిట్టిదే. మఱియు భావిపౌరులగు బిడ్డల విద్యాభ్యాస వల్లరికిఁ దల్లియే దోహదమొసంగునుగావున స్త్రీవిద్యావ్యాపనము మన కవశ్యాచరణీయముగదా!

మాతృదేవి చదువుట చక్కఁగా నేర్చినను వ్రాఁత నెన్నఁడును బాగుగా నభ్యసింపలేదు. కాలాంతరమున నొక

శిష్యుఁ డామెను స్వహస్తముతో నేదేని వ్రాసియిమ్మని కోర నామె యెట్లో సమ్మతించెను. కాని తనపేరు వ్రాయఁ బూని పెద్దపెద్దయక్కరములను బరికి బరికి విశ్వప్రయత్నము చేసి తుదకుఁ జదువఁదగినదేమియు వ్రాయఁజాలక తన ప్రయత్నమును విరమించెను.

పైనిఁజెప్పఁబడిన విషయములనుబట్టి బాల్యమున నామెకట్టి విద్యాభ్యాసమునకును ఆ పల్లెటూరి పరిస్థితులు తావొసఁగలేదని తలంపరాదు. చదువుటయు వ్రాయుట యునే విద్యయనియు పరిజ్ఞానమనియుఁ దలంపరాదు. చదువను వ్రాయను దెలియకున్నను సద్విద్య నార్జించు విధానములను—పరిజ్ఞానమును బడయు మార్గములను—భారతీయనాగరికత ప్రకటించి యున్నది. ఉత్తమ ధార్మికసూత్రనిబద్ధమైన కుటుంబజీవనము, అడుగడుగునను స్వార్థత్యాగమును సేవా నిరతిని బెంపొందించు పెద్దల సుశిక్షణము, నోములు, వ్రత ములు, దేవతాపూజలు, దేవాలయోత్సవములు, వీధిపురాణ పఠనలు, హరికథాకాలక్షేపములు, భజనలు, యక్షగాన ములు, తోలుబొమ్మలాటలు, వీధినాటకములు—మున్నగున వన్నియు భారతీయవిజ్ఞానభాస్కర మయూఖములును గృహి ణులను సైతము విజ్ఞానసంశోభితల నొనర్ప నుపయోగకరము లును గావా ? భారతజాతీయాదర్శములగు త్యాగ సేవల నప్రయత్నముగా ప్రతిగృహమునను నెలకొల్పుట కింతకంటె పటుతరసాధనము లెవ్వి ? అనుక్షణమును ధనకాంక్షా ప్రేరితములై వెలువడు పుస్తకములును, సినిమాలును,

లేడియోలును నేఁడింతటి విశేషవిజ్ఞానమును సౌశీల్యమును బెంపొందించుచున్నవని చెప్ప సాహసించువా రెవ్వరు ?

జయరాంబాటియందలి నాఁటివాతావరణము సనాతన భారతీయవిజ్ఞానమున మాతృదేవిని సుశిక్షితురాలి నొనర్చె ననుటకు సందియము లేదు. ఊరియందలి దేవతాపూజలును ఉత్సవములును నటుండ, యాత్రలను నొకవిధమైన వీధినాటకము లా కాలమున విశేషముగా ప్రదర్శింపఁబడు చుండెడివి. వాని నామె తఱచు చూచుచుండినట్లు తెలియ వచ్చును. వానిని సందర్శించుటచే బాల్యమునఁ దన మనః ఫలకమున ముద్రితములైన పద్దెములను, పాటలను, సుభా షితములను కాలాంతరమున మాతృదేవి బోధన సమయ మున శిష్యుల కుదాహరించుచుండెడిది. ఆమెపరిజ్ఞానమును ధారణాశక్తినిఁ గని శిష్యు లాశ్చర్యచకితులగువారు. విశే షము, సుశీలవ్రతులగు నామె తల్లిదండ్రులసాన్నిధ్య మే పాఠ శాలయందును నే విశ్వవిద్యాలయముననుబడయఁజాలని పరిజ్ఞానము నామెకొసఁగెను. వారల సౌశీల్యమునుగూర్చి తన గౌరవభావమును మాతృదేవి తఱచు వెల్లడించుచుండెడిది.

అన్నిటికంటెను, జ్ఞానమూర్తియగు శ్రీరామకృష్ణుని సాహచర్యమను మహాభాగ్యము—పసితనముననే యాతని సహధర్మచారిణి యగు సౌభాగ్యము—మాతృదేవికి లభింప సమస్త విద్యాపరమార్థ మామెకు కరతలామలకమైనచో నం దాశ్చర్య మేమున్నది ?



13

## మూఁడవ ప్రకరణము

## వివాహము

గృహస్థాశ్రమము సాంఘికజీవన హృదయము. గృహస్థాశ్రమమువలననే యితరాశ్రమము లన్నియు పరిపోషింపఁబడుచున్నవి. సంఘసంస్థితి కేకాక జగత్కల్యాణమునకును ఆత్మమోక్షమునకునుగూడ నాధారభూతములగు పంచమహాయజ్ఞములును గృహస్థులయందే నెలకొనియున్నవి. గృహస్థజీవనమునకు మూలము వివాహము కావున వివాహము ముఖ్యమగు సంస్కారముగను యజ్ఞముగను పరిగణింపఁబడియున్నది. పశుప్రాయుఁడగువాఁడు వివాహమును కేవలవినోదమని భావింపవచ్చును కాని యార్యులు పరమపవిత్రమగు ధర్మముగా పరిగణించియున్నారు. గృహస్థజీవనమును గొనియాడుచు, "అయజ్ఞో వా ఏష యోఽపత్నికాః" (పత్నీవిరహితుఁడగువాఁడు యజ్ఞవిరహితుఁడు) అని తైత్తిరీయ బ్రాహ్మణము వచించుచున్నది. మఱియు "అర్థో అర్ధో వా ఏష ఆత్మనః యత్పత్నీ" (ఆతఁడు, అనఁగా పతి సగపాలు, పత్నియే మిగిలిన సగపాలు) అనుటచే భార్యాభర్త లిరువురును గలిసి యేకవ్యక్తియను నుత్కృష్టభావము వేదముల ప్రకటింపఁబడియున్నది. వైదిక వాఙ్మయమున గృహిణికిఁ గల నామములగు అర్ధాంగి, పత్ని, సహధర్మచారిణి మున్నగు పదములును మనోహరమగు నీ యర్థమునే ప్రకటించుచున్నవి. వేయేల, గృహస్థ

ధర్మమునకును సాంఘిక జీవనమునకును ప్రాపగు గృహ మునుగూర్చి "జాయేద స్తం"* జాయయే గృహమనియు "న గృహం గృహమిత్యాహుః గృహిణీ గృహముచ్యతే"†— ఇల్లనఁగా గోడలు, పెంకులు ద్వారబంధములు గావు, ఇల్లాలే యిల్లనియుఁ జెప్పఁబడియున్నది. గృహధర్మనిర్వ హణ సమర్థమగు ప్రాయముననే ప్రాచీనార్యసమాజమున స్త్రీపురుషులు వివాహితు లగువారు.

శోచనీయమగు బాల్యవివాహము లిటీవల బయలు దేఱినవనుట కనేకనిదర్శనములు కలవు. వివాహకర్మకలాప మును వైదికమంత్రములను పరిశీలించినచో నీవిషయము మనకుఁ దేటతెల్లము కాఁగలదు. వివాహపరిసమాప్తికై భర్తృగృహమున కేఁగునపుడే వధువచట నెలకొని గృహిణీ కృత్యములనన్నిటిని చక్కఁగా నిర్వహించుటకై వెడలు చున్నదని తెలుపు ఋక్కు లనేకములు గలవు.‡ వివాహ మాదిగ వధువు భర్తృగృహమున నుండుట వేదకాలము

---

* ఋగ్వేదసంహిత, 3. 53. 4.

† మనుధర్మశాస్త్రము.

‡ "పూషా త్వేతో నయతు హస్తగృహ్యాశ్వినా త్వాం ప్రవహతాం రథేన।
గృహాన్గచ్ఛ గృహపత్నీ యథాసో వశినీత్వం విదథమావదాసి॥"
—ఋగ్వేదసంహిత, 10. 85. 26.

అర్థము:—"పూష చేయిపట్టుకొని నిన్నిచటినుండి (పితృగృహము నుండి) వెలోకప్రదేశమును (భర్తృగృహమును) బొందించుఁగాక! అశ్వినీదేవతలు రథమున నిన్నచటికి వెడలఁజేయుదురుగాక! భర్తృ గృహమున కేఁగుము. నీవు గృహస్వామినివై గృహమందున్నవాని నన్ని టిని వశమొనర్చుకొని పతిగృహముననున్న భృత్యాదిజనము నాజ్ఞాపించు చుండుము."

నందలి యాచారమని తెలియనగును. * అవ్యక్తరాంధ్రు ప్రాచీనార్యసమాజమున గృహిణులై యుండిరని తలంచుట వైదికనాగరకత కేగాక, వైదికవిజ్ఞానమునకంతకును మహాప చారముచేయుట యగును. యుక్తవయస్సున వేదకాలస్త్రీలు వివాహితలై గృహిణు లగుచుండిరన్నచో, నంతవఱకును వారు బ్రహ్మచారిణులై పురుషులవలెనే యే ఋష్యాశ్రమము ననో విద్యాభ్యాసము చేయుచుండెడివారు. బ్రహ్మచర్య మును విద్యాభ్యాసమును దోఁబుట్టువులుగదా! ప్రాచీనార్య సంఘమున బాలికలు బాలురవలెనే యుక్తకాలమున నుప నయన సంస్కారము నొంది వైదికాచారముల నవలం బించుచు వేదవిద్యాభ్యాసము సాగించువా రనుటకు సనాతన స్మృతివాక్యములే మనకుఁ దార్కాణములు. యమస్మృతి యిట్లు తెలుపుచున్నది :

"పురాకల్పే కుమారీణాం మౌఞ్జీ బన్ధన మిష్యతే,
అధ్యాపనఞ్చ వేదానాం సావిత్రీ వచనం తథా.

—పూర్వకాలమున బాలిక లుపనయనమునొంది వేదములను బోధించుట కేమి, సావిత్రీ మంత్రమును జపించుట కేమి, యధికారిణులై యుండిరి."†

---

* "ప్రేతో ముఞ్చామి నాము తస్సు బద్ధా మము తస్కరమ్" —ఋగ్వేదసంహిత, 10. 85. 25. అర్థము:—(వరుణుఁ డిట్లనును) "ఈమెను పితృగృహమునుండి విడిపించుచున్నాను, కాని భర్తృ గృహమునుండి విడిపింపను. ఇచట నీమెను బద్ధురాలినిఁ జేసినాను."

† ఈ శ్లోకము మేము చూచిన యమస్మృతియొక్క ప్రస్తుతముద్ర ణములందుఁ గానరాకున్నది. కాని సుప్రసిద్ధుఁడగు శ్రీ మాధవాచార్యుఁడు

మఱియు స్త్రీలు వేదకాలముునను పౌరాణికకాలము ననుగూడ స్వయముగా యజ్ఞముల నొనర్చుచుండినట్లు తెలియనగును. యజ్ఞముల నొనర్చుటయేగాక, విశ్వవార, ఘోష, వాక్ మున్నగు తపస్వినీమణులు స్వయముగా మంత్రద్రష్టృలై ప్రకాశించుచున్నారు. విశ్వవార స్వయముగా హోమమొనర్చి దేవతలను తృప్తినొందించినట్లు ఋగ్వేదము తెలుపుచున్నది. (చూ. ఋ. సం. 8. 28. 1.) పౌరాణికవాఙ్మయమును జూచినచో, కౌసల్య స్వయముగా స్వస్తియాగము నొనర్చినట్లును సీత యుదయసాయంసమయములందు పురుషులవలెనే వైదికవిధులను నెఱవేర్చినట్లును రామాయణమునఁ గాంచనగును. (చూ. వాల్మీకి రామాయణము, 2. 88. 18–19; మఱియు 5. 15. 48.) స్త్రీలు వైదికయజ్ఞములను నిర్వహింప నధికారిణు లని తెలుపుటకై జైమినిసైతము బాదరాయణవచనముల నుదాహ

---

పరాశరసంహితకు వ్యాఖ్యానమొనర్చుచు యమస్మృతియందలిదని యీ శ్లోకము నుదాహరించియున్నాఁడు: (చూ. 83-వ పుట, బొంబాయి సంస్కృతగ్రంథమాలాముద్రణము.) పురాణదృక్పథమున నిట్టి యంగీకారము పూర్వకల్పములకుఁ జెల్లునేకాని ప్రస్తుతకాలమున స్త్రీల కుపనయన వేదాధ్యయనములు తగవని చూపుటయే యీ శ్లోకము నుదాహరించుటలో శ్రీ మాధవాచార్యుని యభిప్రాయమని గ్రహింపనగును. కాని చారిత్రకవిమర్శకున కియ్యది విద్యావిషయమున నేమి, యాచారవిషయమున నేమి, స్త్రీపురుషులు ప్రాచీనార్యసంఘమున సమానప్రతిపత్తిగలవారని వెల్లడింపకమానదు.

రించియున్నాఁడు. ఉపనయన వేదాధ్యయనములు స్త్రీలకు నుండెనని దీనివలనఁ దెల్లమగుచున్నదికదా! *

స్త్రీవిద్యావిషయమై కాలక్రమమున జనించిన భేదాభిప్రాయమే ద్విజులలో ముఖ్యముగా బ్రాహ్మణవైశ్యులలో బాల్యవివాహములు ప్రబలుటకు ముఖ్యకారణమని చెప్పనగును. స్త్రీల కుపనయనసంస్కారము విరమింపఁబడిన నాఁటినుండియు నించుమించుగా వారల విద్యాభ్యాస మడుగంట నారంభించెను; వారల గృహస్థజీవనమునను తన్మూలమున భారతసాంఘిక జీవనమునను శోచనీయమగు

* మహారాష్ట్రవిద్వాంసుఁడగు నల్టేకర్ ననుసరించి (చూ. 'Women in Hindu Civilisation'—హైందవ నాగరికతయందలి స్త్రీలు) మన మీ క్రిందివిషయములను గ్రహింపవచ్చును:—స్త్రీలు పైనిఁ జెప్పఁబడిన యధికారముల నించుమించుగాఁ గ్రీ. శ. మొదటిశతాబ్దమువఱకును గలిగియుండిరి. కాని క్రమముగా మార్పులు కలుగసాగెను. ఉపనయనానంతరము కొందఱుస్త్రీలు — బ్రహ్మవాదినులు — వేదములను ప్రత్యేకముగా నభ్యసింప, స్త్రీజనసామాన్యము—సద్యోవధువుః—వివాహమునకు పూర్వము నామమాత్రమగు నుపనయనసంస్కారము నొందుచుండిరి. ఇయ్యది క్రీ. పూ. ఐదవశతాబ్దమునాఁటి పరిస్థితియని హారీతస్మృతివలన గ్రహింపనగును. బ్రహ్మవాదినులు వివాహమును మాని తపస్వినులై వెలయుచుండిరి. (జనకునిసభలో యాజ్ఞవల్క్యుని పరీక్షించినది గార్గి యను నిట్టి తపస్వినీమణియేకదా!) కొన్ని శతాబ్దములకుఁ బిమ్మట మనువు వైదికమంత్రరహితముగా స్త్రీల కుపనయనము నంగీకరించెను. (చూ. మనుస్మృతి, 2. 66.) తరువాతి స్మృతికారులగు యాజ్ఞవల్క్యప్రభృతులు (క్రీ. శ. రెండవశతాబ్దమున) అంతకంటె ధారాళమైన మార్గ మవలంబించి స్త్రీల కుపనయనమే పనికిరాదనిరి. ప్రాచీనార్యశాఖీయులగు జొరాస్ట్రియమతస్థులు నేఁడును బాలికలకీ సంస్కారము నొనర్చుచుండుట గమనింపఁదగిన విషయము.

మార్పులు సంభవింపసాగెను. స్త్రీల కుపనయనము విర మించుట పైకి స్వల్పవిషయముగాఁ గాన్పించినను, ఆర్యుల కుపనయనమన బ్రహ్మచర్యప్రారంభమనియు, బ్రహ్మచర్యమని నంతనే వేదవిద్యాభ్యాస నిష్ఠయనియు స్ఫురింపక మానదు. మఱియు నుపనయనసంస్కారము నొందనిదే యెవ్వారును వేదవిద్యాభ్యాసమునకుఁగాని వైదికధర్మానుష్ఠానమునకుఁ గాని యధికారులు గాకుండి రనుసంగతి మనము గమనింప వలసియున్నది. స్త్రీల కుపనయనము మానుటచే నార్య విద్యావిధానమును గురుకులవాసమును వారలకు వెలియయ్యె ననుట తెల్లము.

అటులైనచో, కాలక్రమమున హైందవధర్మశాస్త్ర కర్తలు స్త్రీల నలక్ష్యముచేసి వారల విద్యావిషయమునెడ విముఖులైయుండిరాయనియు స్త్రీలను శాశ్వతముగా బాని సలుగా—ఇచ్చవచ్చినరీతి నుపయోగించుకొను నాస్తిగా— గణించుట వారి యభిప్రాయమాయనియు శంకింపవచ్చును. అది వారి యభిప్రాయ మెన్నఁటికిని కాదు. వివాహమే స్త్రీల కుపనయన ప్రయోజనమును నెఱవేర్పఁగలదనియు (చూ. మనుస్మృతి, 2. 67.) విద్యాభ్యాసమునకై యే గురువు నొద్దకో వెడలుటకు బదులు స్త్రీ తన భర్తయొద్దనే విద్య నేర్వవచ్చుననియును వారిభావము. ఉపనయనము బాల్యము ననే జరుగవలయును గాన, నందులకు ప్రతియగు వివాహ మును స్త్రీలకు బాల్యముననే జరుగవలయునని తాత్పర్యము. కోమలమానసముననే యుత్తమాశయములు హత్తుకొనును గాన, తన గురునియాశయములను గ్రహించి బాలుఁడు

సుశీలవ్రతుఁ డగుటకై చిఱుతప్రాయముననే గురువు నాశ్ర యింపవలయును. అటులనే బాలికయు పలువిధములగు భావములును లౌకికసంసర్గములును మనస్సున వేరుపాఱక మునుపే—ప్రత్యేకాభిరుచులను సృజింపకమునుపే—భర్తృ సాన్నిధ్యమును బొందిననేకాని యాతని యాశయముల తోడను ఆదర్శములతోడను మనఃపూర్వకముగా నేకీభవింపఁ జాలదు; నిజముగా నాతని సహధర్మచారిణి కాఁజాలదు. భర్తయగువాఁడు—ఈ స్మృతికారుల మనము ననుసరించి— బ్రహ్మచర్యవ్రతమును దీర్ఘకాలము నెఱపి విద్యాశీలముల నార్జించియున్నవాఁడు కావున తన బాలభార్యకు విద్యాబుద్ధు లను గఱపఁగలఁడు. ఇదియే యాతని ప్రథమకర్తవ్యము; సంతానోత్పాదన కుటుంబపోషణాదికములు తరువాతి విషయములు.

ఇదియే బాల్యవివాహాదర్శము. ఐనను ఆదర్శముల కును అనుభవములకును దఱచుగా హస్తిమశకాంతరము గాన్పించుచుండును. బాల్యవివాహ విషయ మిందులకు భిన్నముకాదు. ముఖ్యముగా నేఁటి సాంఘిక జీవనపరిస్థితు లలో బాల్యవివాహము వరునకు నిర్దేశించు లక్షణములు గగనకుసుమములు. బాల్యవివాహవాదము ననుసరించి వరుఁడు నిజముగా జితేంద్రియుఁడై భార్యయెడ భోగ్య భావమును విడిచి యాత్మభావము నవలంబించిన మహాని యుఁడై యుండవలయును. కాని యిట్టి ఋషిపుంగవులు కోటికొకరైనను గలరని చెప్పఁగలమా? బాల్యవివాహము నకు గుఱియైనవారు తల్లక్ష్యము నలక్ష్యముచేయుచుండు

టబ్బురము కానేరదు. సమష్టికుటుంబజీవన విధానము సజీవమై వఱలిన సమయమున, తలిదండ్రులవలనను బెద్దలవలనను సుశిక్షణము బిడ్డలకు పుష్కలముగా లభించిన సమయమున, బాల్యవివాహవిధానమువలని చెడుగులు చాలవఱకుఁ దొలఁగింపఁబడినవనుటకు సందియము లేదు.

కాని, జనబాహుళ్యమున నేఁడు బాల్యవివాహములు స్త్రీవిద్యకు గొడ్డలిపెట్టై, లక్కపిడతలతో నాడుకొనవలసిన ప్రాయమున లక్కపిడతలంతటి బిడ్డలకు బాలికలను దల్లులుగాఁ జేయుచుండుట శోచనీయము! స్మృతికారులు తలఁపకున్నను అగ్నికి వాయువు తోడైనట్లు స్త్రీబాల్యవివాహములకు పురుష బాల్యవివాహములు తోడగుట మఱియు శోచనీయము.

ఐనను బాల్యవివాహాదర్శ మొకానొకచో సాధ్యమగుటయుఁ గలదు. తగిన వాతావరణము సమకూరుచో నియ్యది యమితాశ్చర్యకరమగు ఫలముల నొసఁగఁగలదు. మాతృదేవి జీవితమే యిందులకు నిదర్శనము. ఐదేండ్ల పసిబాలిక యిరువదిమూఁడేండ్ల యువకునకు వివాహ మొనర్పఁబడియున్నది, కనుఁడు. కాని యీ యువకుఁ డెవ్వఁడు? పరమహంస, జగద్గురువరేణ్యుఁడు. బాలికయో, నవయౌవన ప్రాయమునఁ దా నా మహనీయుని యాశయములను సంపూర్ణముగా గ్రహించి యవలంబింపఁగలిగిన సాధ్వీమతల్లి, యోగినీమణి. కావుననే యీ పుణ్యదంపతుల జీవితమున నూతన దాంపత్యాదర్శము—కామకళంక మణుమాత్రమును గానరాని యలౌకిక ప్రేమాదర్శము — పరమేశ్వరైకార్పిత జీవి

తాదర్శము—దేదీప్యమానమై భాసించినది. ఈ దివ్యాదర్శమున పతి తనసతికి ప్రాణప్రియుఁడేకాక ప్రాణమిత్రుఁడై, గురువరేణ్యుఁడై పారమార్థికజీవనరహస్యములనెల్ల కరతలామలక మొనర్చెను. సతియో, పతికి నిజముగా సహధర్మిణియై, యర్ధాంగియై, పతిజీవితాదర్శములను హృదయంగమ మొనర్చుకొని, యాతని యనంతర మాతని మహోద్యమమును గొనసాగించి విశ్వమానవకల్యాణమునకై జీవితమును సమర్పించెను. ఇదియేకదా వివాహపరమార్థము!

క్రమానుగతమగు నీదివ్యాదర్శసాఫల్యమే మాతృదేవి జీవితచరిత్ర. ఈ మహాసంఘటనమునకు మూలమగు శారదా రామకృష్ణుల వివాహమునుగూర్చి యిఁక ముచ్చటింతుము.

బాలశారదామణి జయరాంబాటిలో దినదినప్రవర్ధమానమై కల్యాణగుణప్రకాశము నందుచుండ నీమె ప్రాణేశ్వరుఁడు కానున్న మహనీయుఁడు వేఱొకతావున—దక్షిణేశ్వర వనమున—పారమార్థిక సాధననిమగ్నుఁడై యాత్మవికాసము నందుచుండెను. జయరాంబాటి కామడదూరముననున్న కామారిపుష్కరము (Kamarpukur)న క్షుదిరామచట్టోపాధ్యాయుఁడు, చంద్రమణీదేవియు నను సుగుణఖనులకు—మహాభక్తులకు — తృతీయపుత్త్రిరత్నమై మన్మథనామ (1836-వ) సంవత్సరమున* నుదయించి శ్రీరామకృష్ణుఁడు 1855-వ సంవత్సరమున దక్షిణేశ్వర కాళికాలయమున

* ఫాల్గునశుక్ల ద్వితీయా గురువారమున పూర్వభద్రనక్షత్రయుక్త కుంభలగ్న శుక్రనవాంశమం దుదయ మించుమించుగా గం.5 ని.15 లకు.

అర్చకుఁడై దేవి నుపాసించుచుండెను. పసితనముననే భక్తి ప్రసూన మాతని హృదయసీమయందు వికసింప నైహిక విషయము లాతని నెంతమాత్రము నాకర్షింపఁజాలవయ్యెను. పొట్టకూటి చదువులతోఁ దనకెట్టి జోక్యము వలదనియు బ్రహ్మజ్ఞానమే తనకు వరణీయమనియు నిశ్చయించుకొని యాతఁడు తన యన్నయు పండితుఁడునగు రామకుమారునకుఁ దన మనోనిశ్చయమును నిర్భయముగా బాల్యముననే వెల్లడించియుండెను. పరమేశ్వర సాక్షాత్కారమునకై యాతఁడు పరితపింపసాగెను. ఆ హృదయమథనమున నాతనికి బాహ్యలోకము స్ఫురించెడిదికాదు. ఆలయమున సేవచేయు టాతని కసాధ్యమైపోయెను. ఆలయనిర్వాహకుఁ డది గ్రహించి సాధనకువలయు సమస్తసదుపాయములను సమకూర్చ, శ్రీరామకృష్ణుఁ డఖండభగవత్పరితాపముతో, అపూర్వాశయములతో, ధ్యానాదిసాధనలందు నిమగ్నుఁడయ్యెను. నిద్రాహారములమాటయే యాతఁడు మఱచెను.

అర్థికచింతయే కాని పారమార్థికచింతయన నెట్టిదో యెఱుఁగని లోకు లాతనికి మతిపోయినదని చెప్పుకొనసాగిరి. ఈ వదంతులను విని కలవరపడి తల్లి చంద్రమణీదేవియు రామేశ్వరుఁడను సోదరుఁడును 1858–వ సంవత్సరమున నాతని స్వగ్రామమునకు రావించిరి. ఆతని సంసారవిముఖతను పరితాపమును గాంచి వారు విచారగ్రస్తులైరి. 'పులిమీఁద పుట్ర' యనునట్లిరుగుపొరుగువా రాతనికి పిశాచము సోకినదని గుసగుసలాడ నారంభింప, తల్లి చంద్రాదేవి మంత్రవాదులను బిలిపించి మంత్రచికిత్స చేయించిచూచెను.

కాని యా మంత్రితభూతము లాతనికెట్టి వ్యాధిగాని, యాధిగాని లేదని వెల్లడించెను. చంద్రాదేవియు రామేశ్వరుఁడును విశేషమాలోచించి, పెండ్లి చేసినచో నంతయుఁ జక్కఁబడు నని తగిన పెండ్లికూఁతునిమిత్తము ప్రయత్నింపసాగిరి.

కాని (నాఁటి సాంఘికసంప్రదాయముల ననుసరించి) తగినకట్నమీయనిదే మంచిసంబంధము దొరకుట దుర్లభముగ నుండెను. శుల్కమిచ్చునంతటిశక్తి రామేశ్వరునకు లేదయ్యె. మీఁదుమిక్కిలి పెండ్లిప్రయత్నవిషయము తెలిసినచో గదాయి* సర్వము పాడుచేయునేమో యను భయము తమ్ము బాధింప, చంద్రాదేవియు రామేశ్వరుఁడును నిరాశులైరి. రహస్యముగా నెంత వెదకించినను సంబంధము కుదురదయ్యె. కాని, యాశ్చర్యము, పెండ్లివిషయ మెట్లో తనకుఁ దెలిసినంతనే శ్రీరామకృష్ణుఁడు వెంటనే తనసమ్మతినిఁ దెలుపుటయేగాక, చింతాక్రాంతులై యున్న తల్లికిని, అన్నకును దివ్యావేశమున నిట్లు వచించెను: "ఇచ్చవచ్చిన చోటులనెల్ల మీ రెంత వెదకినను నిష్ప్రయోజనము. జయరాంబాటికి వెళ్లుఁడు, రామచంద్రముఖోపాధ్యాయునింట నాకోసము నియమితురాలైయున్న యామె మీకు దొరకును!" †

---

* శ్రీరామకృష్ణుని చిన్ననాఁటి పేరు 'గదాధరుఁడు',—దానికిది ముద్దుపేరు.

† ఈ వివాహమునుగూర్చి మఱియొక యైతిహ్యము కలదు. మాతృదేవికి రెండేండ్లప్రాయమున నామె తల్లి సమీపగ్రామమగు సిహారునకు దేవాలయోత్సవమును జూచుటకై బాలికతోఁగూడ వెడలియుండెను. పిల్లలతో వినోదించుట స్త్రీలకు సహజము కావునఁ గొందఱు స్త్రీలచట సమావేశమైయున్న బాలురను బాలశారదకుఁ జూపి, "వీరిలో నెవరినిఁ

మొదట వారీ మాటలను నమ్మలేదు. 'ఐనను జూత' మని రామచంద్రునింటికి వెడలి కనుఁగొనిరమ్మని యొకనిఁ బంపిరి. రామచంద్రుఁడు వెంటనే తనసమ్మతినిఁ దెల్పినను వధు వైదేండ్ల బాలికయగుటయు శ్రీరామకృష్ణుఁ డిరువదిమూఁడేండ్లు దాఁటినవాఁడగుటయుఁ బెండ్లికూఁతున కీడు చాలదేమోయని మొట్టమొదటఁ గొంచెము సంశ యించిరి. ఏమైనను నంతకంటె మంచిసంబంధమేమియు లభింపమి ఆ సంబంధమునకే యంగీకరించిరి. అచిరకాల మున నే బాలశారదకును శ్రీరామకృష్ణునకును జయరాం బాటిలో సిద్ధార్థినామసంవత్సర వైశాఖమాసమున (1859-వ సంవత్సరము మే నెలలో) వివాహము జరిగెను.* అనంతరము పెండ్లికూఁతును కామారిపుష్కరమునకుఁ దీసికొనివచ్చిరి. రామేశ్వరుఁ డీ వివాహమునకై మూఁడువందల రూపాయల శుల్కము నీయవలసివచ్చెను.

---

బెండ్లియాడుదువమ్మా?'' యని ప్రశ్నింప, విచిత్రము, శారదాదేవి తన చిన్నివ్రేలితో శ్రీరామకృష్ణునిఁ జూపెనఁట!

* తనవివాహకాలమునుగూర్చి మాతృదేవి యిట్లు చెప్పుచుండెడిది: ''ఈఁతపండ్లు పండుకాలమున నాకుఁ బెండ్లియైనది. సరిగా నది యే నెలయో నాకు జ్ఞప్తిలేదు. పెండ్లియైన పదినాళ్లలోపున నేను కామారిపుష్కరమునకు వెళ్లినప్పు డక్కడ ఈఁతపండ్లు గెలలనుండి తుంపినాను. (కామారిపుష్కరమున భూస్వామియుఁ బొరుగువాఁడును నగు) ధర్మదాసులాహా వచ్చి, నన్నుఁ జూచి, ఈ పిల్లయేనా పెండ్లి కూఁతురు!'' అని యాశ్చర్యపడెను. ఏలన, కామారిపుష్కరమునకు నన్నపుడు సూర్యునితండ్రి యొడిలో నెత్తుకొని తీసికొనివచ్చెను, నేనపు డంతటి పసిదానను.''

ఇరువంకలను బెండ్లివా రతిసామాన్యసంసారులు కావున నుత్సవాడంబరముగాని, దానవైభవముగాని లేక పెండ్లియు నతిసామాన్యముగనే జరిగెను. ఐనను చంద్రాదేవి పొరుగుననున్న ధనవంతమగు లాహాకుటుంబమునుండి నగల నెరువు తెచ్చి పెండ్లికూఁతునకుఁ బెట్టెను. కామార్పుకురమునకు వచ్చిన యచిరకాలముననే నగల నిచ్చి వేయవలసిన సమయమును వచ్చెను. కాని యా నగలను తనముద్దుకోడలును అమాయకురాలునగు నా బాలికయొద్ద నుండి తీసికొనుటకు చంద్రాదేవికిఁ జేతులురావయ్యె. ఇది గని శ్రీరామకృష్ణుఁడు బాలిక నిద్రపోవుచుండఁగా నిపుణముగా నగలనన్నిటినిఁ దీసివైచి లాహాకుటుంబమునకుఁ బంపివైచెను. బాలిక లేచి చూచుకొనునుగదా, నగ లేవి! తన నగలు పోయినవని, (ప్రాయశః) కండ్లనీరు వెట్టుకొని, యామె యందఱితోఁ జెప్పనారంభించెను. చంద్రాదేవి యామెను గౌఁగిలించుకొని, "చిట్టితల్లీ! విచారింపకు. మా నాయన గదాధరుఁడు (శ్రీరామకృష్ణుఁడు) నీకింతకంటె మంచినగలను జేయించిపెట్టును లెమ్ము" * అని యోదార్చెను. ఇంతలకుఁ దోడపు డచటనుండిన శారదాదేవి పినతండ్రి యీ సంగతివిని కోపించి యానాఁడే పిల్ల నింటికిఁ దీసికొని పోయెను. కాని శ్రీరామకృష్ణుఁడు నర్మగర్భముగా నవ్వి,

---

* నిజముగా శ్రీరామకృష్ణుఁడు కాలాంతరమున నామెకుఁ గొన్ని వందలరూపాయలను బెట్టి నగలను జేయించెను. మాతృదేవి వానిలోఁ గొన్నిటిని తుదివఱకును ధరించెడిది. ఎనిమిదవ ప్రకరణముఁ జూడుఁడు.

"ఇప్పు డెవ రేమిచెప్పినను పెండ్లిమాత్రము రద్దుచేయలేరు గదా!" యని తల్లిమనస్సు నూరడించెను.

శ్రీరామకృష్ణుఁ డాచారముననుసరించి కొన్ని నెల లైనవెనుక యత్తవారింటికి వెడలి కొన్నిదినములు గడపెను. ఆ సమయమున మాతృదేవి తా నేడేండ్ల బాలికననియు స్వయముగా అభివందనమున పతిపాదములను స్పృశించి యాతనికి వీవనతో విసరితిననియు, నపు డచట నున్నవా రందఱు నది గని నవ్విరనియు కాలాంతరమున స్మరించెడిది.

ఆటలలో మైమఱచియుండు పసితనముననే మాతృ దేవి తనహృదయసింహాసనమును శ్రీరామకృష్ణపరమహంస కెటు లర్పించెనో!

శ్రీరామకృష్ణునకు సన్నిహితుఁడగు హృదయరాముఁ డా సమయమున నాతనితో నచటికి వెడలియుండెను. అతఁడు పద్మములను గైకొని మాతృదేవిపాదపద్మములను పూజింప నామె నిశ్చేష్టురాలయ్యెను.

అచిరకాలముననే శ్రీరామకృష్ణుఁడు సతీసమేతుఁడై కామారిపుష్కరమునకు వచ్చి, కొన్నిదినము లుండి, మఱల కలకత్తాయందలి దక్షిణేశ్వరకాళికాలయమునకు వెడలెను. మాతృదేవియు జయరాంబాటికిఁ దల్లిదండ్రులయొద్దకు మఱలెను.

## నాల్గవ ప్రకరణము

## దక్షిణేశ్వర యాత్ర

కాలవాహిని పాఱెను. సంవత్సరములు గడచెను. శ్రీరామకృష్ణుఁడు దక్షిణేశ్వరమున ఆత్మసాధననిమగ్నుఁడై బ్రహ్మానందామృతపానమత్తుఁడై యుండ దినములు క్షణములై గడచుచుండెను. ఆతని వినిర్మలమానస సరోవరమున శారదాదేవి భావవీచిక లెన్నఁడైనను బయల్వెడలుచుండెనా? ఆ నిశ్చలతను గలంచుచుండెనా? శరీరస్మృతియే యందు భాసింపనిచో నితరవిషయము లెట్లు పొడకట్టును? కలంచును?

అట జయరాంబాటియందు బాలశారదాదేవి నవయౌవనమునంద, శరీరసౌష్ఠవమునకు మనోవికాసము మర్యాద నొసఁగఁ, బదునెనిమిదేండ్ల ప్రాయమున నొప్పుచుండెను. ఆమె మానసదిశావలయమున ప్రాణప్రియ భాస్కరుఁడు ప్రకాశింపసాగెను. పదునాలుగేండ్ల ప్రాయమున నామె తనహృదయేశ్వరుఁడు కామారిపుష్కరమునకొకసారి వచ్చినపు డాతనిపావనసాంగత్యమున మూఁడు మాసములు గడపియుండెను. ఆ సమయమున నాతని వినిర్మల ప్రేమానురాగములను జవిచూచి యాతఁడు కరుణామయుఁడని గ్రహించియుండెను. భగవద్భక్తియందు, మనోనైర్మల్యమునం దాతఁ డసాధారణవ్యక్తియే యగుఁగాక,

ఐన నితర విషయములలో — బాంధవప్రేమానురాగము లలో — మానవ స్వభావమున కిసుమంతయుఁ గొఱవడిన వాఁడు కాఁడే! ఆతని ప్రవర్తనమున నామెకు వైచిత్ర్య మేమియు—వైపరీత్యమేమియుఁ—గాన్పింపలేదు. తనయెడ నపు డాతఁడు చూపిన యాదరాతిశయమున స్వార్థరాహిత్య మును నవనీతకోమలమానసమును ప్రతిబింబించుచున్నటు లామె గాంచెను. భగవానునిగూర్చియు పారమార్థికజీవిత మునుగూర్చియు సాంసారికవిధులనుగూర్చియుఁ దన కపు డాతఁ డొనరించిన బోధనలు మానసఫలకమున శాశ్వత ముగా ముద్రితములైనవి. "పతి ర్హి దైవతం నార్యాః, పతి ర్బన్ధుః, పతి ర్గతిః, ప్రాణైరపి ప్రియం తస్మాత్ భర్తుః కార్యం విశేషతః" యని తనబాల్యమునుండియుఁ బెద్దల వలనను పురాణేతిహాసములవలనను పూర్వాచారమువలనను నేర్చిన భారతీయసతీమణికిఁ దన ప్రాణేశ్వరుని ప్రేమాదర ములను జూఱకొనుటకంటె నానందసంధాయకమగునది వేఱొండు కలదే? ప్రాణవల్లభునితోఁ దన కొనఁగూడిన యీ ప్రథమ సమావేశము మాతృదేవి కిక్కారణమున మఱువరానిదై దీపించెను. ఆ దినములలోఁ దా ననుభవించిన బ్రహ్మానందమునుగూర్చి కాలాంతరమునఁ దన శిష్యురాండ్ర కామె యిట్లు తెల్పుచుండెడిది: "నా యంతరంగమున నపు డమృతభాండము నుంచినట్లు తోఁచెడిది. ఆ సమయమున నాకిది నిరంతరానుభవము. ఆ యనుభవము, ఆ యానందము, ఇట్టిదని తెలుపఁజాలను!"

ఆ యానందసాగరమున నోలలాడిన యనంతర మనేకసంవత్సరములు గడచినవి. జీవితేశ్వరునితోఁ గలిగిన యీ దివ్యసంసర్గ మామెయంతరంగమున అపూర్వశాంతిని, అంతరంగికదృష్టిని పాదుకొల్పుటయే గాక, స్వార్థరహిత సేవల నొనర్పవలయు నను సమంచిత భావమును విషమ పరిస్థితులందు సైతము కలఁతనొందని వినిర్మలతృప్తిని నామె హృదయమున నెలకొల్పెను. ఏమైనను, మృదులసతీహృద యము పతిసన్నిధి నుండవలయునని కాంక్షించును గదా? ఆతని సంసేవనమునకై, ప్రేమామృత సేచనమునకై యారాట మొందునుగదా? కాని యీ కాంక్షను సైతము, ఆరాటమును సైతము శాంతింపఁ జేయుచున్నదో యను నంతర్వాణి యామె కిట్లు తెలుపసాగెను: "ప్రథమ సమా వేశముననే నీ యందంతటి ప్రేమానురాగములను జూపిన యా దయానిధి నిన్ను మఱచు ననుకొనఁబోకుము. సకాల మున నాతఁడే నిన్నుఁ దనచెంతకుఁ బిలుచును. ఆ పరమావ కాశము నిమిత్తము వేచియుండుము."

ఇట్లు తన హృదయాందోళనము నణఁచికొని తన యారాటము నిసుమంతయు వెల్లడింపకయే యామె పుట్టి నింట నిత్యకృత్యములలో నిమగ్నయై రేయింబవళ్లు గడపు చుండెను. ఊరిలోని యమ్మలక్కల గుసగుసలు చెవినిఁ బడి తన కోమలమానసమును కలఁతనొందింపనిచో నామె శాంత ముగాఁ దన ప్రాణప్రియుని పిలుపునకై వేచియుండెడిది. "శారదమగఁడు పిచ్చివాఁడై, దిగంబరుఁడై, 'హరి! హరి!' యని యఱచుచుఁ దిరుగాడుచుండె" నని యిరుగు పొరు

గమ్మలక్కలు చెప్పుకొనసాగిరి. అంతటితో వా రూర కుండిరా? కాలాంతరమున మాతృదేవియే శిష్యబృందమున కిట్లు తెలిపియున్నది: "ప్రాయమున జయరాంబాటిలో నున్నప్పు డెప్పుడును నేదియో యొకపనిలో నిమగ్నరాలనై యుండుదానను. ఇరుగుపొరుగుల కెన్నఁడును బోవుదానను కాను. ఏమందురా, నన్నుఁ జూచినదే తడవుగ, 'పాపము! శ్యామకూఁతును-శారదను-పిచ్చివాని కిచ్చిరి!' అని యిరుగు పొరు గమ్మలక్కలు గోలచేయువారు. ఈ యపవాదములు చెవినిఁ బడకుండుటకుఁగాను నే నెవ్వరియింటికిని బోవుదాననే కాను."

ఇట్టి ప్రలాపముల కాది నామె యిసుమంతయుఁ జెవి యొసఁగక, "కాకిమూఁకల గోలను పాటింపనేల" యని నిర్లక్ష్యము వహింప యత్నించెను. కాని సంశయధూమము క్రమముగా మనశ్శాంతినిఁ గ్రమ్ముకొనసాగెను. ఒకవేళ వారి యపనిందలు నిజమే యగుచో నేమి చేయుట? నాలు గేండ్లకు పూర్వము తాను జూచిన పావనాత్ముఁడు, ప్రేమ మూర్తియుఁ గాదా యిపు డాతఁడు? ఆతనికి మతిపోవుట నిజమా? సాధ్యమా? అగుచోఁ దాను బుట్టినింట కాలక్షేపము చేయుచుండుట తగునా? ఆతనిచెంత కేఁగి సేవచేయుట తన కర్తవ్యము కాదా? అత్యంతాప్తులకు సైతము తెలుపక యిట్టి సంశయపరంపరలతో నామె దినములు గడపుచుండెను. తుద కొకసారి స్వయముగా దక్షిణేశ్వరమునకు వెడలి పరిస్థితుల నరయుట మంచిదని నిశ్చయించుకొనెను.

అచిరకాలముననే యట్టి సదవకాశము లభించెను. శ్రీచైతన్యజన్మదినోత్సవసమయమున గంగాస్నానార్థమై కొందఱుస్త్రీలు—ఆమె దూరపుఁజుట్టములు—కలకత్తాకు వెడలనుండిరి. తానును వారి ననుగమించెదనని యామె వారితోఁ జెప్పెను. వల్లె యని వారా విషయమును రామచంద్రునకుఁ దెలిపిరి. తన కొమార్త కలకత్తాకు వెడలుటకు నిజమగు నుద్దేశమేమో రామచంద్రుఁడు గ్రహింపకుండునా? తానే యామెతో వచ్చెదనని యాతఁడు తెల్పెను.

శుభదినమును నిర్ణయించి; యాంగీరసనామసంవత్సర (1872–వ సంవత్సరము) ఫాల్గున మాసాంతమున వారందఱును యాత్రకు బయలుదేఱిరి. సుందరకేదారములును సూర్య చంద్రులు తమ సౌందర్యమును దిలకించుకొనుచు, తన్మయులై జాఱవిడిచిన దర్పణములోయన నొప్పు కాసారములును నెల్లెడలను గన్నులపండు వొనర్చుచుండ, వృక్షరాజములు సూర్యకిరణములనుండి తమ్ముఁ గాపాడుచుండ, వారందఱును మహానందముతో నడచుచు, యాత్ర సాగించుచుండిరి. ఇట్లు రెండుదినములు గడచినవి. అట్టి దూరయాత్రల కెన్నఁడును నలవడని మాతృదేవి మార్గమధ్యమున తీవ్రజ్వరమునకు గుఱియయ్యెను. రామచంద్రుఁడు ప్రయాణమును నిలిపి సమీపమున నున్న యొకసత్రమునఁ దన కొమార్త స్వస్థత నొందువఱకును నిలువవలసివచ్చెను.

యాత్రలోఁ దలవని తలంపుగాఁ గలిగిన ఈయాటంకమును దలఁచి మాతృదేవి యెంతయో వ్యాకులపడసాగెను. ఈ సమయమున నామె కొక దివ్యానుభవము గలిగెను.

దానినిగూర్చి కాలాంతరమున నామె తన శిష్యుల కిట్లు తెలిపెను : "జ్వరముచే నపు డొడలు తెలియక పడియుంటిని. ఆ సమయమున కాఱుమబ్బునుబోలు మేనిచాయగల యొకతె నా పక్కను గూర్చుండి యున్నట్లు గోచరించినది. నల్లనిదే యైనను నంతచక్కని స్త్రీని మఱెవ్వరిని నేఁ జూచి యెఱుఁగను. మృదువైన తన చల్లనిచేతులతో నామె నాతల నిమురుచుండ జ్వర ముపశమించుచున్నట్లు కనుఁగొంటిని. 'నీ వెక్కడినుండి వచ్చితివమ్మా!' అని నే నడుగ, 'దక్షిణేశ్వరము నుండి' యని యామె సమాధానించెను. అంత నేను నిర్ఘాంతపోయి తడఁబడుచు నిట్లంటిని: 'దక్షిణేశ్వరము నుండియా! నేనును నా పెనిమిటినిఁ జూచునిమిత్తము దక్షిణేశ్వరము వెళ్లుచున్నాను. కాని దురదృష్టవశమున నన్నీ జ్వరముదారిలో నాఁపివేసినది.' అంత నామె యిట్లు పలికినది: 'కలఁతనొందకు, శీఘ్రముగ నే నీకు నిమ్మళించును. దక్షిణేశ్వరమున నీ భర్తను జూతువు. నీ నిమిత్తమే నే నాతని నచట నుంచినాను.' నే నామె కిట్లంటిని : 'అలాగుననా? నిజమే! కాని నీవు నా కేమగుదువు?' 'నేను నీ యక్కను' అని యామె బదులుచెప్పినది. అది విని నిశ్చేష్టురాల నైతిని. ఈ సంభాషణ మైనంతనే నాకు గాఢనిద్ర పట్టినది."*

---

* మాతృదేవిజీవితమున ప్రామాణికమగు దివ్యసంఘటనములలో నిది మొదటిది. బాల్యజీవితముననే కొన్ని యప్రాకృతవిషయములను గూర్చిన యైతిహ్యములు గలవు. వానిని నిరూపించుట కష్టసాధ్యమని యంగీకరించినను, శాస్త్రదృష్టితో వాని నిచట క్రోడీకరింతుము.

(1) ఆమె జననవిషయము: మాతృదేవి తల్లి యగు శ్యామసుందరీదేవి యొకప్పు డొక దేవతోత్సవమును జూచుటకై సమీపగ్రామమగు

మఱునాఁడు తెల్లవాఱుసరికి రామచంద్రుఁడు తన కొమార్తె జ్వరమునుండి తేఱుకొనుట చూచి సంతసించి యననుకూలమైన యా సత్రమున నిఁక నిలుచుటకంటె ప్రయాణము సాగించుటయే మేలని కొమార్తెతో బయలు దేఱెను. కొంచెము దూర మేఁగినంతనే యదృష్టవశమున వారొక పాలకిని గని దానిని గుదుర్చుకొనిరి. నాఁటి రాత్రి

---

సిహోరునకు వెడలియుండెను. ఆలయసమీపమున నామె యొకచెట్టుక్రిందఁ గూర్చుండియుండఁ గొంతగాలి తనలో ప్రవేశించి శరీరమును భారవంతముగా నొనర్చినట్లామెకుఁ దోఁచెను. ఆ సమయముననే కెంపురంగు పట్టుచీరను ధరించిన యైదారేండ్లబాలిక—దివ్యసుందరాంగి—చెట్టు దిగి వచ్చి తన మృదులహస్తములతో నామెను గౌఁగిలించుకొని, "తల్లీ! నేను మీ యింటికి వచ్చినాను!" అని పలికెను. ఆ బాలిక తన శరీరమున ప్రవేశించినట్లు తోఁచుటయు శ్యామసుందరీదేవి శరీరవిస్మృతినొందెను.

(2) మాతృదేవి యొకశిష్యునితో నిట్లు పలికినట్లు తెలియవచ్చుచున్నది: "నాయనా! నా చిన్నతనమున నొకబాలిక, సరిగా నావలెనే కాన్పించునామె, యెప్పుడును నాతో సంచరించుచుఁ బను లన్నిటిలో నాకుఁ దోడ్పడుచుండెడిది. నాతో నామె నవ్వుచు నాటలాడుచుండెడిది. నాకుఁ బదిపదునొకండేండ్లు వచ్చువఱకును నట్లు జరిగినది."

(3) పదుమూఁడేండ్ల ప్రాయమున మాతృదేవి యొకసారి కామారిపుష్కరమునకు వెడలెను. పిన్నవయసగుటచేతను, అత్తవారింటికిఁ గ్రొత్తయగుటచేతను స్నానార్థ మొంటరిగా నూరిబయటి చెఱువునకు వెడల భయపడుచుండెడిది. ఒకనాఁడు దొడ్డిగుమ్మమునుండి యీవలకు వచ్చి, తన చిక్కునుగూర్చి తలపోయుచుండ, నకస్మాత్తుగా నామె తనచెంత నెనమండ్రు స్త్రీలుండుట గాంచెను. వీధినిఁబట్టి యిఁక నామె చెఱువునకు వెడలుచుండ, వారిలో నలువు రామె ముందును, నలువురు వెనుకను నడవసాగిరి. హలధరపుష్కరమను నాచెఱువులో దిగి వారును నామెతో స్నానమొనర్చి తిరిగి యామెతో నింటికి వచ్చిరి. బహుదినములపర్యంత మిట్లు జరిగినది. కాని యా స్త్రీ లెవ్వరో నామెకుఁ దెలియలేదఁట.

మాతృదేవికి మఱలఁ గొంచెము జ్వరము తగిలినను నామె యెవ్వరికిని దెలుపక తండ్రితో ప్రయాణము సాగించెను. రాత్రి తొమ్మిదిగంటలగుసరికి వారు దక్షిణేశ్వరముఁ జేరిరి.

పతియే పరమేశ్వరుఁడని యాతని సేవింపవచ్చిన సతీమతల్లిని పరమేశ్వరాయత్తచిత్తుఁడగు పరమహంస యెట్లాదరించెనో తెలియుట కామెవచనములే మనకు నిదర్శనములు. సహజసరళవచనముల నామె యిట్లు తెల్పియున్నది: "ఇతరులు మాయత్తగా రుండిన నహబత్తునకు వెడల, నేను దిన్నఁగా, ఆయన గదిలోనికి వెళ్లినాను. ఠాకూరు నాతో నిట్లనిరి: 'ఆహా! వచ్చితివా! మంచిది.' నేలపై చాపవేయుమని యాయన యొకరికిఁ జెప్పి మఱల నిట్లనిరి: 'అయ్యో! నా మథురుఁడు* ఇపుడు జీవించియున్న నెంత బాగుండెడిదో కదా! ఆతనిమరణమువలన నా కుడిభుజము పోయినది.' మథురుఁడు కొలఁది నెలలకుపూర్వమే చనిపోయెను. అక్షయుఁడు (శ్రీ గురుదేవుని యన్నకుమారుఁడు)ను పోయెను. మథురుఁడే జీవించియున్న పక్షమున, ఆ బొమ్మరింటిలో—సదుపాయము లేశమును లేని యా నహబత్తులో—నేనుండవలసివచ్చెడిదా? నా నిమిత్తమాతఁడొక రాజభవనము కట్టించియుండెడివాఁడు. ఏమైనను ఠాకూరును జూచినతరువాత నేను నహబత్తునకు వెళ్లఁ గోరినాను. కాని యాయన యిట్లనిరి: 'వద్దు, వద్దు. ఇక్కడనే ఉండు. నహబత్తున వైద్యుఁడు నిన్నుఁ జూచుటకు శ్రమగా

* దక్షిణేశ్వరకాళికాలయమును నిర్మించిన రాణిరాసమణియల్లుఁడగు నీతఁడు ఆమెయనంతరము ఆలయసర్వాధికారి యయ్యెను. అధికారి యయ్యు నీతఁడు శ్రీరామకృష్ణునిభక్తుఁడై యాతనిసేవకై ధనమును ధారాళముగా వినియోగించువాఁడు.

నుండును.' రాత్రి యా గదియందే గడపినాను. నాకు జతగా నాతో నొకయామె పరుండినది. మేము వెళ్లినప్పటి కందఱి భోజనములును ముగియుటచే హృదయుఁడు మాకు రెండు మూఁడుదోసెండ్ల యటుకుల నిచ్చెను. మఱునాఁ డొక వైద్యుఁడు వచ్చెను. కొలఁదిదినములలో దేఱుకొంటిని. అనంతరము నహబత్తుగదిలో నివసించుటకుఁగాను వెళ్లినాను. మా యత్తగారపు డచట నివసించుచుండెడిది...."

ప్రాణేశ్వర సందర్శనమునకై స్వాతివర్షమునకు ముత్తెపుఁజిప్పవలె వేచియుండిన శారదాదేవి యాతని ప్రేమాదరములను జూఱకొనినప్పు డిఁక నామె యానందము నెవరు వర్ణింపఁగలరు? తన ప్రాణప్రియుఁడు పిచ్చివాఁ డని నిజముగాఁ బిచ్చివారగు లోకు లనుకొనుచుండిన మాట లిపు డామెకు ప్రలాపములై, హాస్యాస్పదములై తోఁచెను. "పంది కేమి తెలుసు పన్నీటిపరిమళ" మనునట్లు శ్రీరామకృష్ణు నఖండాధ్యాత్మిక ప్రతిభ—పారమార్థిక వైభవము—పలుగాకు లగు లోకుల కేమి తెలియును? తా నస్వస్థురాలై యున్న తఱిఁ దన చికిత్సనుగూర్చియు సదుపాయములనుగూర్చియు నాతఁ డెంతటి శ్రద్ధవహించెనో! పరితాపపడియెనో! ఆతని స్వార్థరహిత ప్రేమానురాగములను వినిర్మలవర్తనమును గూర్చి మాతృదేవి కిదివఱకే కలిగిన భావము లిపుడు సుస్థిరవిశ్వాసములై వఱలెను. స్వధర్మవిషయమున నిఁక సందియమేల? దక్షిణేశ్వరముననే యుండి తనప్రాణేశ్వరుని, పూజ్యురాలగు తనయత్తను సేవించుటయే తన కర్తవ్య మని యామె నిశ్చయించుకొనెను.

# ఐదవ ప్రకరణము

## అగ్నిపరీక్ష

అఱుగఁదీసిన కొలఁదియు చందనము సుగంధము వెలువరించు చందమున, నులిమినకొలఁదియుఁ జెఱకు నందలి సుధారసము చిప్పిలురీతిని పరీక్షాసమయములందే మహనీయుల సౌశీల్యగరిమయు నాత్మప్రభావమును లోకమునకు విశేషముగా వెల్లడియగుచుండును. కామోపభోగములకుఁ గల్పక మనఁ దగు నవయౌవనప్రాయమున శారదా రామకృష్ణు లొండొరులతో నివసించియు భగవదేకార్పితచిత్తులై విషయసుఖములు హేయము లని తమ యకలంకజీవితముచే లోకమునకుఁ జాటిరన్నచో, వా రెట్టి యగ్నిపరీక్షలో విజయము నందిరో తెలియఁగలదు.

సమస్తసంగములను పరిత్యజించి, కాళీలగ్నమానసుఁడై తపోధ్యానాదికములతోఁ బ్రొద్దులు పుచ్చుచుండిన తాపసోత్తముఁడు, శ్రీరామకృష్ణుఁడు, నవయౌవన శోభిత శారదాదేవినిఁ గనుఁగొని, "ఆహా! వచ్చితివా! మంచిది!" అని దివ్యాదరమును జూపి యామె తన సన్నిధినుండ నామోదించుటకు హేతువేమి?

పవిత్రజీవయాత్రాపథమున సహధర్మచారిణితో పురోగమించుచుఁ దన దివ్యాశయములయందు తన యర్ధాంగిని సుశిక్షితురాలి నొనర్చుట భర్తయగు తన ప్రధానధర్మమని పరిగణించుటయే యిందులకు ముఖ్యకారణ మని చెప్పనొప్పును. మఱియుఁ దన యింద్రియనిగ్రహమును భావసంశుద్ధిని పరీక్షించుకొనుట కిదియొక యదనని యాతఁడు

తలంచెననియు భావింపనగును. శ్రీరామకృష్ణుని గురువ రేణ్యుఁడగు శ్రీతోతాపురి తన శిష్యుఁడు పెండ్లియాడెనని విని యిట్లు తెలిపియుండెను: "స్థితప్రజ్ఞుఁడగువానికి — బ్రహ్మజ్ఞానమున సుప్రతిష్ఠితుఁడై యుండువానికి—భార్య వలన లేశమును ప్రమాదము లేదు." భార్య దన్నుఁ గలిసి కొనిన యవసరమున శ్రీరామకృష్ణుఁడు గురూపదేశమును స్మరించెను. సత్యాన్వేషణమున నెట్టి పరీక్షలనైనను, ఎట్టి విషమపరిస్థితులనైనను మనఃపూర్వకముగా నాహ్వానించి, యాత్మానుభవరత్నదీప్తులను లోకమున వ్యాప్తియొనర్చు టయేగదా మహాత్ముల స్వభావము! వనిత యనినంతనే భీతిలు సామాన్యవిరాగులవలెఁగాక శ్రీరామకృష్ణుఁడు భార్య తన చెంతనుండుటకేకాక యథేచ్ఛముగా నుపచరించుటకును నంగీకరించెను. మాతృదేవి కింతకంటెఁ గావలసిన దేమి?

చంద్రమండలమునకైనను మచ్చకలదు కాని శారదా రామకృష్ణుల యన్యోన్యానురాగమున కామకళంక మణు మాత్రమును గానరాదు. ఇందుల కనేకనిదర్శనములు కలవు. శ్రీరామకృష్ణునకు శిష్యుఁడును (శ్రీరామకృష్ణలీలాప్రసంగ) చరిత్రకారుఁడు నగు శ్రీ శారదానందస్వామి యివ్విషయమై యిట్లు వ్రాసియున్నాఁడు: "శ్రీ శారదామణీదేవి తనపక్కను బండుకొనియుండఁగాఁ గాంచి శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు తనలోఁ దానిట్లు వితర్కించుకొనెను: 'మనసా! లోకముచే నిదియే నారీశరీరమని చెప్పఁబడునది. మానవులు దీనికై తాపత్రయపడెదరు. కాని దీనికై ప్రాఁకులాడువాఁడు దేహాభి మానకూపమునఁ బడి భగవంతునిఁ బొందఁజాలకుండును.

ఓ మనసా! త్రికరణశుద్ధిగా—లోపల నొకటియుఁ బైనొక టియుఁ గాకుండ—చెప్పు, నీకీ స్త్రీశరీరము కావలయునా? లేక భగవంతుఁడు కావలయునా? చెప్పు. ఇందు మొదటిదే నీకుఁ గావలసినపక్షమున, ఇదిగో, సిద్ధముగా నీయెదుట నున్నది,—నిరభ్యంతరముగా నీవు దీనిని గ్రహింపవచ్చును.' ఈ విధముగా పర్యాలోచించి మాతృదేవిశరీరమును దాఁకఁ బోవ నాతని మానసము (విద్యుత్తంత్రినిఁ దాఁకిన శరీరము వలె) మహోద్వేగమున మఱలి యంతర్ముఖమగుటయు నాతఁ డా రాత్రి యంతయు సమాధినిమగ్నుఁడై యుండెను. మఱునాఁ డుదయ మాతని మానసము బహిఃప్రజ్ఞ నొందుటకై భగవన్నామ మాతని చెవులలో నెంతయో సేపు పుచ్చరింపవలసివచ్చెను.''

జితేంద్రియత్వమున కింతకంటె పరమావధి యెద్ది?

మానవలోకమున నవతరించిన ప్రేమరసాధిదేవతయో యన మాతృదేవి యొకనాఁడు గురుదేవుని పాదకమలములను దన కరపల్లవముల నల్లన నొత్తుచు, ''నన్నుఁ గూర్చి మీ రేమని తలఁచెదరు?'' అని మోమునఁ జిఱునవ్వు వెలయ ప్రశ్నించెను. శ్రీరామకృష్ణుఁ డిట్లు సమాధానించెను: ''ఆలయమున నేతల్లి దేవతయై యొప్పుచున్నదో, నామాతృరూపమున నేతల్లి యిపుడునహబత్తునవివసించుచున్నదో—ఆ తల్లియే యిపుడు నా పాదముల నొత్తుచున్నది. నిన్నుఁగూర్చి యీ రీతిగా—జగన్మాతృస్వరూపిణిగా—భావింతును.'' ఏమి మహోన్నతతత్త్వానుభవ జ్యోతిర్లీల లా దివ్యదంపతుల సల్లాపములు!

దాంపత్యమునుగూర్చి యిట నొక విషయము పరికింపవలసియున్నది. శ్రీ శారదాదేవికుటుంబజీవనము నెంచి, "ఆమె కెన్ని యున్నను, పాపము! బిడ్డలు లేరైరి!" అని జాలిపడువారు లేకపోలేదు. బిడ్డలులేని సతిని ఫలరహిత తరువుతోఁ బోల్చుటయు, గొడ్రాలని నిరసించుటయు లోకవిదితము. "ప్రజాయై గృహమేధినామ్" (కాంతురు గృహస్థధర్మంబు సంతుకొఱకు) అని కాళిదాసమహాకవి వచించియున్నాఁడు. వివాహమువలని ప్రయోజనము సత్సంతానమే యని వేదశాస్త్రప్రమాణములు గలవనుటకు సందియములేదు. నిజముగా స్త్రీత్వమును స్త్రీగౌరవమును దెలుపుమాటలలో "అమ్మ" యనుమాటకంటె మనోహరమైన మాట మఱేమి కలదు? "అమ్మ" యనినంతనే "ప్రేమామృతనిలయ"మని యెవ్వని హృదయమున స్ఫురింపకుండును? అగుచో బిడ్డలులేని శారదాదేవిని 'అమ్మ' యనియు మాతృదేవియనియు వచించు టెట్లు సమంజసమని శంకింపవచ్చును. శ్రీ శారదాదేవితల్లియగు శ్యామసుందరీదేవియే తనకొమార్తకు బిడ్డలులేరనియు మాతృజీవనమహాభాగ్యమున కామె నోఁచుకొనలేదనియు వగచి, శ్రీరామకృష్ణునకు వినవచ్చున ట్లొకప్పు డిట్లు పలికియుండెను: "మా శారదను పిచ్చివాని కిచ్చి పెండ్లిచేసినాము. కుటుంబజీవన సౌఖ్య మామెకు లేదయ్యె! బిడ్డలు లేరైరి! 'అమ్మా' యని పిలిపించుకొను భాగ్యమున కామె నోఁచుకొనలేదు కాఁబోలును!" అది విని శ్రీరామకృష్ణుఁ డీ సమస్యను పరిష్కరించుచు నిట్లు సమాధాన మొసఁగెను:

"అత్తా! ఆ విషయమై మీ రెంతమాత్రము తాపత్రయపడ నక్కఱలేదు. అహర్నిశము, 'అమ్మా! అమ్మా!' యని ప్రాణము విసిగించునంతమంది బిడ్డలు మీ కోమార్తకుఁ గలుగఁగలరు." శ్రీరామకృష్ణునివాక్యము లమోఘములు గదా! శ్రీ శారదామాతకంటె విశేషాధ్యాత్మిక పుత్త్రపౌత్త్ర సంతతినిఁ గనిన తల్లు లెవ్వరు?

శ్రీరామకృష్ణసాన్నిధ్యమే సిరిసంపదలనెల్ల తృణీకరింపఁగల నిరుపమాన సాధనసంపదయనియు, అది తన మహాభాగ్యమనియు పరిగణించిన మాతృదేవి దక్షిణేశ్వరదివ్యానందదినములనుగూర్చి యిట్లు వచించియున్నది: "ఆ దినములలో శ్రీ గురుదేవుఁడు పొందెడి దివ్యసమాధిస్థితులను వర్ణింప నెవరితరము? దివ్యాత్మభావములం దాయన యొకప్పుడు నవ్వును, మఱియొకప్పు డేడ్చును, ఇంకొకప్పుడు సమాధినిమగ్నుఁడై యొప్పును. ఒక్కొక్క సమయమున రాత్రియంతయు నిట్లు గడచెడిది. ఆయనసన్నిధిని (భక్తిపూర్వకమైన) భయముచే నా శరీరమంతయు వణఁకిపోవ నెప్పుడు తెల్లవాఱునాయని కనిపెట్టుకొనియుండుదానను. ఆ దినములలో సమాధిస్థితియు పారవశ్యమును నాకుఁ దెలియనివిగదా! ఒకనాఁ డాయన సమాధిస్థితి చాలసేపటివఱకు నుండెను. నే నపుడు భయపడి హృదయునకుఁ గబురంపినాను. అతఁడు వచ్చి యాయనచెవులలో భగవన్నామము నుచ్చరింప నారంభించెను. చాలసేపైనవెనుక బాహ్యస్మృతి కలిగెను. అటు తరువాత నా చిక్కును గ్రహించి యేయే సమాధిస్థితులలో నేయే నామముల నుచ్చరింపవలయునో తాకూరు నాకు నేర్పిరి.

అప్పటినుండియు నాయానామముల నుచ్చరించుటవలనఁ దప్పక బాహ్యస్మృతి కలిగెడిది; అందుచే నాకును జాల వఱకు భయము తగ్గెను. ఐనను, ఆయన కెప్పుడు సమాధిస్థితి గలుగునో తెలియరాకుండుటచే నొక్కొక్కప్పుడు రాత్రియంతయు మేలుకొని యుండుదానను...."

నవనీతకోమల మానసుఁడగు శ్రీరామకృష్ణుఁడు శారదాదేవి తనకై యట్లు శ్రమచెందుట చూచి సహింపఁ గల్గునా? ప్రత్యేకముగా నహబత్తునఁ బండుకొనుచుండుమని చెప్పెనని మాతృదేవియే తెల్పియున్నది.

స్వాభావికముగనే మాతృదేవి పారమార్థిక చింతా పరాయణయనియుఁ దన మగని యాదర్శములతో మనః పూర్వకముగా నేకీభవించెననియు గ్రహింపనగును. ఆమె బ్రహ్మచర్యము నిర్బంధితము గాదు. వేయేల, తలఁచినచో శ్రీరామకృష్ణు నామె సాంసారికజీవితముదెస కాకర్షించినను నాకర్షింపఁ బ్రాయికముగా స్వతంత్రయైయుండెను. కాని యామెచిత్తవృత్తి వేఱు. "నన్ను మాయలోనికి లాగుట నీ యభీష్టమా?" యని శ్రీరామకృష్ణుఁ డామెను దక్షిణేశ్వర ప్రారంభదినములలో నొకనాఁడు ప్రశ్నింప, నామె వెంటనే యిట్లు సమాధాన మొసఁగెను: "ఏల? పారమార్థిక మార్గమున మీకుఁ దోడ్పడుటకే నేను వచ్చియున్నాను."*

ఆహా! ఎంత దొడ్డ సమాధానము! శ్రీ మాతృదేవి వంటి నవోన్మీలిత కుసుమసంకాశ వినిర్మలమానసదక్ష-

* ఇవ్విషయమును మాతృదేవి కాలాంతరమునఁ దన సహచరురాలగు యోగీన్మాయితోఁ జెప్పియున్నది.

మఱెవ్వ రిట్టి సమాధానము నొసఁగఁజాలుదురు! ఒకరి నెట్లైన సంతసింపఁజేయుదుమనియూ, ఒకరిగౌరవము నెట్లైన సంపాదింతమనియూ యామె యీ సమాధానము నొసఁగెను? భాస్కరునకు తేజమువోలె, కమలమునకు సౌందర్యసౌరభముల పగిది సహజమగు నామె పారమార్థికశీలమే యీ సమాధానమునకు మూలమై యొప్పెను. పరమార్థపరార్థ జీవనములు శ్రీరామకృష్ణున కొకరిబోధచేఁ గలిగినవి గానిచో నాతని యర్ధాంగి విషయముకూడ నట్టిదే.

శారదా రామకృష్ణులవలె భార్యాభర్త లేకమనస్కులై యుత్తమజీవితాదర్శముల నుపాసించునపుడేకదా దాంపత్య మన్యోన్యశ్రేయస్కరమై దివ్యానందసంధాయకమై దీపించును! దంపతుల కిట్టి హృదయైక్యమే హైందవ వివాహాదర్శమై యున్నది. వివాహసమయమున వధూవరు లొండొరుల హృదయములను స్పృశించి, "యదేత్ హృదయం తవ తదస్తు హృదయం మమ, యదిదం హృదయం మమ తదస్తు హృదయం తవ" అని హృదయైక్య ప్రార్థన మొనర్చు నాచారము భారతీయనాగరికతా కుసుమ రాజమునందలి మకరందముగదా!

శ్రీరామకృష్ణ జీవితోద్యమమున మాతృదేవి యెంతటి ప్రధానపాత్రమో లోకమింకను గుర్తింపలేదని చెప్పవలసి యున్నది. వారల దాంపత్య జీవితమునందలి యాధ్యాత్మిక సౌభాగ్యమునకు శ్రీరామకృష్ణుని పవిత్రశీలమే పట్టుఁగొమ్మ యని లోకు లెన్నఁగా వినుచుందుము. కాని యీ సౌభాగ్యమున మాతృదేవి కనీసము పతిసమానాధికారిణియని

గుర్తింపవలయును. మనోనైర్మల్యమున నేమి, స్వార్థరాహిత్యమున నేమి, శ్రీ శారదామణి తన కెనయగు సహధర్మిణి కావుననే శ్రీరామకృష్ణుఁడు తన దివ్యాదర్శమున నఖండవిజయము నందఁగలిగెను. సత్యహరిశ్చంద్రునకు చంద్రమతీదేవియు శ్రీరామచంద్రునకు సీతాదేవియు నెట్టివారో శ్రీరామకృష్ణునకు శ్రీ శారదాదేవి యట్టిదను టతిశయోక్తి కానేరదు.

మాతృదేవి పారమార్థికశీలసౌభాగ్యమును ఆధ్యాత్మికోన్నతిని పరిగణించి, యాత్మసాధనలం దామె తన కొనర్చిన సాయ మెంతటి యమూల్యమో శ్రీరామకృష్ణుఁడే ప్రథమమున గుర్తించెనని చెప్పనొప్పును. ఇవ్విషయమై కాలాంతరమునఁ దనశిష్యుల కాతఁ డిట్లు తెలిపియున్నాఁడు: "ఆమె యంతటి పావనాత్మయే కానిచో నామె ప్రేరణలచేనే నాత్మనిగ్రహమును గోల్పోయియుండెడివాఁడ నేమో, యెవరు చెప్పఁగలరు? పెండ్లియైనతరువాత జగన్మాత నిట్లు ప్రార్థించినాను: 'తల్లీ! జగజ్జననీ! నా భార్యమానసమున కామకళంక మణుమాత్రమును లేకుండున ట్లొనర్పుము.' అల జగజ్జనని నా ప్రార్థనను సఫలమొనర్చెనని నేను నా భార్యతో నివసించినప్పుడు గ్రహించినాను."

మాతృదేవి పరమపావన చరిత్రమునుగూర్చి శ్రీరామకృష్ణపరమహంసయే యిట్లు ప్రకటించుట యెంతటి యమూల్యాభినందనమో తెలియఁగలదు. శ్రీరామకృష్ణుఁడు దక్షిణేశ్వరమున నఖండసాధనల నొనర్చుచు నద్వితీయ దివ్యానుభవములను బడయుచుండ, బాల శారదాదేవి స్వగ్రామమున నెట్టి యాత్మవికాసమునందెనో కాలక్రమ

మున నామె దక్షిణేశ్వరమున కేతెంచి పతివలనఁ బడసిన యఖండానురాగమునుబట్టియే గ్రహింపనగును. మఱియు శ్రీరామకృష్ణుని దివ్యసాధనల మహాఫలము మాతృదేవికి పుష్కలముగా లభించెననుటకు శ్రీరామకృష్ణుని వచనములే మనకు నిదర్శనములు. తనకును, అంతరంగిక వర్గమునకును గల సంబంధమునుగూర్చి, "తీఁగ లాగిన డొంక యంతయుఁ గదలు" నని యాతఁ డొకప్పుడు వచించియున్నాఁడు.

ఈ భావమును ధ్రువపఱచు మఱియొక ముఖ్యసంఘటనము శ్రీరామకృష్ణుని దివ్యసాధనల కన్నిటికిని పరిసమాప్తి యనఁదగు షోడశీపూజయను మహాక్రియ. అందు శ్రీ శారదాదేవికి శ్రీరామకృష్ణుఁడు దేవతాపీఠము నొసఁగి సాక్షాత్ పరమేశ్వరీ స్వరూపముగా నామె నారాధించెను.

శ్రీ శారదా శ్రీ రామకృష్ణుల హృదయైక్యమును బ్రకటించు నీ దివ్యసంఘటనమునుగూర్చి యిఁక ముచ్చటింతుము.

## ౭ అవ ప్రకరణము

## దివ్యదాంపత్యము

భోగానుభవభావమున కతీతులై సతీపతు లొండొరుల యెడ భగవద్భావమును బడయఁగల్గినచో, అది యెంతటి దివ్యదాంపత్యము! "నవా అరే పత్యుః కామాయ పతి ప్రియో భవతి, ఆత్మనస్తు కామాయ పతి ప్రియో భవతి—(ప్రేయసీ!) పతికోసమెవ్వరును పతిని ప్రేమించుట లేదు, ఆతనియందలి యంతరాత్మనిమిత్తము పతి ప్రియుఁడగుచున్నాఁడు"; మఱియు "నవా అరే జాయాయై కామాయ జాయాప్రియా భవతి, ఆత్మనస్తుకామాయ జాయా ప్రియా భవతి * —(సఖీ!) భార్యకోస మెవ్వరును భార్యను ప్రేమించుటలేదు; ఆమెయందలి యంతరాత్మనిమిత్తము భార్య ప్రియురాలగుచున్నది" అనియేకదా యుపనిషత్తు లుద్ఘోషించుచున్నవి! ఇందలి సత్యమును దమపవిత్రజీవితముచే నవయుగమునకుఁ జాటిన దివ్యదంపతులు శ్రీశారదా శ్రీరామకృష్ణులు. వీరల దాంపత్యమున మణివిరాజితసువర్ణాక్షరములతో లిఖింపఁదగిన మహాసంఘటనము షోడశీపూజ. .

అయ్యది ఫలహారిణీ కాళీపూజాసుదినము. † శ్రీముఖ నామసం॥ వైశాఖబహుళ చతుర్దశీ భానువారము (25–వ

---

* బృహదారణ్యకోపనిషత్తు, 2. 4. 5.

† ఫలహారిణీకాళి యనఁగా పూర్వకర్మఫలములను హరించు కాళి యని భావము.

తేది మేనెల 1873-వ సంవత్సరము*). దక్షిణేశ్వర కాళికాల యము పుష్పపతాకతోరణాది వివిధాలంకారములతోడను, దివ్యమంగళవాద్యములతోడను భక్తగణసంకీర్తనములతోడను గన్నుల పండువై, వీనులవిందై యొప్పుచుండెను. కాళికాయత్తచిత్తులై భక్తులు మనోరంజకముగ సంకీర్తన మొనర్చుచుండిరి. రాత్రి కాళీమాతృపూజా ముహూర్త మగుసరికి వేనవేలజను లాలయమునఁ గూడిరి. దివ్యోత్సాహము మూర్తీభవించెను.

శ్రీరామకృష్ణునిగదితలుపులు మూయఁబడియున్నవి. లోపల నేమి జరుగుచున్నది? షోడశీపూజకై గురుదేవుఁ డీ శుభదినమును నిర్ణయించుటచే వలయు సన్నాహము జరుగు చున్నది. 'దిను' అను బాలుఁడు, గురుదేవునిసన్నిహితుఁడు, బిల్వ పత్రములను సేకరింప, హృదయుఁడు క్రియాకలాపము నకు వలయు నేర్పాటుల నొనర్చెను. పూజాసమయమునకు గదిలోనికి వచ్చియుండుమని మాతృదేవి కిదివఱకే గురు దేవుఁడు తెలిపియుండెను. తొమ్మిదిగంటల కామె యచటికి విచ్చేసెను.

పూజ ప్రారంభమైనది. గురుదేవుఁడు పశ్చిమద్వారము కడ ప్రాఙ్ముఖుఁడై కూర్చుండియుండెను. పూజాద్రవ్యము లను మంత్రపూత మొనర్చి, ప్రారంభక్రియలను నెఱవేర్చి, యాతఁడు దేవతకై ప్రత్యేకముగా నమర్పఁబడిన పీఠమునఁ గూరుచుండుమని మాతృదేవికి సంజ్ఞ యొనర్చెను. ఆరాధకుని

* 'శ్రీరామకృష్ణ లీలాప్రసంగము' ననుసరించి.

కుడిప్రక్కనున్న యా పీఠము యంత్రసంబంధ చిత్రాలం కృతమై యలరారుచుండెను. మాతృదేవి వచ్చి యాపీఠ మున పశ్చిమముఖియై యాసీనురాలయ్యెను. ఈవఱకే దివ్యావేశపారవశ్యము నొందియున్న యామె గురుదేవుని సూచనలను మంత్రముగ్ధలీల ననుసరింపసాగెను. పరమ పవిత్రగంగాజలముల నామెపై ప్రోక్షించి, సమంత్రకముగా గురుదేవుఁడి ట్లావాహనమొనర్చెను: "ఓ బాలా! (కౌమారీ) సర్వశక్త్యధీశ్వరీ! మాతా! త్రిపురసుందరీ! నాకై సిద్ధిద్వారమును తెఱువుము; ఈమె మనశ్శరీరము లను పరమపవిత్రమొనర్చి, యీామెయం దావిర్భవించి సర్వకల్యాణసాధనభూతవుకమ్ము!"

సమంత్రకముగా శరీరావయవములను స్పృశించుచు వానిని దేవతావయవములుగా భావించుటయం దమరు న్యాసక్రియచేఁ బిమ్మట నాతఁడు మాతృదేవిని పరమేశ్వరీ స్వరూపముగా సంభావించి షోడశోపచారములతో పూజింప సాగెను. ఆ సమయమున నామెపాదములకు లత్తుక నలఁది, మోమున సింధూరతిలకము నిడి యామెను నూతనవస్త్రా లంకృతనొనర్చెను; ఒకించుక మధురాహారములను తాంబూ లమును నోట నిడెను. సహజముగా లజ్జావతియగు నామె శ్రీ గురుదేవుఁడీ యుపచారములనన్నిటినిఁ దనకొనర్చు పట్టున సంకోచమునుగాని బిడియమునుగాని యించుకయుఁ బొందకుండెనా యని యొకశిష్యురా లొకప్పుడు తన్నుఁ బ్రశ్నింప నామె యిట్లు సమాధాన మొసఁగియున్నది: "ఎంతమాత్రమును పొందలేదు. ఆయన యీ యుపచార

ముల నన్నిటినిఁ జేయుచుండఁగాఁ జూచితిననుట నిజమే కాని రవంతయైనను మాటాడ నాకు బుద్ధిపుట్టలేదు.''

పూజ ప్రారంభమైనది మొదలుకొని సమాప్తమగు వఱకును మాతృదేవి యపూర్వదివ్యభావమును బొంది యుండి తుదిని సమాధినిమగ్నురాలయ్యెను. పూజ నొనర్చు నప్పుడు గురుదేవుఁడును పారవశ్యముఁ జెందియుండి పూజ సమాప్తమగుసరికి నిశ్చలసమాధిస్థితుఁ డయ్యెను. ఆ ప్రశాంత సమయమున నిటు లా దివ్యదంపతులు హృదయైక్య నౌక నధిష్ఠించి యింద్రియాతీతమగు నఖండసచ్చిదానంద సాగర మున నోలలాడిరి!

ఆ దివ్యానందపారవశ్యమున గంటలు గడచెను. అర్ధ రాత్రమగుసరికి గురుదేవున కల్లన బాహ్యస్మృతి కలుగ సాగెను. అంత నాతఁడు కట్టెదుట మాతృదేవియం దావిర్భ వించియున్న లోకేశ్వరి కాత్మసమర్పణము గావించుకొని తన సమస్తసాధనఫలమును జపమాలను దనదగు సర్వస్వ మును సమర్పించెను. అనంతర మాతఁడు సమంత్రకముగా ప్రణామ మొనర్చుచు నిట్లు సంబోధించెను: ''ఓ సర్వమంగళ మంగళస్వరూపిణీ! సర్వకర్మనిష్పత్తికారిణీ! శరణదాయినీ! త్రినయనీ! శివునికొమ్మా! గౌరీ! ఓ నారాయణీ! నీకు మఱల మఱల ప్రణామ మొనర్చుచున్నాను.''*

---

* ''సర్వమంగళమాంగళ్యే శివే సర్వార్థసాధికే,
శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోస్తుతే.''

పూజ* సమాప్తమైనది, బహిఃప్రజ్ఞ నొందినవెనుక మాతృదేవి మానసికముగా గురుదేవునకు ప్రణామ మాచరించి నహబత్తునందలి తనగదికి వెడలెను.

షోడశీపూజయను నీ మహాక్రియ శ్రీ శారదా శ్రీరామకృష్ణులదాంపత్యము నెంతమనోజ్ఞ మొనర్చెనో గమనింపనగును. శ్రీరామకృష్ణుని దివ్యసాధనల కియ్యది శాంతిపాఠమై, యాతని గురుభావమునకు—లోకమున కాతఁ డొనర్చిన యఖండ జ్ఞానదానమునకు — గణపతిపూజయై యొప్పినచో, మాతృదేవిజీవితమున నియ్యది నిరుపమాన మానసిక పరిణతికి నాందియై, ఆమె పారమార్థికజీవితమునకు ప్రాణప్రతిష్ఠయై యలరారెను. శ్రీరామకృష్ణుఁ డీ మహా

---

* ఇయ్యది షోడశీపూజయని చెప్పియున్నాముగదా? షోడశీ పూజ యనుపదమున కించుక వ్యాఖ్యాన మావశ్యకమైతోఁచును. పైకిఁ గానవచ్చురీతిని దీనికిఁ 'బదునాఱేండ్ల బాలికను పూజించుట' యని యర్థముచేయరాదు. నిజమునకు మాతృదేవి యీ సమయమున నించుమించు పదునెనిమిదేండ్లప్రాయము గలిగియుండెను. ఇఁక నేమన, కాళి, తార, షోడశి, భువనేశ్వరి, భైరవి, ఛిన్నమస్త, ధూమావతి, బగళ, మాతంగి, కమల—అను దశమహావిద్యలయందును మూఁడవదియగు షోడశి రూపమున జగన్మాతను పూజించుటయని యర్థము. పదునాఱేండ్లప్రాయమున జగన్మోహన సౌందర్యముతో నలరారు బాలయని దేవి యీ యంశమున భావింపఁబడును. ఈ పూజయందు పటమునుగాని, పాత్రమునుగాని, మృణ్మయవిగ్రహమునుగాని, యంత్రమునుగాని, విశేషసౌందర్యవతియగు యువతినిగాని ప్రతీకముగా గ్రహింపవచ్చును. ఇందు శ్రీరామకృష్ణుఁడు గ్రహించినకడపటి ప్రతీకవిషయమున యువతి పదునాఱేండ్ల ప్రాయము గలిగియుండవలయుననుు నియమములేదు. వలయున దట్టి స్త్రీ సుందరియై నవయౌవనమున నొప్పుచుండవలయును.

క్రియయందు మాతృదేవిని సాక్షాజ్జగన్మాతృస్వరూపిణిగా గ్రహించి, యామెకుఁ దన దివ్యసాధనల ఫలములనన్నిటిని సమర్పించిన కతన మాతృదేవి నిజముగా నాతని సాధన మహాఫలమును బడసెనని — యాతని పారమార్థిక వైభవ మునఁ బాల్గొనెనని—గ్రహింపనగును. ఇటు లప్రయత్న ముగా మాతృదేవి కపూర్వాధ్యాత్మిక సౌభాగ్యమలవడియెను. శ్రీరామకృష్ణ సహధర్మచారిణియై తానిఁక నిర్వహింప వలయు మహోద్యమమున కామె యిట్లు సమర్థురాలయ్యెను. మఱియు శ్రీరామకృష్ణ నామంత్రణఫలితముగ లోకేశ్వరి యామె మనశ్శరీరములయం దావిర్భవించినకతన నింతటి నుండియు నామె జీవితము లోకేశ్వరీలీలాప్రదర్శనమునకు ప్రధానరంగమై దీపించెను. ఆమెయొనర్చిన కార్యము లన్నియు పరహితార్థములై విలసిల్లెను.

## ఏడవ ప్రకరణము

## గురుచరణ సాన్నిధ్యము

దక్షిణేశ్వరమున మాతృదేవిజీవిత మపూర్వాదర్శములతో, అసమానాత్మానుభవములతో విరాజిల్లిన పారమార్థిక జీవన ప్రపంచము. బాహ్యసంఘటనాడంబర మందు కానరాదు, కాని భావనాతీతమగు నాత్మవికాసము, దివ్య సౌరభము, అందు రూపుదాల్చెను. సుమవికాసములీల, చంద్రకిరణప్రసారముపగిది, మహోత్తమసంఘటన లెప్పుడును నిరాడంబరముగా, ప్రశాంతముగా జరుగుచుండును.

తన జీవితేశ్వరుఁడగు శ్రీరామకృష్ణుని సేవించుటయే మాతృదేవి మహోత్తమతపశ్చర్యగా పరిగణించెను. శ్రీరామకృష్ణునియెడఁ దన మనోభావమునుగూర్చి యామె యొకప్పుడిట్లు వెల్లడించెను: "పతియను భావముననేగాక, సర్వసాధారణముగాఁ జూచినను నా కామహనీయుఁడు సాక్షాత్ పరబ్రహ్మమూర్తి" సక్రమమగు పారమార్థిక శిక్షణమును బడసిన ప్రతి భారతీయసతీమణియు తనభర్తను భగవత్స్వరూపముగా భావించి స్వార్థరహితముగా నాతని సేవించుటయే తన యాత్మవికాసమునకు పరమసాధనముగా పరిగణించును. అనసూయ, సీత, సావిత్రి, అరుంధతి మున్నగు సాధ్వీమణుల సచ్చరిత్రములు భారతీయవిజ్ఞానతారాపథమున దేదీప్యమానమై వెల్గొందుచున్నవికదా! వీరికంటె భారతనారీమణుల కాదర్శప్రాయులు మఱెవ్వరు? ఒక తాపసి యరణ్యమునఁ దన జపతపము లన్నిటివలనను బడయఁజాలని

పారమార్థిక ప్రభావమును దనభర్తకును కుటుంబమునకును సేవల నొనర్చుచుండిన యొక సతీమణి బడయఁగల్గెనని మహాభారతము చాటుచున్నది. పతియెడ సతీమణు లెల్లర కిట్టి మనోభావము సముచితమైయున్నను, ఆతఁడు పావనాత్ముఁడై యాత్మోన్నతి నందియున్న యెడల విశేషశ్రేయోదాయకమై యొప్పును. అట్టిచో, సంసేవనమునకుఁ గావలయు సన్నిహితత్వమును ప్రేమానురాగములును నాతని పారమార్థిక మహాభాగ్యమును బడయుటకుఁ దగు నవకాశము నొసఁగును.

శ్రీరామకృష్ణసంసేవనము మాతృదేవి కిట్టి మహాలాభమును జేకూర్చెను. ఆతని పారమార్థిక వైభవమును గూర్చి మాతృదేవియే యొక శిష్యున కిట్లు తెలిపియున్నది: "మనగురుదేవుఁడే మహేశ్వరుఁడు, మఱియు మహేశ్వరి, ఆతఁడే సర్వదేవతాస్వరూపుఁడు, సర్వమంత్రస్వరూపుఁడు. ఆతని సేవించినచో సర్వదేవతలను సేవించినట్లే." అట్టి పురుషోత్తముని సేవింపఁగలుగుట తన యనన్యసామాన్యమగు మహాభాగ్యమని, తరణోపాయమని, యాతని సంసేవనమున నామె నిమగ్నురాలయ్యెను. "క్షణమపి సజ్జనసంగతి రేకా భవతి భవార్ణవతరణే నౌకా—సజ్జనసాంగత్యము క్షణము లభించినను, అదియే సంసారతరణోపాయమగు నౌక" యని యార్యులు ఘోషించుచుండ, పరమాదర్శస్వరూపుఁడగు శ్రీరామకృష్ణుని దివ్యసాంగత్యమును సంసేవనభాగ్యమును పుష్కలముగాఁ బడసిన మాతృదేవి కాత్మసాక్షాత్కారము కరతలామలక మైనచో నం దాశ్చర్యమేమున్నది?

సేవయనునది దివ్యఫలదాయకము కావలయునన్నచో, తగు మనోభావముతో నొనర్పఁబడవలయును. శ్రద్ధాభక్తు లిందుల కావశ్యకములు, ధ్యానాదులు సాధనభూతములు. సద్గురువరేణ్యుఁడగు శ్రీరామకృష్ణుఁడు మాతృదేవికిఁ గఱపిన శిక్షణమున వీనిని ప్రధానముగా పరిగణించి యిట్లు తెలిపి యున్నాఁడు: "చందమామ యందఱిబిడ్డలకును మామయే. ఇటులనే భగవంతుఁ డెల్లరకును సమానమగు సొత్తు. హృదయపూర్వకముగా నాతని ప్రార్థించుటకేమి, ధ్యానించుటకేమి, ప్రతివ్యక్తికిని హక్కు గలదు. ఇటు లొనర్చువా రెవ్వరు గానిమ్ము, వానిసాక్షాత్కారమును బొంది ధన్యులగుదురు. నీవును దానినిలక్షించినచోఁ బొందఁగలుగుదువు." షోడశీపూజకుఁ గొలఁదిదినములకు పూర్వ మీ దివ్యోపదేశమును గురుదేవుఁడు మాతృదేవి కొనర్చెనని తెలియవచ్చుచున్నది. ఆమె మానసమున నియ్యది దివ్యపరిణామమును గలిగించెననుటకు సందియము లేదు.

రాత్రిభోజనసమయమున వడ్డనచేయుటకై మఱియొక నాఁడు మాతృదేవి యొకభక్తురాలు దన్ననుగమింప, గురుదేవునిగదికి వెడలెను. మోమున నామె మేలిముసుఁగు వైచుకొనియుండెను. అమితమగు లజ్జచే నామె యా దినములలో ముసుఁగు లేనిదే గురుదేవునకు సైతము గాన్పించెడిది కాదు. భావపారవశ్యమున గురుదేవుఁ డానాఁడు ప్రసంగింపసాగెను. ఆచ్ఛాదనవినిర్ముక్తమై మోముచందురుఁడు ప్రకాశించుచుండ, గురుదేవదివ్యోపదేశ సుధారసమును గ్రోలుచు మాతృదేవి తన్మయత నొందియుండ, రాత్రి నాలుగు యామ

ములును నాలుగు నిముసములై గడచిపోయెను. ప్రభాత తేజమును గని యామె త్వరితముగా మేలిముసుఁగు వైచుకొని నహబత్తునకుఁ బరుగిడెను.

ఈ దినములలో గురుదేవుఁడు వివిధ దేవతామంత్రములను, వాని నుపదేశించు విధానమును మాతృదేవికి బోధించెనని తెలియవచ్చుచున్నది. దక్షిణేశ్వర దివ్యానందదినములను తన జీవితమున నెన్నఁటికిని మఱవఁజాలనని మాతృదేవియే యిట్లు వచించియున్నది: "ఆ దినములలో బ్రాహ్మముహూర్తమున (అనఁగాఁ దెల్లవాఱుజామున మూఁడుగంటలకు) లేచి ధ్యానమునకుఁ గూర్చుండుదానను. తఱచుగా ధ్యాననిమగ్నతగలుగ శరీరస్మృతి లేకుండెడిది. పండువెన్నెలలో నహబత్తు మెట్ల సమీపమునఁ గూర్చుండి యొకరాత్రి జపమొనర్చుచుంటిని. అంతయు ప్రశాంతముగా నుండెను. ఠాకూరపు డా త్రోవనుబట్టి వెడలిరను సంగతియే నాకుఁ దెలియలేదు. ఇతరదినములలో ఆయన ముచ్చెలచప్పుడు వినవచ్చెడిది కాని యపు డదియు వినఁబడలేదు. నేను ధ్యానమున మునిఁగియుంటిని. ఆ దినములలో నా రూపము వేఱువిధముగా నుండెడిది. ఆభరణములను దాల్చి నేనపుడు విరివియైన మెఱుంగుల చీరను ధరించుదానను. నాఁడు గాలివలన చీర వీఁపు నుండి జాఱిపోవుట నాకుఁ దెలియదయ్యె. యోగీంద్రుఁడు* అపుడు గురుదేవునకు కమండులువు నిచ్చుటకై యా దారిని

---

* ఈతఁడు శ్రీశారదా శ్రీరామకృష్ణుల శిష్యుఁడగు యోగానంద స్వామి. ఈతని బాల్యనామము యోగీంద్రనాథ చౌదరి. మాతృదేవి వలననే యీతఁడు మంత్రోపదేశము నొందెను.

వెడలినటులను గురుదేవుఁడు నన్నా స్థితిలోఁజూచినటులను దరువాతఁ దెలియవచ్చినది. ఆహా! ఏమి యా దివ్యానంద దినములు! పండువెన్నెలరాత్రులలో చంద్రునిఁ దిలకించి కరములుమోడ్చి యిట్లు ప్రార్థించుదానను : ‘నా హృదయ మా చంద్రకిరణములవలె నిర్మలమై వెలయుఁగాక!’ లేదా, ‘తండ్రీ! లోకేశ్వరా! చంద్రునియందుఁగూడ మచ్చగలదు, కాని నా హృదయ మకలంకమై వెలయుఁగాక!’ ధ్యానమున సుస్థిరులమైనంతనే హృదయమున భగవానుని విస్పష్టముగాఁ గనవచ్చును ; అపు డాతనివాక్కులను వినవచ్చును. ఇట్టి నిర్మల మానసమున నే భావము తోఁచినను వెనువెంటనే ఫలించును. అపుడు మీరు దివ్యానందమున నోలలాడెదరు, ప్రశాంతి మిమ్ముల నావరించును, వరించును. ఆహా! ఆ దిన ములలో నా మానస మెంత ప్రశాంతముగా నుండెడిది! (పరిచారికయగు) బృందయొకనాఁడు నాయెదుట నొకపళ్లెము నెత్తివేయ ఖంగుమని మ్రోఁగెను. ఆ శబ్దము నా హృద యాంతరాళమునఁ జొచ్చినది. * ఏ పరమేశ్వరుఁడు మన హృదయాంతర్వర్తియై వెల్గొందుచున్నాఁడో, ఆ పరమేశ్వ రుఁడే యితరులందఱి హృదయములందును—దీనుల—నిస్స హాయుల—పతితుల—చండాలుర—హృదయము లందును నెలకొనియున్నాఁడని సాక్షాత్కారము నొందిన సమయమున

* నహబత్తున మాతృదేవి యపుడు ధ్యానించుచుండ నుఱుముఱిమినట్లు తోఁచిన యా శబ్దమును విని యశ్రుపూరితలోచన యయ్యె నఁట. చిత్తము ధ్యాననిమగ్నము కానున్నయపుడు సూది జాఱుటచేఁ గలుగు శబ్దమైనను పెద్ద పిడుఁగువలెఁ దోఁచునని యోగశాస్త్రము దెల్పుచున్నది.

గ్రహింపఁగలుగుదుము. ఇట్టి బ్రహ్మానుభవము నరునకు నిజమైన యడఁకువ గలిగించును.''

శ్రీరామకృష్ణసాన్నిధ్యమున మాతృదేవి నిరుపమాన దివ్యానుభవములను బడసెనని తెలుపుట కిట్టి నిదర్శనము లనేకములు కలవు. మహాత్ములు నివురు గప్పిన నిప్పువంటి వారు; తమ యౌన్నత్యమును వా రెన్నఁడును నొరులకు ప్రకటింపరు, ప్రదర్శింపరు. ఒరులదృష్టిలో ఘనతవహించు టయు నొరులచే నుతింపఁబడుటయు సహింపఁజాలని మాతృ దేవి తన దివ్యానుభూతులను వెల్లడింపకుండెడిది. శ్రీరామ కృష్ణుఁడే యొకప్పు డామెనుగూర్చి 'నివురు గప్పిన నిప్పు' అని వచించియున్నాఁడు. ఐనను నామెసహచరురాం డ్రెట్లో కొన్ని సంఘటనములను గ్రహింపఁగలుగుచుండెడివారు. ఇవ్విషయ మునసే యోగేంద్రమోహినీమాయి యను మాతృదేవి సహచరురాలు స్వానుభవము నిట్లు తెలిపియున్నది :

''అమ్మ మొదట దక్షిణేశ్వరమునకు వచ్చినప్పటికి సమాధ్యనుభవమును బొందియుండ లేదు. అఖండశ్రద్ధా భక్తులతో నామె ప్రతిదినము జపధ్యానముల నొనర్చు చుండినను, ఆ సమయమున నామె సమాధిస్థితిని బొందినట్లు మేము వినియుండ లేదు. సరికదా, గురుదేవునితోఁ దాను నిద్రించుచుండిన దినములలో ఆయన సమాధిస్థితినిఁ గాంచి భయపడుచుండెడిది. అమ్మతో నాకు పరిచయము గలిగిన తరువాత నొకనాఁ డామె నాతో నిట్లు పలికెను : 'ఠాకూ రనుగ్రహమువలన నేను సమాధిస్థితిని బొందఁగలుగుటకై ఆయనతోఁ జెప్పు. స్వయముగా నడుగుదమనుకొనిన,

ఆయన సమక్షమున సదా భక్తబృంద ముండుటవలన వీలు గాకున్నది.' నే నామెకోరికను దెలుపుట నా కర్తవ్యమని యెంచితిని.

"మఱునాఁడు శ్రీరామకృష్ణుఁ డొంటరిగాఁ దన పాన్పుపైఁ గూర్చుండియుండ, నేను వెళ్లి యుచితరీతిని ప్రణామ మాచరించి తల్లికోరికను నివేదించినాను. ఆయన విని యేమియు మాఱువలుక లేదు. అకస్మాత్తుగా ఆయన గంభీరవదనులైరి. ఆ స్థితిలో ఆయనతో మాటాడ నెవ్వరును సాహసింపఁజాలరు. అందుచేఁ గొంచెముసేపచటఁ గూర్చుండి నెమ్మదిగా బయటికి వచ్చినాను. నహబత్తునకు వెడలి చూడ, అమ్మ తన నిత్యపూజార్థమై యాసనమునఁ గూర్చుండి యుండెను. తలుపు కొంచెము తెఱచి చూతునుగదా, ఆశ్చర్యము, అమ్మ ముసిముసినవ్వులు నవ్వుచు మఱల నంతలో విలపించుచుండెను. ఆనందవిచారము లొండొంటి వెంబడి నిట్లు కొంతసేపు గడచెను. అశ్రువు లామెకపోల యుగళమున సంతతధారగాఁ బ్రవహించుచుండెను. క్రమముగా నామె తన్మయతనొంది నిశ్చేష్టురాలయ్యెను. ఆమె సమాధినిమగ్నయయ్యెనని గ్రహించినాను. తలుపు దగ్గఱగా వేసి యీవలకు వచ్చినాను.

"చాలసేపైన తరువాత మఱల నామెగదిలోనికి వెళ్లినాను. 'ఠాకూరు గదినుండి యిప్పుడేనా వచ్చుచుంటివి?' అని యామె నన్నడిగెను. నే నిట్లు బదులుచెప్పినాను: 'సమాధి స్థితిని, ఇతర దివ్యభావములను బొందలేదని చెప్పెద రెట్లు తల్లీ!' ఆమె సిగ్గుపడి నవ్వెను.

"అటుతరువాతఁగూడ నేనామెతో దక్షిణేశ్వరమున రాత్రులు గడపుచుంటిని. నేను వేఱు పాన్పుపైఁ బండుకొనఁ గోరినను, ఆమె నా మాట వినకుండెడిది. తనవైపున కామె నన్ను లాగును. ఒకరాత్రి బయట నెవ్వరో మురళి వాయించుచుండిరి. అది విని యామె దివ్యభావ పారవశ్యమును జెందెను. నడుమనడుమ నామె నవ్వుచుండెను. ఎంతో సంకోచముతో నేను బాన్పుపైఁ గూర్చుండియుంటిని. ప్రాపంచికవ్యక్తినగు నేనా సమయమున నామెను దాఁకరాదని భావించినాను. అటులు చాలసేపైన పిమ్మట నామె సామాన్య మానసికస్థితినిఁ బొందెను."

కాలక్రమమున— శ్రీరామకృష్ణ నిర్యాణానంతరము —ఆమె కిట్టి సమాధిస్థితులు తఱచుగాఁ గలిగెడివి. వానిని గూర్చి యుచితస్థానమున ముచ్చటింతుము. సహజనిర్మలమగు నామె మానసము గురుదేవుని సాంగత్యము లభించినంతనే మహోత్తమాత్మభావములను, పారవశ్యమును జెందుచుండెనని యిట గమనించినఁ జాలును. నిజముగా పారవశ్యమును దివ్యదర్శనములును బ్రహ్మానుభవ చరిత్రమున నుపాఖ్యానములనియుఁ బిట్టకథలనియుఁ జెప్పనగును. సాధకుని ప్రకృతిననుసరించి యవి కలుగవచ్చును, కలుగకపోవచ్చును. హృదయపరివర్తనము, శీలసౌభాగ్యము — ఇవియే ఆత్మ సాక్షాత్కారమునకు ప్రాణమని గ్రహింపనగును. ఒకప్పుడొక శిష్యురాలు మాతృదేవితో, "భక్తులనేకులు దివ్య దర్శనములను గాంతురు, నే నే దివ్యదర్శనమును గాంచనైతిని!" అనిపలుక, మాతృదేవి, "అవి కేవలము అల్ప

విషయములు'' అని వచించెను. మఱియొకప్పు డామెయే స్వానుభవము నతిమనోహరముగా నిట్లు వెల్లడించెను: ''భగవత్సాక్షాత్కారము నొందినవ్యక్తి యేమైన విడ్డూరముగాఁ గాన్పించునా? వానికేమైన రెండు కొమ్ములు మొలుచునా? మఱేమియుఁ గాదు, మనస్సు నిర్మలమగును. నిర్మలమానసమున బ్రహ్మానుభవము గలుగును.''

ఈ ప్రకరణమును ముగించుటకుముందు మఱియొక ముఖ్యవిషయమును గుఱించి తెలుపవలసియున్నది. గురుదేవుఁడు పారమార్థికసాధనలనుగూర్చియేగాక, వ్యావహారిక వర్తనమునుగూర్చియు మాతృదేవికిఁ దగు శిక్షణముగఱపెను. ప్రపంచజ్ఞానమునుగూర్చి—లోకవర్తన విధానమునుగూర్చి—సంసారకృత్యములను జక్కఁబెట్టుకొను మార్గములనుగూర్చి—యాతఁడామెకుఁ జక్కనిబోధల నొనర్చియున్నాఁడు. ఉత్తమ ప్రయోజనమును నెఱవేర్చుటకై గృహోపకరణముల నేక్రమమున నుంచుకొనవలయునో యామెకుఁ దెల్పెను. తాత్కాలికముగా నొకచోటినుండి తీసిన వస్తువును దడవుకొనకయే చీకటిలోసైతము గుర్తింపఁగలుగుటకై తిరిగి యథాస్థానమునఁ బెట్టవలయునని హెచ్చరించెను. దీపములకు వత్తులను బేనుట, కూరలను దఱుగుట, వంటచేయుట, తమలపాకుల చిలుకలను జుట్టుట—మున్నగు సాంసారిక కృత్యముల నన్నిటిని నిపుణముగా నొనర్చుమార్గముల నామెకు నేర్పెను. ప్రయాణముచేయునపుడు (పడవలోఁగాని, బండిలోఁగాని) ప్రవేశించుటలో ముందుగను వెలువడుటలో వెనుకగను నుండవలయుననియు, ఏలన, వస్తుసముదాయ

మంతయు లోనికిఁ జేర్చుటకుఁగాని, బయటికిఁ దీయుటకుఁ గాని యపుడే యనువగుననియుఁ దెల్పెను. దేశకాల పాత్రానుగుణముగాఁ బ్రవర్తించు సామర్థ్యమే కుటుంబము నను సంఘమునను జయప్రదముగా మెలఁగఁగలుగుటయందలి కీలకమని యాతఁడు బోధించెను. "ఉప్పు కప్పురంబు నొక్క-పోలికనుండు, చూడఁ జూడ రుచుల జాడ వేఱు, పురుషు లందు పుణ్యపురుషులు వేఱయా..." అని వేమన చెప్పినట్లు యోగ్యులెవరో, అయోగ్యులెవరో, పరిశీలించి మెలఁకువతో నెచ్చెలుల నెన్నుకొనవలయునని యాతఁ డామె కుపదేశించెను. మనసిచ్చి కొందఱితోఁ గలిసి మెలసి వర్తింపవచ్చు ననియు, కొందఱితో ముఖపరిచయముమాత్రమే తగు ననియు, కొందఱితో మాటాడనే మాటాడరాదనియు శ్రీరామకృష్ణుఁడు తెల్పెను.*

మాతృదేవి నైపుణ్యమునకును సహజసౌశీల్యమునకును శ్రీరామకృష్ణసుశిక్షణము రత్నమునకు సూర్యకాంతియై యొప్పెను. ఇహపరశ్రేయముల నందుట కింతకంటెఁ గావలయున దేమి?

---

* "నీరంతా నారాయణస్వరూపమే. ఐనను, అన్నిరకముల నీళ్లును తాగుటకు పనికిరావు...ఒకరకమునీరు కాళ్లు కడుగుకొనుట కుపయోగించును; మఱియొకరీతినీరు నోటఁబోసికొని పుక్కిలించుటకుఁ బనికివచ్చును; ఇంకొకవిధమైననీరు తాగుటకుఁ దగియుండును; వేఱొక రీతినీరు ముట్టుటకైనను బనికిరాకుండును."

—శ్రీరామకృష్ణోపదేశ రత్నములు.

# ఎనిమిదవ ప్రకరణము

## గురుసంసేవనము

ఆత్మజ్యోతినిఁ దనుపుటకు సద్గురుసంసేవనమును మించిన తైలము వేఱొండు లేదు. ఇట్టి సద్గురుసంసేవనము మాతృదేవికి బాల్యముననే లభించు టామె సౌభాగ్య విశేషము. తన 'ప్రాణప్రియుఁడును గురుదేవుఁడు నగు' శ్రీరామకృష్ణు నామె మహోత్సాహముతో నెట్లు సేవింప సాగెనో చూచియున్నాము. శ్రీరామకృష్ణసన్నిధిని దక్షిణేశ్వరమున నామె నివసించినకాల మించుమించుగా పదుమూఁడు సంవత్సరములు.

ఈ దీర్ఘకాలమందలి విశేషభాగ మామె నివసించుట కెంతయు అననుకూలమైన నహబత్తు అను మందిరమునఁ గడపియుండెను. అది మిక్కిలి చిన్నదగు రెండతస్తుల కట్టడము. అందలి పైయంతస్తగు మిద్దెగదిలో శ్రీరామ కృష్ణునితల్లి చంద్రాదేవి తన జీవితశేషమును—కొలఁది వత్సరములను—గడపెను. క్రిందనున్న చిన్నగది మాతృదేవి నివాసము. శుద్ధాంతవాసమున మసలు నామె కుపయుక్త మగుటకై పంచాది నిలువెత్తున వెదురుతడకలచేఁ గప్పఁబడియెను. తత్ఫలితముగా సూర్యరశ్మి లోనికిఁ బోఁజాల కుండెడిది. భర్తకును దనయత్తకును ఆ గదియందే యామె వంటచేయును. ఒకవంక కూరబుట్టలును, మఱియొకవంక బియ్యపుసంచులును, ఒకమూల పాత్రలును, మఱియొక మూల నితరవస్తునిచయమును ఆమె నావరించియుండ, పైని యుట్టియందు గురుదేవుని సుకుమార జీర్ణశక్తికి వలయు ప్రత్యే

కాహారపదార్థములు గల కుండ వ్రేలాడుచుండును. ఆ గదియందే యామె కూరుచుండును, పరుండును. తననివాసమునుగూర్చి కాలాంతరమున నామె యిట్లు తెలిపి యున్నది: "ఆ గది యంతచిన్నదై యుండుటచే, ప్రారంభదినములలో నా తల ద్వారబంధమునకుఁ దగుల, బొప్పికట్టెడిది. ఒకనాఁడు నా తలపై గాయమైనది. అటుపిమ్మట నందు మసలుట కలవడినాను. ద్వారమును సమీపించినంతనే తల దానియంతనదియే వంగుచుండెడిది. కలకత్తాయందలి కులీనస్త్రీలును రాణివాసస్త్రీలును అనేకులు తఱచుగా అచటికి వచ్చెడివారు. లోనికి తొంగిచూచి, నన్నుద్దేశించుచు, ఇట్లాశ్చర్యమును వెలిపుచ్చువారు: 'ఆహా! మా అమ్మాయికి ఎంత చిన్నగది! నిజముగా ఆమె యిచట సీతావనవాసము చేయుచున్నది.'"*

సహబత్తున నామె యసౌకర్యము శ్రీరామకృష్ణుఁడు గుర్తింపకపోలేదు. కాని నివారణోపాయము గాన్పింపకుండెను. ఏలన, రాణిరాసమణియల్లుఁడును తన భక్తుఁడు నగు మథురనాథుఁడు ఇంతకుముందుగనే కాలధర్మము నొంది యుండెను. అతని జీవితకాలమున మాతృదేవి యచటికి వచ్చియుండినచో, నామె నివాసమునకై సమస్తసదుపాయముల నొనర్చియుండెడివాఁడు. కాని యాతనిస్థానమునకుఁ గ్రొత్తగా వచ్చిన యాలయాధికారి గురుదేవున కాప్తుఁడు కాఁడయ్యె.

---

* ఈ యనుభవములను దలఁచి మాతృదేవి తనసోదరులకొమార్తలతో నిట్లు పలికెడిది: "ఒక్కనాఁడైనను మీరట్టిగదిలో నుండఁజాలక పోవుదురు." వారిట్లు ఎలుఁగెత్తి పలుకువారు: "నిజమే, అత్తా! నీ చరిత్రయంతయు వేఱు."

మఱియు దేవాలయావరణమున నామె నివసించుటకుఁ దగినతావు వేఱొండు లేదయ్యె. సహజముగా లజ్జావతి యగు నామె జనుల కంటఁబడుట సహింపఁజాలకుండెడిది. ముఖాచ్ఛాదనము లేకుండ, ప్రారంభదినములలో నామె గురుదేవునిసైతము దర్శింపకుండెడిది. ఇతరు లెవ్వరుగాని మేల్కొనుటకు ముందుగనే తెల్లవాఱుజామున మూఁడు నాలుగుగంటల మధ్యమున లేచి యాతరుణమున గంగానదిలో స్నానము ముగించుకొని * పరులకంటఁ బడకుండ, తిరిగి తనగదిలోఁ బ్రవేశించును. కేశకలాపము నాఱఁబెట్టుకొనుటకుసైత మామె మధ్యాహ్న మొంటిగంట యగు పఱకును—నహబత్పరిసరములం దెవ్వరును లేకుండు సమయ మగువఱకును—వేచియుండును. అపు డామె యీవలకు వచ్చి నహబత్తు మెట్లపైఁ గూర్చుండి సూర్యరశ్మి ననుభవించుచు, కురుల నాఱఁబెట్టుకొనును. ఇట్లు తనజాడనైనను, ఎవ్వరును దెలియఁజాలనంతటి నిరాడంబరముగను, ఏకాంతముగను నామె మనుచుండ. 'ఆమె యిచట నివసించుచున్నదని విని యున్నాము కాని, యామె నెన్నఁడును మేము చూచినది లే' దని దేవాలయనిర్వాహకుఁడు తన్నుఁగూర్చి పలికెనని మాతృదేవియే తెలిపియున్నది.

---

* దీపసాహాయ్యమునైనను గైకొనక, యావేకువజామున నామె గంగానదికి వెడలుచు నొకనాఁడు, ఒడ్డునఁ బడియున్న యొక మొసలినిఁ ద్రొక్కఁబోయెనఁట. ఈ సంగతిని విని దీపము లేనిదే వెడలవలదని శ్రీరామకృష్ణుఁ డామెకు హితోపదేశ మొనర్చినట్లు తెలియ వచ్చుచున్నది.

మాతృదేవి తనలజ్జాశీలమును గాపాడుకొనుచు మనఁ గలుగుచున్నందులకై గురుదేవుఁ డామె నభినందించి యున్నాఁడు. ఇవ్విషయమై యామెయే యిట్లు వెల్లడించి యున్నది: ''ఆయన యిట్లనుచుండువారు: 'నాయనా, హృదు! (అనఁగా గురుదేవునకు సన్నిహితుఁడగు హృదయుఁడు) ఆమె మొట్టమొదట ఇచటికి వచ్చినప్పుడు ఆమెను గూర్చి యెంతో ఆందోళనపడినాను. పల్లెటూరినుండి వచ్చిన యామె పట్టణవాసధోరణి నెఱుఁగదుగదా!* లోకు లామె చర్యలనుగూర్చి పరిహసింతురనియు, దానిచే మనకందఱకును బాధకలుగుననియుఁ దలఁచినాను. కాని యామె లోకులదృష్టి నుండి పూర్తిగా దాఁగుకొనఁగలుగునంతటి యద్భుతవ్యక్తి స్నానాదులకు ఆమె బయటికి వెడలుచుండుట నే నెప్పుడును జూడనేలేదు.'† ఈ పలుకులు విని నే నాందోళనపడినాను.

---

* పట్టణవాసపరిక్షితులు తనకెంత వింతగాఁ గన్పట్టెనో తెలుపుచు, మాతృదేవియే యొక విచిత్రానుభవము నిట్లు వర్ణించియున్నది: ''నే నంతకుముం దెన్నఁడును నీటిగొట్టములను జూచియుండలేదు. ఒక నాఁడు కలకత్తాకువచ్చి నీటిగొట్టముగల యొకగదిలోఁ బ్రవేశించినాను. గొట్టమునుండి నీరు ప్రవహించుటకుముందు త్రాసు బుసకొట్టుచున్నట్లు అందుండి యొకశబ్దము వినవచ్చినది. అదలిపోయి గదినుండి పరుగెత్తి, యింటిలోనున్న యితరస్త్రీలవద్దకు వెళ్లి యిట్లు అఱచినాను: నీటిగొట్టములో పామున్నది. అది బుసకొట్టుచున్నది.' వారందఱును పక్కున నవ్వుచు, ఇట్లనిరి: 'పాము లేదు, భయపడకుఁడు! నీరు ప్రవహించుటకు ముందు బుసబుసమనుశబ్దము బయలు వెడలును.' అంతట మేమందఱమును కలిసి ప్రక్కలుపడ నవ్వనారంభించితిమి.''

† అట్లని శ్రీరామకృష్ణుఁడు స్త్రీలందఱును తెరచాటున నుండవలయుననియు బైట నెట్టికార్యములందును బాల్గొనరాదనియు నభి

ఆయన మానసమున నుదయించిన భావ మేదియైనను జరిగి తీరునని నాకుఁ దెలియును. ఆదినములలో మనఃపూర్వకముగా జగన్మాత నిట్లు ప్రార్థించుదానను: 'తల్లీ! జగన్మాతా! నాపై ననుగ్రహించి నా లజ్జాశీలమును గాపాడుము.'"*

---

ప్రాయపడెనని తలఁపరాదు. నిజమునకు లక్ష్మీదేవి, గోలాప్‌మాయి, గౌరీమాయి మున్నగు నాతని శిష్యురాండ్రు అనేకులు లోకమున, ముఖ్యముగా, పారమార్థికకార్యములందనుఁడు, బాహాటముగాఁ బాల్గొని యున్నారు. గౌరీమాయి స్త్రీలకొఱకై (మాతృదేవిపేర) శ్రీ శారదేశ్వరీ విద్యానిలయమను గొప్ప విద్యాసంస్థను నెలకొల్పి నిర్వహించియున్నది. శ్రీరామకృష్ణుఁడు వీరిచర్యల నెన్నఁడును నిరసించియుండలేదు. స్వీయ మార్గమునసే ఎవ్వరైనను వికాసము నొందఁగలరని శ్రీరామకృష్ణు నభిప్రాయముగా గ్రహింపనగును. ఇవ్విషయమునుగూర్చియే మాతృదేవి యిట్లు తెల్పియున్నది: "లక్ష్మి (శ్రీరామకృష్ణునకు ఆప్తురాలును శిష్యురాలును) హరిదాసుల ననుకరించుచు, ఆయనయెదుట నృత్యసంకీర్తనములను జేయుచుండెడిది. ఆయన నాకిట్లు తెల్పిరి: 'అది యామె ప్రకృతి; కాని నీ వామె ననుసరించి నీ లజ్జను విడనాడరాదుసుమీ!'"

* లక్ష్మీదేవి యివ్విషయమున నిట్లు తెలిపియున్నది: "మాతృదేవి నహబత్తునుండి తనగదిలో జరుగు నృత్య సంకీర్తనాదుల నవలోకింపఁ గలుగుటకుఁగాను గురుదేవుఁడు తనగది ఉత్తరద్వారమును తెఱచియుంచువాఁడు. పంచాదియావరణమునఁ జిన్నసందులను జేసి యందుండి యామె యవలోకించుచుండెడిది. ఆ సందులు నానాఁటికిఁ బెద్దవగుచుండుట గాంచి, గురుదేవుఁడు మా యన్నను బిలిచి, 'ఓ రామలాల్! మీ పిన్నిగారి వాసమునకు భంగము కలుగుచున్నది!' అని పరిహసించును. మా యన్న యిట్లు సమాధానించును: 'నే నేమి చేయుదును? మీరే అందుకు కారకులు. నే నెన్నిసార్లు మూయుచున్నను, ఉత్తరపుఁదట్టుతలుపు మీరేల తెఱచియుంచవలయును?'"

ఐనను, సాధ్యమైనంతవఱకు ప్రకృతికాంతతోఁ జెలిమి యొనర్చుట శరీరారోగ్యమున కెంతయు నావశ్యకమని గురుదేవుఁ డామె కి ట్లుద్బోధించువాఁడు: "అడవిలో నివసించు పక్షినిఁ బట్టుకొని యహర్నిశము పంజరమున బంధించితిమేని యది కీళ్లనొప్పులచే బాధపడును.* కావున నీవు, అప్పుడప్పుడైనను, పరిసరములందు సంచరించుచుండవలయును." గురుదేవుని సదుపదేశము ననుసరించి యామె పరిసరములందలి స్త్రీలయిండ్లకు అరుగుచుండెడిది.

మాతృదేవినివాస మెంతయు అసదుపాయముగా నుండుటఁగని గురుదేవునిశిష్యుఁడగు శంభుమల్లిక్ అనునాతఁడు భావనామ (1874-వ) సంవత్సరమున ఆలయసమీపమున నొకకుటీరమును నిర్మించెను. అందామె యించుమించుగా నొకసంవత్సరము గడపెను. ఆమెకుఁ దోడ్పడుటకును, అనుచరురాలై యుండుటకును ఒకపరిచారిక నియమింపఁబడియెను.

మాతృదేవి గురుదేవుని భోజనమును సిద్ధమొనర్చి స్వయముగా వడ్డించుటకై యాలయమందలి యాతనిగదికిఁ గొనివచ్చును. గురుదేవుఁడును నామె యోగక్షేమముల నరయుటకై ప్రతిదిన మొక్కసారి యామెకుటీరమునకు వెడలి, సాయంకాలమునఁ దప్పక తననివాసమునకుఁ దిరిగి

---

* నిజముగా మాతృదేవి కీళ్ల నొప్పులచే బాధపడసాగెను. ఇవ్విషయమునుగూర్చి యామెయే యిట్లు తెల్పియున్నది: "...నృత్యము, సంకీర్తనము, ఆవేశము, సమాధి—ఇవన్నియు (చెంతనున్న గురుదేవుని గదిలో) అహర్నిశము సాగుచుండెను. తడకలలో సందులుచేసి వీనిని జూచుదానను. నిరంతరము అచట నిలుచుండుటచే, నాకుఁ దుదకీ కీళ్లనొప్పులు సంభవించినవి."

వచ్చువాఁడు. ఈ నియమమునకు భిన్నముగా నొకరాత్రి వానచే నిరోధింపఁబడి యాతఁడు మాతృదేవినివాసముననే గడపెను. భోజనసమయమున—భార్య తనకు వడ్డించుచుండ —ఆతఁ డిట్లు సల్లాపమొనర్చెను: "కాళికాలయార్చకులు రాత్రి తమ యిండ్లకు వెళ్లరా? నేను నట్లే చేయుచున్నాను. కాదా?"

ఇంచుమించుగా నొకసంవత్సర మైనపిమ్మట శ్రీరామకృష్ణుఁడు తీవ్రమగు గ్రహణిచే బాధపడుట తటస్థించెను. అపు డాతనియొద్దనే యుండి సేవల నొనర్చుటకై మాతృదేవి నహబత్తునకుఁ దిరిగి వచ్చెను. అనంతర మామె తిరిగి తన కుటీరమునకు వెడలకుండుటకు కారణము తెలియరాకున్నది.

మాతృదేవి గురుదేవున కొనర్చెడి సేవలన్నిటిలో వంటనే ప్రధానముగా పరిగణించెను. ఏలన, భోజనమందేమాత్రము వ్యత్యాసము సంభవించినను, త్రాసువంటి యాతని జీర్ణశక్తి చెడుచుండెడిది. శారదాదేవిమాత్రమే తన యారోగ్యమునకు సరిపడునట్లు విశేషశ్రద్ధతో వండఁగలుగుచుండెనని యాతఁడు గుర్తించెను. ఏ కారణముచేనైనను, ఆమె దక్షిణేశ్వరమున లేనపుడెల్ల నాతఁడు బాధపడి వెంటనే రావలయునని కోరుచు నొక్కొక్కప్పు డామెకుఁ గబురంపువాఁడు. ఇవ్విషయమున నామెయే తనకు ఆధారభూతురాలని భక్తబృందమునకుఁ దెలుపుచు నాతఁ డిట్లు చమత్కరించును: "సరి, నావంటివానికి 'భార్య' యనఁగా నేమని మీ తాత్పర్యము?" చిఱునగవుతో నాతఁడే యిట్లు సమాధానించును: "చూడుఁడు, ఆమె గానిచో, మఱె

వ్వారు నా యారోగ్యమునకు సరిపడునట్లు భోజనము సిద్ధము చేయువారు ?''

మాతృదేవి యివ్విధమున గురుదేవునకును దనయత్త యగు చంద్రాదేవికిని సపర్యల నొనర్చుచుండెను. ఆమె తానెంత పనిలో నున్నను, వృద్ధురాలగు చంద్రాదేవి తన్నుఁ బిలిచినచో — పూర్తిగాఁ దన పే రుచ్చరింపకమునుపే — ఆమెయొద్దకుఁ బరుగిడుచుండెడిది. పెద్దలనిన, ఆమె కంతటి శ్రద్ధాభక్తులు. అంతతొందరగాఁ బరుగిడినచో, ద్వారబంధము తలకుఁదగుల బాధకలుగవచ్చునని యోగేన్‌మాయి యొకప్పుడు ప్రేమపూర్వకముగా వారింప నామె యిట్లు సమాధాన మొసఁగెను: ''ఒకవేళ అట్లు జరిగినను జరుగుఁ గాక. ఆమె నా గురువు, మఱియు నా తల్లి. ఆహా! అంత వృద్ధురాలు సకాలమున నేనామెవద్దకు వెళ్లనిచో, ఎంత శ్రమపడునోకదా! నేనామెవద్దకు అంతతొందరగాఁ బరుగెత్తుట కిదియే కారణము.''

క్రమముగా గురుదేవుని శిష్యబృంద మభివృద్ధినొందుచుండ, మాతృదేవి పచనకార్యభారమును వృద్ధినొందసాగెను.* శిష్యులనేకులు తఱచు గురుదేవుని సన్నిధినే నిలుచు

---

* కాలాంతరమున నొక శిష్యున కామె యిట్లు తెల్పెను. ''...మూఁడు నాలుగుసేర్ల పిండి కలిపి చపాతీలు చేయుచుదానను...ఒకనాఁడు ఠాకూరు నరేంద్రునకు (ఈతఁడే పిమ్మట శ్రీ వివేకానందస్వామి) చక్కఁగా వండిపెట్టుమనిరి. పలుచని పెసరపప్పును, చపాతీలను చేసినాను. భోజనానంతరము ఠాకూరు నరేంద్రునిఁ జూచి, 'భోజన మెట్లున్నది?' అని యడిగిరి. 'బాగుగనేయున్నది కాని పథ్యమువలె తోఁచినది' అని నరేంద్రుఁడు బదులుచెప్పెను. అంతట ఠాకూరు నాతో ఇట్లనిరి: 'నరేన్'

టయు మాతృదేవి వారందఱకును వంటచేయుచుండెడిది. కొందఱికి చపాతీలను, కొందఱికి ఖిచురియను నొక విధమైన పులగమును—ఇట్లు వివిధవ్యక్తులకు వివిధాహారపదార్థములను జేయవలసి వచ్చెడిది. 'ఒక్కొక్కప్పుడు అహర్నిశము వంట పనియందు నిమగ్నురాలనై యుండుదాన'నని యామెయే తెల్పియున్నది. ఇందులకు మనోహరమగు నొక నిదర్శనము: సాయంసమయమున నొకనాఁడు లాటు అను బాలశిష్యుఁడు (కాలాంతరమున అద్భుతానందస్వామి) ధ్యానమునకుఁ గూర్చుండియుండ, శ్రీరామకృష్ణుఁ డాతని సమీపించి యిట్లు పలికెను : "నాయనా! ఆ పరతత్త్వము — నీ ధ్యానమునకు లక్ష్యభూతమైన దేవత — సహాబత్తున చపాతీలు చేయు చున్నది. వెళ్లి పిండి కలిపి, చపాతీలను ఒత్తి యామెకు సాయముచేయుము." కర్మయోగరహస్యము ఇం దెంత చక్కఁగా ప్రదర్శింపఁబడియున్నదో కనుఁడు!

ఎంతటి కార్యభారమును వహించుచున్నను, మాతృదేవి నిత్యకృత్యములయం దత్యంత నియమబద్ధురాలు. బ్రాహ్మముహూర్తముననే లేచి, గంగాస్నాతయై పూజా ధ్యానములందు ప్రభాతమును గడపును. ఉదయసాయంసమయములందు ధ్యానము అత్యావశ్యక మని గురుదేవుఁ డామెకుఁ దెలిపియుండెను.* అనంతర మామె వంటచేయ నారం

---

నకు అదియా నీవు చేసినవంట? ముద్ద పప్పును దళమైన చపాతీలను నీ వాతనికి చేసిపెట్టవలయును.' తుదకు నేను హానిని వండిపెట్టఁగా, 'నరేన్' సంతృప్తుఁడై నాఁడు..."

* పారమార్థికనియమములందు శ్రీరామకృష్ణుఁడు చండశాసనుఁడు.

భించును. అటుపిమ్మట గురుదేవుని చెంత భక్తబృందము లేనిచో, తాను వెడలి యాతనిశరీరమునకు తైలమర్దన మొనర్చును. ఆతఁడు స్నానమొనర్చుచుండ, తాను తముల పాకుల చిలుకలను జుట్టును. అటువెనుక నాతనికి భోజనము నిడును. ఆ సమయమున నాతఁడు అకస్మాత్తుగా సమాధిస్థితిని బొందకుండునట్లు — భోజనమున కాటంకము కలుగకుండు నట్లు—తన ప్రియభాషణములచే నాతని మానసము నలరించును. మఱియు లాలించి పసిబిడ్డలచే బువ్వ తినిపించు తల్లి వలె నామె యాతనికి భోజనమిడునెడ ననేకోపాయముల నవలంబించును. విస్తారముగాఁ గాన్పించి యాతనికి భయము గొల్పకుండుటకై అన్నము నామె భోజనపుఁ బళ్లెరమునం దదిమిపెట్టును; ఆతని యారోగ్యమునకు వలయు పాలను సంపాదించి మీఁగడకట్టునట్లు ఎఱ్ఱఁగాఁ గాఁచి కొంచెముగాఁ గాన్పింపఁజేయును. మాతృప్రేమవిలసితమగు నామె శ్రద్ధచే నాతని యారోగ్య మభివృద్ధినొందసాగెను. ఇవ్విషయమై శ్రీ రామకృష్ణుఁడే యామెతో నిట్లు వచించువాఁడు: "నీవు వండిన యాహారమును దిని నేనెట్లు బలియుచున్నానో చూడు!"

గురుదేవుని భోజనమైనవెనుక నామె యల్పాహార మును భుజించి తములపాకులచిలుకలను జుట్టుచు — పిమ్మ

---

మాతృదేవియు నహబత్తున నామెతోఁ దఱచు నివసించుచుండిన లక్ష్మీదేవియును వేగుజామున నెన్నఁడైనను లేవకుండినచో—ఆ సమయమున తా నా దారిని వెడలుచు—వారు లేచి ధ్యానమారంభించుటకై తన కమండలువునందలి నీటిని వారిశయ్యపైఁ బోయువాఁడు.

టను—తనలోఁ దాను భక్తికీర్తనములను బాడుకొనును. ఒంటిగంటకామె భోజన మొనర్చి కొంచెముసేపు విశ్రమిం చును. పదపడి నహాబత్తుమెట్లపైఁ గూర్చుండి సూర్య తేజస్స్పర్శ ననుభవించుచు, కురుల నాఱఁబెట్టుకొనును. పిమ్మట దీపములకు వత్తులను సరిచేసి, స్నానమొనర్చి రాత్రి కాలపువంటకై వస్తువుల నాయిత మొనర్చును. సాయం సమయమున దేవతామూర్తికి ధూపమును సమర్పించి ధ్యాన మునఁ గూరుచుండును. అనంతరము వంటగావించి, గురుదేవునకును దనయత్తకును బెట్టి, తాను దిని పిమ్మట శయనించును.

ఎన్నిపను లొనర్చుచున్నను, గురుసంసేవన మామె హృదయమునకు దివ్యానందసంధాయకమై దీపింప, కార్య భార మామెకుఁ గలనైనను దోఁపదయ్యె. గురుదేవుని సేవించుటకే కారణముచేనైనఁ దగినంతయవకాశము లభిం పనిచో నామె యెంతయో చింతించును. ఐనను దానొనర్చు సపర్యలను—ముఖ్యముగా నాతనికి భోజనమిడు సదవకాశ మును సైతము—ఎవ్వరైనను దస్కరించినచో, ఆమె మృదుల మాతృహృదయము నిరాకరింపఁ జాలకుండెడిది. అహర్నిశ మామె నిజముగా నాతనిసన్నిధినుండు నవకాశ మిదియొక్క టియేయని మనము గమనించినచో, ఇందలి ప్రాముఖ్య మూహింపనగును. ఇవ్విషయము నెంచియే కాలాంతరమున నామె యిట్లు తెలిపియున్నది: "ఆ దినములలో బహుశా రెండునెలలకేయొక్కసారియో ఆయనను దర్శింపఁగలుగు దానను. అపుడు నాలో నే నిట్లు సమాధానము నొందు

దానను : 'ఓ మనసా! ప్రతిదినము నీ వాయనను దర్శింపఁ గలుగునంతటి భాగ్యమునకు నోఁచుకొంటివా?' "

అలౌకికమగు శ్రీ శారదా శ్రీరామకృష్ణుల యన్యోన్య ప్రేమానురాగములనుగూర్చి (శ్రీరామకృష్ణుని శిష్యురాలగు) గౌరీమాయి యిట్లు పలికియున్నది: "ఏఁబదిగజముల దూరమున నివసించు నీ వ్యక్తు లిరువురును నెలలకొలఁది యొండొరులను గలిసికొనకున్నను, అఖండ ప్రేమానురాగ బద్ధులు. ఒకసమయమున అమ్మకు (శారదాదేవికి) తలనొప్పిరాఁగా, శ్రీరామకృష్ణుఁడు (తనసన్నిహితుఁడగు) రామలాలునిఁ జూచి పదేపదే, 'ఓయి రామలాల్! ఆమె కెందుచే తల నొప్పి వచ్చినదోయి!' అని యెంత యాందోళనమొందెనో స్వయముగాఁ జూచినాను."

పారమార్థిక ప్రేమానురాగములతోఁ బోల్చి చూచినచో, లౌకిక ప్రేమ — విషయవాంఛాప్రేరితమగు శారీర మోహము—ఎంత తుచ్ఛముగాఁ గాన్పించును! కామకళంక వినిర్ముక్తమగు ప్రేమానురాగములే ప్రేమానురాగములు!

గురుదేవునిఁగూర్చి ప్రసంగించుచు, మాతృదేవి యొకప్పు డిట్లు పలికియున్నది: "ఆయన కామకాంచన త్యాగమూర్తి. ఐనను నన్నుఁగూర్చి యాయన తాపత్రయ మాయన కుండనేయుండెను. ఒకప్పు డాయన న న్నిట్లడిగిరి: 'నీ ఖర్చునకు నెలకు నీ కెంత కావలయును?' ఐ దారు రూపాయలు చాలునని చెప్పినాను. తరువాత నిట్లనిరి: 'రాత్రి నీవు ఎన్ని చపాతీలు తిందువు?' సిగ్గుచే చిమిడిపోతిని. ఆప్రశ్న కెట్లు సమాధానము చెప్పుట? కాని యాయన గ్రుచ్చి

గ్రుచ్చి యడుగఁగా, 'ఐదాఱు' అని యెట్టకేలకు సమాధా నము చెప్పవలసివచ్చినది.''

త్యాగచక్రవర్తియయ్యు, శ్రీ రామకృష్ణుఁడు శ్రీ శారదాదేవిజీవితము నన్నివిధములను ఆనందమయమొనర్చుటకై—సతీమణి తనయభిరుచులను మనోభావములను పతి లక్షించుపట్ల పొందు ననిర్వాచనీయసంతృప్తిని ఆమె కొనఁగూర్చుటకై—మనఃపూర్వకముగా యత్నించెను. స్త్రీల కుచితమగు నాభరణములందామెకు ప్రీతి గలదని యెట్లో గ్రహించి మూఁడువందలరూపాయలను బెట్టి* చక్కని నగలను జేయించెను. ఇవ్విషయమై యాతఁడిట్లు వచించువాఁడని మాతృదేవి తెలిపియున్నది: ''ఆమెపేరు శారద. ఆమె సరస్వతీదేవి అవతారము. కావునఁ గొన్ని యాభరణములను ధరించుట యామె యభీష్టము.'' ఈ సందర్భమునెంచి యాతఁడొక్కొక్కప్పు డిట్లు హాస్యమొనర్చును: ''ఓహో! నాకు ఆమెతో ఈపాటి సంబంధము గలదుసుఁడీ!''†

---

* దేవాలయనిర్వాహకుఁడగు మధురబాబు శ్రీరామకృష్ణునకు నెల కేడురూపాయల పింఛ నేర్పాటుచేసియుండెను. ఇది తన్మూలమున నేకరింపఁబడిన ద్రవ్యము.

† శ్రీరామకృష్ణుని హాస్యసల్లాపములనుగూర్చి కాలాంతరమున మాతృదేవి యిట్లు వచించెను: ''...నరేంద్రుఁడు (వివేకానందస్వామి), 'బాబురాము' (ప్రేమానందస్వామియు)ను (ఆయన హాస్యసల్లాపములను విని) పక్కలు వడ నవ్వుచు, నేలపైఁబడి దొరలిపోవువారు. కాశీపురవనములో నుండఁగా, ఒకనాఁడు నేను మూఁడుసేర్ల పాలతో నిండిన యొక గిన్నె పట్టుకొని మెట్ల నెక్కుచుంటిని. తల దిమ్మగా తోఁచినది, అడుగులు తడఁబడినవి, పాలు ఒలికిపోయినవి. నరేంద్రుఁడును బాబురామును

గురుదేవుఁడు మాతృదేవి నెంతగా ప్రేమించెనో, ఆమెమానసము నెట్లలరించెనో, తెలుపు నిదర్శనము లనేకములుకలవు. శరీరచ్ఛాయనుగూర్చి దక్షిణేశ్వరమున నొకప్పుడొకపోటీపరీక్ష జరిగెను. అందు గురుదేవుఁడే యొక యభ్యర్థి.* మఱియొకఁ డాతనిశిష్యులలో నొకనియల్లుఁడు. ఇరువురును వర్చస్సునకుఁ బేరుగాంచియుండిరి. గురుదేవుఁడు మాతృదేవిని మధ్యవర్తినిగా నియమించెను. అభ్యర్థు లిరువురును ఆమె తమ్ము పరీక్షించుటకై పంచవటీప్రాంతమున నొకరిప్రక్క నొకరు నడువసాగిరి. మాతృదేవి నిష్పక్షపాతబుద్ధితో రెండవవ్యక్తికే విజయపతాకము నొసఁగెను.

మఱియొకప్పుడు కామారిపుష్కరమున నుండఁగా మాతృదేవి తనబంధుగులతోఁ గలిసి యొకానొక ప్రదర్శనము జూడ కుతూహలపడెను. శ్రీరామకృష్ణుఁడు వారిని వారించి, బాల్యమునఁ దాను గాంచియుండిన యొకనాటక

---

పరుగెత్తుకొనివచ్చి నన్ను లేవఁదీసినారు. నా పాదములపై వాఁపు కనిపించినది. ఈ ప్రమాదమునుగూర్చి విని బాబురాముతో తాకూ రిట్లనిరి: 'సరి, బాబురామ్, మంచిచిక్కు తటస్థించినదే! నా కిపుడు భోజనము సమకూర్చువా రెవరు?'... నా కపుడు ముక్కున నత్తుండెడిది. నన్ను సూచించునిమిత్తము ఆయన తనముక్కు తాఁకి, వేలితో వలయాకారము చుట్టి యి ట్లనిరి: 'ఆమెను (సైగసేయుచు) ఒకగంపలోఁ బెట్టి, భుజముమీఁది కెత్తుకొని యీ గదిలోనికిఁ దీసికొనిరాఁగలవా?' నరేంద్రుఁడును బాబురామును పక్కలుపడ నవ్వ నారంభించిరి..."

* శ్రీరామకృష్ణుని శరీర మా దినములలో బంగారుచాయతో నొప్పుచుండెను. మాతృదేవి తాను తైలమర్దన మొనర్చుచుండ నాతని శరీరము స్వర్ణకాంతుల నీనుచుండెడిదని తెలిపియున్నది.

మును స్వయముగా అద్భుతరీతిని ప్రదర్శించి వారల నానందాబ్ధి నోలలాడించెను.

శ్రీ శారదాదేవియనిన, శ్రీ రామకృష్ణున కించుమించు గౌరవభావము. ఆమె నమ్రత మఱుఁగున నెట్టి పవిత్రత దీపించుచుండెనో, ఆమె లజ్జాశీలమున నెట్టి పారమార్థిక ప్రభావము అణఁగియుండెనో, యాతఁడు విస్పష్టముగాఁ గాంచుటయే యిందులకు కారణము. మానవకోటికి జ్ఞానమును ప్రసాదించుటకై యావిర్భవించిన దేవతామూర్తి యని యాతఁ డామెనుగూర్చి భావించెను. ఆమెతో నాతఁ డిట్లు వచించెను: "చుట్టునున్న జనులు అంధకారమున నివసించు పుర్వులవంటివారు; వారిని నీవు రక్షింపవలయును." తన పారమార్థికోద్యమము నామె సాగింపవలసియుండునని— వేలకొలఁది ముముక్షువుల కామె దారిఁ జూపవలసియుండునని—గ్రహించియే యాతఁ డామెతో నిట్లు పల్కెను. ఏ విపత్తువలననో తీవ్రసంతాపము నందుచుండిన యొకతె శ్రీరామకృష్ణు నొకనాఁడు సమీపింప, "అల్లదిగో, ఆ యింట నివసించు నామెకు నివారణోపాయము తెలియును" అని శ్రీ శారదాదేవియొద్ద కనిపెను. మాతృదేవి యది శ్రీరామకృష్ణునిలీల యని భావించి మఱల నామె నాతనియొద్దకే పంపెను. గురుదేవుఁ డామెను మఱల తనయొద్దకే పంప, తుదకు మాతృదేవి పూజాసమర్పితమగు నొకబిల్వపత్త్రము నామె కొసఁగెను. తన్మూలమున నా యార్తురాలి జీవిత మద్భుతపరిణామము నందినట్లు తెలియవచ్చుచున్నది.

శారదాదేవి యాధ్యాత్మికశక్తి తన యాధ్యాత్మిక శక్తికిఁ దీసిపోదని యొక వైష్ణవగీతము* నుదాహరించుచు శ్రీరామకృష్ణుఁడు మఱియొకప్పుడు శారదాప్రసన్నుఁడు (త్రిగుణాతీతానందస్వామి) అను శిష్యు నామెయొద్ద మంత్ర దీక్ష గైకొన నియమించెను. మఱియుఁ దనయఖండతపో ధ్యానములచే తేజోదీపిత మొనర్చిన దివ్యమంత్రములను శిష్యుల కుపదేశింపవలయు విధానముతోఁగూడ నామె కొసఁగెను. తనయుపదేశసరణినిగూర్చి కాలాంతరమున నామె యిట్లు తెలిపియున్నది: "గురుదేవునియొద్దనే యీ మంత్రముల నన్నిటిని గ్రహించినాను. వీనిమూలమున నెవ్వరైనను మోక్షమును తప్పక పొందఁగలరు." కాశీ పురవనమునఁ దనయంత్యదశలో శ్రీరామకృష్ణుఁ డెంతయు జాలిగొల్పు వచనముల నామె నిట్లు ప్రశ్నించెను: "సరి, నీవేమియుఁ జేయవా? సమస్తము నేను జేయవలసినదేనా?" అందులకు మాతృదేవి యిట్లు సమాధానమొసఁగెను: "ఆఁడుదాననగు నే నేమి చేయఁగలను?" కాని గురుదేవుఁ డిట్లు వక్కాణించెను: "కాదు, కాదు. నీవు చేయవలసిన దెంతో ఉన్నది."

శ్రీ శారదాదేవి సౌశీల్యము నెంచి శ్రీరామకృష్ణుఁ డిట్లు పలుకును: "ఆమె నెవ్వరును నిందింపకుందురుగాక! నిజముగా ఆమె కెవ్వరైనను కోపము గల్గించినచో, దారుణమగు

* "అనన్త రాధార్ మాయా కహనే నా జాయ్, కోటికృష్ణ కోటిరామ్ హయ్ జాయ్ రయ్.—అనంతము, అచింత్యమునగు రాధాదేవి మాయాశక్తిచే కోటికృష్ణులును కోటిరాములును సృష్టిస్థితిలయముల నొందుచున్నారు."

ఫలము నొందఁగలరు.'' "హృదయుఁ డొకప్పుడు గురుదేవుని సమక్షమున నామెయెడ నగౌరవము చూపెను. ఆమె పరమ శాంతముగా దానిని సహించి సహాబత్తునకు మఱలెను. హృదయుని క్షేమమునకై శ్రీరామకృష్ణుఁ డాందోళన మొందుచు నిట్లు పల్కెను: "నీవు నన్ను తఱచు తృణీకరించుచుందువు. కాని యామెనుమాత్ర మట్లు తృణీకరింపఁ బోకుము. ఈశరీరమున (అనఁగా, తనయందు) నివసించువ్యక్తి 'పడగనెత్తినపక్షమున' నీకు గతియున్న నుండవచ్చును, కాని యామెయందున్న వ్యక్తికి కోపము వచ్చినదా, బ్రహ్మవిష్ణు మహేశ్వరులును నిన్ను రక్షింపఁజాలరు.''*

కలనైనను గురుదేవుఁ డామెమనస్సును నొప్పించి యెఱుఁగఁడు; ఆమెమనోభావములును ఆశయములును ఆతని కెప్పుడును సమాదరణీయములై యొప్పెను. ఇందులకుఁ గొన్ని నిదర్శనములు. భక్తులనేకు లా దినములలో ఫలములను మధురాహారములను పుష్కలముగాఁ గొనివచ్చువారు. సహజముగా ఉదారహృదయయగు మాతృదేవి గురుదేవునకుఁ గొంచె ముంచి, తనమాటయే తలపెట్టక భక్తులకును ఇరుగుపొరుగు బిడ్డలకును వానినన్నిటినిఁ బంచి పెట్టెడిది. గురుదేవుఁ డొకనాఁ డది గాంచి, అయ్యది అతి వ్యయమునకు లక్షణముగా నెంచి, సంతాపసూచకస్వరమున నిట్లు పలికెను: "ఈ విధముగా వ్యయించిన నెట్లు నిర్వ

---

* హృదయుఁ డీ హితోపదేశమువలన లబ్ధినొందలేదు. తత్ఫలితము తొమ్మిదవ ప్రకరణమునఁ గాననగును.

హింపఁగలవు?'' విశ్వమానవప్రేమనిలయము, ఈవికిఁ బట్టుఁ గొమ్మయునగు నామెమృదులమాతృహృదయమున కా పలుకులు ములుకులై సోఁకెను. బొమముడిచే వదనకమలము ముకుళింప, కెంపుచూపుతో నామె త్వరితగతి నటనుండి వెడలిపోయెను. తత్క్షణమే గురుదేవుఁడు పరిస్థితిని గ్రహించి, సన్నిహితుఁడగు రామలాలునిఁ జేకవైచి, కంపితగాత్రమున నిట్లు పలికెను: ''రామలాల్! వెళ్లి మీ పిన్నిని సమాధానపఱుచు. ఆమె మనస్సు క్షోభించెనా, నా కిఁక దుర్గతియే!''

'మధురభావము' * పూని సాధన యొనర్చుచుండిన యొకస్త్రీ యొకప్పుడు శ్రీరామకృష్ణుని సందర్శింపసాగెను. ఒకనాఁ డామె తన 'మధురభావమును' శ్రీరామకృష్ణుని యెడలనే అవలంబింప నాతని యంగీకారము గోరెను. అది యాతనికి కోపము గలిగింప నాతఁ డామెను బిగ్గఱగా దూషింపనారంభించెను. ఈ చర్యను నహబత్తునుండి గాంచి మాతృదేవి యా స్త్రీ దురవస్థను దలఁచి పరితాపమొంది, యామెను దనకడకుఁ దీసికొనిరమ్మని గోలాప్మాయినిఁ బంపుచు నామెతో నిట్లు పలికెను: ''ఇది యేమి చోద్యమమ్మా! ఆమె చేసినది తెలివితక్కువనియే యనుకొందము, కాని, యామె నీవిధముగా దూషించుటకుబదులు నాదగ్గఱకుఁ బంపవచ్చునే!'' గోలాప్మాయి యామెను గొనివచ్చినంతనే మాతృదేవి యామెను గన్నకూఁతునువలె నాద

* భగవంతుఁడు తమభర్తయని భావించునట్టి సాధకుల మనోభావము.

రించి ప్రేమమీఱ నిట్లు పల్కెను: "మాతల్లీ! నీ వాయన యెదుట నుండు టాయనకు బాధగా నున్న పక్షమున, నా దగ్గఱకు నిరభ్యంతరముగా రావచ్చును."

శ్రీ శారదాదేవియెడ శ్రీరామకృష్ణుని గౌరవభావమునకు మఱియొకనిదర్శనము. తనయొద్ద నివసించుచుండిన బాలశిష్యులను గురుదేవుఁడు ముఖ్యముగా రాత్రికాలమున బహులఘువుగా భుజింపవలయునని నియమించియుండెను. ఒకనాఁ డాతఁడు తనశిష్యు లీనియమమునకు భిన్నముగా శ్రీ శారదాదేవి యౌదార్యమునకు పాత్రు లగుచుండిరని విని యామెకడకు వెడలి, "వారల భావిదశను పాడుచేయవలదు" అని హెచ్చరించెను. కాని మాతృదేవి యిట్లు సమాధానించెను: "...వారిశ్రేయమును నేను గమనింతునులెండు. భోజనవిషయమున మీరు వారిని నిందింపనక్కఱలేదు." తనబిడ్డలు మనసార భుజించిననేకాని యాతల్లి యెంతటి యాందోళనమొందునో గురుదేవుఁడు వెంటనే గ్రహించి, "సరి లెమ్ము!" అని మనసార నవ్వెను.

శ్రీ శారదాదేవియెడ తనగౌరవాదరములను నిత్యకృత్యములలో శ్రీరామకృష్ణుఁడు అప్రయత్నముగా వెలువరించును. భర్త సాధారణముగా భార్యను బిలుచునట్లుకాక, ఆతఁడామె నించుక గౌరవసూచకముగా సంబోధించును. ఒకనాఁడామె యాతనియాహారమును జేర్పూని గదిలోఁ బ్రవేశించెను. గురుదేవుఁడు ఆమె తన యన్నకుమార్తె యగు లక్ష్మి యని పొరపడి, "తలుపు దగ్గఱగా వేయవే" అనెను. ఆమె శ్రీ శారదాదేవి యని యాతఁడు గ్రహించినంతనే ఆందో

శనముతో నిట్లు క్షమాపణ వేడికొనెను: "అయ్యో! ఏమమ్మా! లక్ష్మి యని పొరపడినాను, మన్నింపవలయును." మాతృదేవి దానఁ దప్పేమియు లేదనియు, లక్ష్మినిఁ బలుకరించినట్లే తనను బలుకరింపవచ్చుననియు సవినయముగా సమాధాన మొసఁగెను. కాని గురుదేవుఁడు సంతృప్తినొంద లేదు. మఱునాఁడు నహబత్తునకు వెడలి, రాత్రి తాను నిద్ర పోఁజాలకపోతిననియు, ఆమెతో ఆ విధముగా మాటలాడినందులకై ఎంతయో వ్యాకులపడితిననియు తనపశ్చాత్తాపమును దెలిపెను. ఈ విషయమునే స్మరించుచు, కాలాంతరమున మాతృదేవి, వివేకహీనులగు తనబంధువులు తనయెడ నగౌరవముగాఁ బ్రవర్తించినపు డిట్లు తెలుపుచుండెడిది: "నన్నెన్నఁడును 'ఏమమ్మా' అనియేగాని, 'ఏమే' యని పిలిచి యెఱుఁగని మహనీయుఁడు నాభర్త. ఆహా! ఆయన నన్నెంత మన్నించిరి! కటువైన ఒక్కమాటైనను ఆయన నన్నన లేదు. కలనైనను నా మనస్సును నొప్పించ లేదు ఆయన! పూవుతోఁ గూడ ఆయన నన్నెన్నఁడును కొట్టియెఱుఁగరు!"

గురుదేవుని యీ గౌరవాదరములు మాతృదేవిహృదయమున సహస్రగుణాధికమై ప్రతిఫలనమునొందెను. వినిర్మల ప్రేమగౌరవములతో ననుదినము ఆమె గురుదేవుని సేవించుటయందేమి, ఆతని మహోత్తమజీవితాదర్శమునఁ దన భావములను సమాహితమొనర్చుటయందేమి, ఆ ప్రతిఫలనము రూపుదాల్చెను. మహనీయుఁడగువానిసతి పతి కొనర్ప వలయు సేవలలో ఆతనిజీవితాశయములను హృదయంగమ మొనర్చుకొని వానినుపాసించుటకంటెఁ గొనియాడఁదగిన సేవ

మ తేమి కలదు? పర మేశ్వరార్పితజీవనమున, జితేంద్రియత్వ మున, మాతృదేవి గురుదేవున కెనయగు సహధర్మచారిణియై యెటు లొప్పెనో గాంచియున్నాము. కాంచనత్యాగ మామెచరిత్రమున నెట్లు దీపించెనో యిఁక గమనింపవలసి యున్నది.

శ్రీరామకృష్ణుని శిష్యులలో లక్ష్మీనారాయణుఁ డను నొక మార్వాడీ ధనికుఁ డొకప్పు డాతని సపర్యలకై పదివేల రూపాయలను సమర్పింపఁబోయెను. త్యాగమూర్తియగు శ్రీరామకృష్ణుఁడు 'శరీరము అంపముతోఁ గోయఁబడినట్లు' బాధపడి, యట్టిప్రస్తావము తనముం దెన్నఁడును జేయవల దనెను. బహుశః పరీక్షించుటకై యుండనోపును, శ్రీ శారదా దేవికి అభ్యంతరములేనిచో నాతఁ డాద్రవ్యమును నామె కొసఁగవచ్చునని తెలిపి పంపెను. కాని మాతృదేవి యయ్యది గురుదేవునిసేవకే వినియోగింపఁబడును కాన దాని నాతఁడు గ్రహించుటొకటియుఁ దాను గ్రహించుట వేఱొక టియుఁ గాదని యా ధనమును నిరాకరించెను. ఆమె యొసఁగిన సమాధానమును విని గురుదేవుఁ డెంతయో సంతసించెనని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

గురుదేవుఁడు లోకమునకు బోధించిన పరమాదర్శము త్యాగమనియు త్యాగమే యాతని జీవితాలంకారమనియు మాతృదేవి వచించును. కాలాంతరమున నొకశిష్యుఁ డామెతో నిట్లు పల్కెను: "అమ్మా! గురుదేవుఁడు లోక మున కెట్టి యద్వితీయతత్త్వమును ప్రసాదించెను! సర్వమత సామరస్యము నాతఁడు స్థిరపఱిచెను." మాతృదేవి యిట్లు

సమాధాన మొసంగెను: "నాయనా! మతసామరస్యవిష యమై నీవు చెప్పినమాట నిజమేకాని యీ తత్త్వమును లోక మునకు బోధింతమను నుద్దేశముతో ఆయన వివిధమతము లను అవలంబించినట్లు నాకెన్నఁడును కనఁబడలేదు. పరమే శ్వరచింతనమను అమృతపానముచే ఆయన అహర్నిశము పారవశ్యముపొందిరి. వైష్ణవమతము, క్రైస్తవమతము, మహమ్మదీయమతము మొదలైనవానిని సాధనచేయుచు, ఆయన పరమేశ్వరలీలలను సందర్శించి యానందించిరి. కాని నాయనా! త్యాగమే గురుదేవుని జీవితమునకు ప్రధానలక్షణ మని నాకుఁ దోఁచుచున్నది. అంతటి సహజమైన త్యాగము లోకమున మఱెవ్వరియందైనను గానిపించునా?"

లేదు: శ్రీరామకృష్ణుని యర్ధాంగియందుమాత్రము అట్టి త్యాగము లోకమునకు మఱల ప్రకాశించెను!

సంసారవ్యామోహామునుగూర్చి మాతృదేవి యొక ప్పుడు తనసోదరునికుమార్తెను మందలింప నామె యిట్లధిక్షే పించెను: "కాఁపురము చేసితివన్నమాటయేకాని, అమ్మా! మగనితో సంసారసుఖమును నీ వేమనుభవించితివి? మగని విలువను నీ వెఱుఁగవైతివి!" మాతృదేవి వెంటనే సగర్వ ముగా నిట్లు సమాధానించెను: "ఔను! నా భర్త దిగం బరుఁడగు యతీంద్రుఁడు,—పరమహంస!"

శ్రీశారదా శ్రీరామకృష్ణుల దాంపత్యజీవనౌన్నత్యము పైనిచెల్పిన యామెసమాధానముననే దేదీప్యమానమై ప్రకాశించుచున్నది. మాతృదేవి మహోత్సాహముతో, పరమానందముతో, శ్రీరామకృష్ణు నహర్నిశము సేవించె

నన్న చో, పరమాదర్శప్రేమయే కాని యింద్రియసుఖాసక్తి కలనైనను ఆమెకు లేకుండుటయేకదా కారణము? మఱియు శ్రీరామకృష్ణుఁ డామె నంతగా ప్రేమించి గారవించుటకును కామకాంచనత్యాగ విలసితమగు నామెవినిర్మలజీవన విధానమే కారణము. గ్రామ్యసుఖాపేక్ష లేశమును లేకున్నను, దంపతులు అన్యోన్యానురాగబద్ధులై యానందమయులై విలసిల్లఁగలరనుట కీ దివ్యదంపతుల చరిత్రమే ప్రబల నిదర్శనము. ఇదియే లోకము ఈ పుణ్యదంపతుల జీవితమును గని నేర్వవలయు మహోత్తమతత్త్వము. సతీపతులు దివ్యాశయములను తమహృదయసింహాసనమున నెలకొల్పి జ్ఞానతేజమున వాని నుపాసించుచో, కామాంధకారము పటాపంచలుకాదా? ఈ మహత్తరసత్యమునే తులసీదాసకవి యిట్లుద్ఘోషించియున్నాఁడు:

"జహా రామ తహా కామ నహీ, జహా కామ తహా నహీ రామ;
దో నో ఏక సాథ మిలత నహీ రవి రజనీ ఏకఠామ."

(రాముఁడేలు హృదయమున కాముఁడును కాముఁడేలు హృదయమున రాముఁడు నుండఁజాలరు. సూర్యతేజమును చీకటియు నొక్కచో నుండఁజాలవుకదా!)

సన్న్యాసజీవనముతోఁ బోల్చి కామవినిర్ముక్తమగు గృహస్థజీవనమందలి దివ్యానందమును గొనియాడుచు మాతృదేవి తనయాప్తులలో నొకరి కొకప్పు డొనర్చిన మహోపదేశము గమనింపఁదగియున్నది: ఆమె యిట్లు పల్కెను: (తనసన్న్యాసిపుత్త్రుల నుద్దేశించుచు) "వీరంద

అను అమృతపుత్రులు. వాసనచూడని దివ్యకుసుమముల చందమున అకలంకులై లోకమున వీరు మనఁగలరు. ఇంత కంటె మనోహరమగున దేమి? (ఆప్తురాలి నుద్దేశించుచు) ఐహికజీవనమున నేపాటి సుఖము లభింపఁగలదో నీయంత నీవే చూచుచుంటివికదా! ఇన్ని దినములుగా నావలన నీవు నేర్చిన దేమి? ఎందుకు అమ్మా! సంసారమునం దింత వ్యామోహము? ఎందుకు పశుస్వభావమున నింత ముచ్చట? ఏమి సుఖము నిందు జుఱ్ఱుకొనుచున్నావు? పవిత్రజీవనము — కామకళంకము లేని జీవనము—ఎట్టిదో కలనైనను తలఁపఁజాలవా? ఇఁకనైనను * భర్తతో నీవు సోదరీసోదరులవలె జీవింపరాదా? తుచ్ఛపశుజీవనమున ఎందుకు నీకు ఈ వాంఛ? ప్రపంచమందలి యీ ఘోరదుఃఖము హృదయశల్యమై నన్ను బాధించుచున్నది!"

పాఠకులారా! మాతృదేవి దాంపత్యజీవనదివ్యాదర్శమును పరికింపుఁడు.

---

* "ఒకరిద్దఱు బిడ్డలను గనినపిమ్మట సోదరీ సోదరులవలె జీవింపుఁ" డని శ్రీరామకృష్ణుఁడు నిత్యే గృహస్థుల కుపదేశించువాఁడు

# తొమ్మిదవ ప్రకరణము

## వివిధానుభవములు

జీవితమందలి సుఖదుఃఖానుభవములే మానవునకు అనేక గుణపాఠములను గఱపుచుండును. ఐనను శ్రేయోదాయకమగురీతిని మెలఁకువతో వానిని గ్రహించుటకై మహాత్ముల చరిత్రలు—అందు వారియనుభవములు—ఎల్లరకును మార్గదర్శకములై వెలయుచుండును.

దక్షిణేశ్వరమున మాతృదేవి గడపిన పదమూఁడు వత్సరములందును స్వజనమునకుఁ దోడ్పడుటకై యామె పుట్టినింటికి అనేక పర్యాయములు వెడలవలసివచ్చెను. అందలి ముఖ్యసంఘటనములను ఈ ప్రకరణమున ముచ్చటింతుము.

దక్షిణేశ్వరమున గురుదేవునితో నామె తొలిసారి సంవత్సరము నాలుమాసములు గడపి, 1873–వ సంవత్సరము తుదిభాగమున జయరాంబాటికి వెడలెను. కొలఁది నెలలైన పిమ్మట మాతృదేవితండ్రి రామచంద్రుఁడు పరమపదించెను. పుత్రులు నలువురును పసివారలైయుండ, కుటుంబభారమంతయు తల్లి శ్యామసుందరీదేవియే వహింపవలసివచ్చెను. పొలమువలన వచ్చు నాదాయము పేరునకుమాత్రమే యగుటయు కుటుంబపోషణమునకై యామె పొరుగునందలి వంద్యోపాధ్యాయ కుటుంబమువారికి వడ్లు దంపవలసివచ్చెను. ఈ కష్టకాలమున మాతృదేవి తల్లికిఁ దోడునీడయై సల్పిన సేవలు నిరుపమానములు. గృహకృత్యములలోఁ బాల్గొను

టటుండ, వడ్లు దంపెడు విశేషకాయక్లేశకరమగుపనిని మాతృదేవియే చాలవఱకు నిర్వహించి తల్లికి విశ్రాంతి గల్పింపసాగెను.

మాతృదేవిసోదరులలోఁ బెద్దయగు ప్రసన్నకుమారుఁడు కలకత్తాలో అర్చకుఁడై కొంత సంపాదించుచుండ, క్రమముగా కుటుంబపరిస్థితులు బాగుపడసాగెను. ఆ సంవత్సరము శ్యామసుందరీదేవి కొంతవైభవముతో జగద్ధాత్రీపూజ నొనర్చెను. మఱుసటి సంవత్సరముగూడ నామె పూజను సంకల్పించి మాతృదేవిసాయమును గోర నామె యిట్లు పల్కెను: "అమ్మా! ఒకసారి పూజ జరిపియుంటిమిగదా? ప్రతి సంవత్సరము జరుపవలయునని నియమమా? మఱియు జగద్ధాత్రీపూజ తగినంతధనముతోడను విశేషపరిశ్రమతోడను గూడుకొనియున్నదను సంగతి నీకుఁ దెలియనిది కాదు."

నాఁటిరాత్రి మాతృదేవి యొక దివ్యస్వప్నము గనెను. దానినిగూర్చి కాలాంతరమున నామె యిట్లు తెలిపియున్నది: "కలలో నాఁటిరాత్రి నాకు జగద్ధాత్రియు జయావిజయలును (ఆమె యనుచరురాండ్రగు దేవతలు) సాక్షాత్కరించిరి...వారు నన్ను, 'మే మిఁక వెళ్లిపోవలసినదేనా?' యని యడిగిరి. నేను 'మీరందఱును ఎవరు?' అంటిని. వారిలో నొకదివ్యమూర్తి, 'నేను జగద్ధాత్రి'నని పల్కెను. అంత నే నిట్లంటిని: 'వద్దు, మీరు ఎందుకు వెళ్లవలయును? ఇక్కడనే యుండుఁడు. మీరు వెళ్లిపోవలయునని నేను జెప్పలేదు.'"

అంతటినుండియు జగద్ధాత్రీపూజ మాతృదేవిపుట్టినింటియాచారమై యొప్ప, నామె ప్రతిసంవత్సరము మహో

త్సాహముతో నందుఁ బాల్గొనసాగెను. ఇవ్విషయమై యామెయే యొకప్పు డిట్లు తెల్పెను: "అప్పటినుండియు సాధ్యమైనంతవఱకు ప్రతిసంవత్సరము జగద్ధాత్రీపూజాసమయమున పుట్టినింటికి వెళ్లుచున్నాను. పాత్రములను తోముటయు ఇతరకార్యములందుఁ దోడ్పడుటయు నా పని...కాలక్రమమున యోగేన్ (యోగానందస్వామి) కల్బపాత్రములను సమకూర్చి, 'అమ్మా! మీరిఁక దాకలను మూఁకుళ్లను తోమనక్కఱలేదు' అనెను. పూజకగు వ్యయమునకై యాతఁడు కొంతభూమినిగూడ సంపాదించెను."*

మాతృదేవి 1874-వ సంవత్సరమున జయరాంబాటి నుండి మఱల దక్షిణేశ్వరమునకు వెళ్లెను. కొలఁదినెలలైన పిమ్మట నామె తీవ్రమగు గ్రహణిచే బాధపడసాగెను. శంభుమల్లికుఁడను భక్తుఁడు విశేషశ్రద్ధతో నొనర్చిన వైద్యసాహాయ్యమున నామె తేఱుకొని (1875-వ సంవత్సరమున) మఱల జయరాంబాటికి వెళ్లెను. కాని విధివశమున గ్రహణి మఱల సంభవించెను. తల్లియు సోదరులును ఎంతటి సేవలొనర్చినను నివారణోపాయము గాన్పింపదయ్యె. ఆమె ప్రాణాపాయస్థితినిగూర్చి విని దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణుఁడు సైతము ఆందోళనమునొంది దుర్భర విచారమున హృదయునితో నిట్లు పల్కెను: "హృదయా! మరణించుట

* శ్రీరామకృష్ణమఠ నిర్వహణమున జగద్ధాత్రీపూజ నేఁటికిని జయరాంబాటిలో ప్రతిసంవత్సరము సాగుచున్నది. మాతృదేవి యందులకై తనవృద్ధదశలోఁ గొనియుండిన మూఁడెకరముల భూవసతినుండి యామె వంశీయులు పూజార్థమై నియమితపరిమితిగల ధాన్యము నొసఁగుచుందురు.

కేనా, ఆమె జన్మించినది? జీవితపరమార్థము నొంద నామె నోచుకొనలేదా?''

ఈ విపత్సమయమున మాతృదేవి వెలువరించిన భగవద్విశ్వాసము ఆశ్చర్యకరము. ఆమె పుట్టినింటి పొరుగున సింహవాహినిదేవి యాలయ ముండుటయు వ్యాధి నివారణకై యా చల్లనితల్లి యుపాయము నేమియుఁ దెలుప నిచో, ఆలయమునకు వెళ్లి ప్రాయోపవేశము నొనర్చుటకై మాతృదేవి సంకల్పించెను. ఆమె శరీరస్థితి దుర్భరమై యుండెను. గ్రహణివలన శరీరమంతయు నుబ్బెను. కన్నులనుండియు నాసికనుండియు నీరు సంతతధారగాఁ గారుచుండెను. దృష్టి నీరసింప, పండువెన్నెలసైత మా సమయమునఁ దనకు చీకటియై తోఁచెనని యామెయే తెలిపి యున్నది. ఈ స్థితిలోఁ దల్లికిని సోదరులకును దెలియకుండ నామెయొక చెలికత్తెసాయమును గొని ఆలయమునకు వెడలి దేవతామూర్తికి సంపూర్ణాత్మార్పణము గావించుకొని ప్రణమిల్లెను. తనయనుంగుబిడ్డ తనయెదుట ప్రాయోపవేశ మొనర్చుచుండ, ఆ చల్లనితల్లి చూచి యెట్లు సహింపఁ గలుగును? అచిరకాలముననే గ్రహణినివారణమునకై యొక మందును తనతల్లికిని, కంటిజబ్బును దొలఁగించు మఱియొక మందును దనకును సింహవాహినీమాత తెలిపెనని మాతృదేవియే పలికియున్నది.* వెంటనే యామె యీ దివ్యౌషధ

* కంటిజబ్బుకై తెలుపఁబడినమందునుగూర్చి మాతృదేవి యిట్లు పలికెను: ''గుమ్మడిపూవురసమును ఉప్పుతోఁ గలిపి చుక్కచుక్కగా కంటిలోఁ బోసికొనుమని సింహవాహినీమాత తెలిపినది.''

ములను సేవింపసాగెను. ఆశ్చర్యము, ఆ దినముననే యామె దృష్టి వినిర్మలమై యొప్ప, కొలఁదికాలముననే ఇతర బాధలును తొలఁగెను. *

ఐనను మఱుసటి సంవత్సరము మాతృదేవి మఱల వ్యాధిగ్రస్తురా లయ్యెను. గుల్మముచే నామె బాధనొందుచుండ, తల్లి యామెను సమీపగ్రామమందలి యొక వైద్యబ్రువునియొద్దకుఁ దీసికొని వెళ్లెను. ఆ ధన్వంతరిచికిత్సావిధానము అతిభయంకరము. గుల్మము గల తావున నొక విధమైన పచ్చియాకును వైచి, యాతఁడు కొఱవితో చుఱకలు వెట్టును. కాని యాతఁడు తన వైద్యవ్యవహారమును పరమార్థముతో మేళవించి తన గుల్మచికిత్సను ఒకశివాలయావరణమున జరుపును. మాతృదేవి యీతని చికిత్సవలన నెంతవఱకు మేలందెనో మనకుఁ దెలియదు, కాని చుఱకలను మాత్రము పరమశాంతముగా నోర్చుకొనెను. ఏలన, ఆతని చికిత్సకుగుఱియైన రోగులయవయవములను ఎవ్వరో యొకరు అదిమి పట్టుకొనవలసియుండ, మాతృదేవికిమాత్రము అట్టి యక్కఱ యేమియుఁ గలుగలేదు. స్వాభావికముగనే కాలక్రమమున నామె స్వస్థురాలయ్యెను.

మాతృదేవి సహనశీలమును దెలుపు మఱియొకసంఘటనము. 1881-వ సంవత్సరమున నామె జయరాంబాటి నుండి దక్షిణేశ్వరమునకు వెడల (శ్రీరామకృష్ణునకు సన్నిహితుఁడగు) హృదయుఁడు ఆమెయెడ పరమనిరసనబుద్ధి

* నాఁటినుండియు జయరాంబాటియందలి సింహవాహినీమాత ప్రత్యక్షదైవముగా పరిగణింపఁబడుచున్నది.

తోడను అమర్యాదతోడను ప్రవర్తించెను. తానొక ఋషి ననియు మహాత్ముఁడననియు విఱ్ఱవీఁగుచు నాతఁడు శ్రీరామకృష్ణుని సైతము లెక్కసేయఁడయ్యె. లక్ష్మీనారాయణుఁడర్పింపఁబోయిన పదివేలరూపాయలను శ్రీరామకృష్ణుఁడు నిరాకరించెనని కాఁబోలు, నాతనిపైఁ గారాలుమిరియాలు నూఱుచు పరిపరివిధముల పీడింపసాగెను. కాని పరమహంస యాతని దుష్ప్రవర్తనమును పరమశాంతముగా సహించుచుండెను.

ఈ సమయమున మాతృదేవి యచటికి వెడలుట తటస్థింప, తనయెడ హృదయుని తిరస్కారమును గూర్చి* యామెయే యిట్లు తెలిపియున్నది: "...హృదయుఁడు మమ్ములను (అనఁగా మాతృదేవిని ఆమె తల్లిని మఱికొందఱను) జూచి యిట్లనెను: 'మీరిక్కడకు ఎందుకు వచ్చినారు? ఎవరిని ఉద్ధరించుటకు?' అతఁడు మాయెడ చాల అమర్యాదగా ప్రవర్తించెను....మా అమ్మ చాల నొచ్చుకొని యిట్లనెను: 'రండు, మఱలిపోవుదము. కాని నాకూఁతును ఎవనివద్ద దిగవిడుతును?' ఆయన (అనఁగా శ్రీరామకృష్ణుఁడు) అంతయు వినియుఁ జూచియుఁగూడ, హృదయునిఁ జూచి భయపడి చూచియుఁ జూడనట్లు ఊరకుండిరి, ఔనని కాని కాదనికాని చెప్పరైరి.† ఆ నాఁడే మేమందఱము

* మాతృదేవియు పరమహంసవలెనే లక్ష్మీనారాయణుని కానుకను స్వీకరింపలేదను హృదయునిదుగ్ధ యిందులకొక కారణమైయుండనోపును.

† శ్రీరామకృష్ణుని ప్రవర్తన మిచట నించుక దురూహమై యున్నది. హృదయున కిష్టములేనిదే అచట వారుండుటవలన అంతులేని

జయరాంబాటికి మఱలితిమి. వెళ్లునపుడు ఆలయమందలి కాళీమాత నుద్దేశించుచు, ఇట్లు విన్నవించుకొంటిని: 'తల్లీ! నీవు అనుగ్రహించిన, మఱల నేనిచటికి వత్తును.'...కొలఁది కాలముననే హృదయుఁడు కాళికాలయమునుండి తొలఁగింపఁబడెను...."

అచిరకాలముననే గురుదేవుఁడు తన్ను దక్షిణేశ్వరమునకు రమ్మని కోరుచు నిట్లు కబురంపెనని మాతృదేవి పలికియున్నది: "నే నిక్కడ బాధపడుచున్నాను. రామలాల్ (శ్రీరామకృష్ణునియన్నకుమారుఁడు) కాళికాలయమున పూజారియైనప్పటినుండియు ఆలయమందలి యితరపూజారులతో ఏకమై నన్నంతగా గమనించుటలేదు. దయయుంచి నీవు రావలయును. సవారిగాని, పాలకిగాని, మఱియేయితర వాహనముగాని కుదుర్చుకొనుము. పదిగాదు, ఇరువదిగాదు, —ఎన్నిరూపాయలైనను నేను భరింతును.' తుదకు మఱల నేను దక్షిణేశ్వరమునకు (ఫిబ్రవరి, 1882–న) వచ్చినాను."

మాతృదేవి జయరాంబాటినుండి దక్షిణేశ్వరమునకు సల్పిన యాత్రలలో ముఖ్యముగా నామెధైర్యస్థైర్యములను

---

కలహములు సంభవించుననియో, దక్షిణేశ్వరమున హృదయునిదినములు దగ్గఱపడుచున్నవని దివ్యదృష్టిచే గ్రహించియో (నిజముగా అచిరకాలముననే యాతఁడు పనినుండి తొలఁగింపఁబడెను) గురుదేవుఁ డూరకుండెను.

* 'శారదాదేవి నెన్నఁడును నిందింపఁబోకుము, ఆమెకు కోపము వచ్చినచో, హరిబ్రహ్మాదులు నిన్ను రక్షింపఁజాల' రని గురుదేవుఁడు హృదయునకు ఇంతకుమునుపు చేసిన హెచ్చరిక నిచట స్మరింపనగును.

సమయస్ఫూర్తిని ప్రకటించు నొకానొక యాత్రనుగూర్చి ముచ్చటింపవలసియున్నది. పాదచారిణియై యామె కొందఱు బంధుగులతోడను ఇతరులతోడను గలిసి పయనించు చుండెను. దారిలోఁ బదిమైళ్ళ పర్యంతము వ్యాపించియుండిన తెలొభెలొ, కైకల యను నరణ్యప్రదేశములను బంగన బయళ్లను దాఁటి వారు తారకేశ్వరముమీఁదుగా గంగానదిని దాఁటవలసియుండిరి. పైని దెల్పిన యరణ్యప్రదేశము లా కాలమున బందెపోటుదొంగలకు నిలయమై మఱింత భయంకరమై యుండెడివి. వీనికిఁదోడు మహాభీకరమగు కాళీ విగ్రహ మొకటి యా వనమధ్యమున నేఁటికిని గాన్పించు చుండును; దొంగ లా దేవతకు నరబలు లర్పించువారు. రాత్రి కాకముందే యీ యరణ్యములను దాఁటి, తారకేశ్వరమును జేరుటకై యాత్రికులందఱును వేగముగా నడువసాగిరి. కాని మాతృదేవి యలసి వెనుకఁబడియుండెను. తోడివారు దొంగలవలని ఘోరాపాయమును దలఁచి మాతృదేవిని త్వరితముగా రమ్మని హెచ్చరింపసాగిరి. ఒరులు తన నిమిత్తము అపాయమునకు గుఱియగుట సహింపఁజాలని మాతృదేవి వారితో, తనకోసము ఆఁగక, ప్రయాణము సాగింపుఁడనియు తాను వారిని తారకేశ్వరమునఁ గలిసికొందుననియుఁ జెప్పెను.

మాతృదేవి విశేషము డస్సియుండుటచే నెంతవడిగా నడవఁ బ్రయత్నించినను రాత్రి యగుసరికి అరణ్యమధ్యమును దాఁటి పోఁజాలదయ్యె. ఏమి చేయుటకును ఆమెకుఁ దోఁప కుండెను. ఇంతలో చీకటి రూపొందెనా యనిపించు మేని చాయగలవాఁడును, పొడగరియునగు మానిసి యొకఁడు భుజ

మునఁ బెద్దకఱ్ఱ వైచుకొని తన కెదురుగా వచ్చుచున్నట్లు లామె కనుఁగొనెను. వానివెనుక మఱెవ్వరో వచ్చుచుండిరి. ఇంతలో నాతఁడామెనుసమీపించి, "ఈచీకటిలోఎవరక్కడ తారుచున్నది?" అని కర్ణకఠోరముగాఁ గేకవైచెను.

ఆ కేకవిని మాతృదేవి భయకంపితయయ్యె, వెను వెంటనే ధైర్యమవలంబించి యెంతటి కఠినాత్మునకైనను మనసు కరఁగు నెలుఁగున నిట్లు పలికెను: 'నాయనా! నాతోడి వారందఱును నన్నిక్కడ దిగవిడిచి వెళ్లినారు. ఈ చీకటిలో నాకుఁ ద్రోవ తెలియకున్నది. దయయుంచి నాతోడివారినిఁ గలిసికొనుటకు నాకు సాయముచేయుము. నీ 'యల్లుఁడు' దక్షిణేశ్వరమున (రాసమణి) కాళికాలయమున నున్నాఁడు. ఆతనిఁ గలిసికొనుటకు నేను వెళ్లుచున్నాను. నీ వంతవఱకు నాతో వచ్చినపక్షమున, ఆతఁ డెంతో సంతసించును."

ఇంతలో రెండవ వ్యక్తి తన్ను సమీపింప నామె యాతనిభార్యయని మాతృదేవి తెలిసికొనెను. 'ఆ తల్లి తనకు సాయముచేయకుండునా?' ఆమె చేతినిఁ బట్టుకొని మాతృదేవి యిట్లు పలికెను: "అమ్మా! నేను నీ కూఁతును, శారదను, చాల చిక్కులో నున్నాను. అదృష్టవశమున నాయనయు నీవును ఇచటికి వచ్చినారు. లేనిపక్షమున నేమి చేసియుండెడిదాననో తెలియదు."

మాతృదేవి మెల్లనిపలుకులు, మాయయు మర్మము నెఱుఁగని యామెసరళవర్తనము, నిర్భయత్వము, తమయం దామె పరిపూర్ణవిశ్వాసము—ఇవన్నియు ఆ యాలుమగల మనసు కరఁగించి ప్రేమపూరితముచేసెను. నిండువాత్సల్య

ముతో వారు తమ కూఁతునువలెనే ఆమె నోదార్పసాగిరి. మిగుల బడలియుండుటచే, ఆరాత్రి వారామె ముందునకుఁ బోవ సమ్మతింపక, తెలోభెలో గ్రామమందలి యొకచిన్న యంగడికిఁ దీసికొని వెడలి కొన్ని భక్ష్యములను గొనియిచ్చిరి. ఆ స్త్రీ మాతృదేవికిఁ దన బట్టలతోడనే పానుపు నమర్చి తన బిడ్డనువలె రేయంతయుఁ గాపాడెను.

మఱునాఁడు ఉదయము వారు మాతృదేవిని తారకేశ్వరమునకుఁ దీసికొని వెడలి యొకయంగడియొద్ద భోజనవసతుల నేర్పఱచిరి. అంతకుముందుగనే తారకేశ్వరము వచ్చియుండిన యనుచరు లామె నిటఁ గలిసికొనిరి. తన 'నూతన మాతాపితలను' మాతృదేవి వారికి పరిచితుల నొనర్చి, తనకు వారెంతసాయపడిరో కృతజ్ఞతతో వివరించెను. పిమ్మట నచటి యాలయమున తారకేశ్వరుని పూజించి, కొంత యాహారమును భుజించి, తన 'క్రొత్తతలిదండ్రుల' యొద్ద నామె కన్నీరు విడుచుచు సెలవుగైకొని, తోడివారల ననుగమించెను.

ఈ సంఘటనమును గూర్చియే కాలాంతరమున మాతృదేవి యిట్లు వచించుచుండెడిది: ''ఒక్కరాత్రిలో వారును నేనును పరమాప్తులమైతిమి, వారి నెడఁబాయునపుడు నేను విలపించినాను. ఫీలైనపుడెల్ల దక్షిణేశ్వరము వచ్చి నన్నుఁ గలిసికొనుఁడని పదేపదే వారిని కోరినాను. చాలదూరము వారు నన్ను అనుసరించిరి. ఆ స్త్రీ సమీపమందలి పొలములలోని పచ్చిబటాణీలను గొన్నిటిని గోసికొని వచ్చి నా కొంగున మూటగట్టుచు, కన్నీరొలుక నిట్లుపలికెను: 'అమ్మాయీ, శారదా! రాత్రి నీవు అటుకులు తినునప్పుడు

ఈ బటాణీలతోఁ గలిపి తిను.' దక్షిణేశ్వరమునకు వారు అనంతరము మిఠాయిలను గైకొని వచ్చియుండిరి. జరిగిన వృత్తాంతమంతయు నావలన విని ఠాకూరు (శ్రీరామకృష్ణుఁడు) అల్లునివలెనే వారియెడ అవ్యాజమైన యాదరముతో వర్తించిరి. ఆ యాలుమగ లిపుడు యోగ్యులై యున్నను, నా 'దొంగనాయన' అనేకమైన దారులను గొట్టి యుండవలయు ననియే నా యభిప్రాయము.

దారులను గొట్టు దుర్మార్గులు సత్సాంగత్యము కతన సాధుపుంగవులు కాఁజాలిరే! తొల్లి వాల్మీకి నారదుని సాంగత్యమువలన ఋషీశ్వరుఁడు కాలేదా? ఏమి సత్సాంగత్యప్రభావము!!

''సత్యసూక్తి ఘటించు ధీజడిమ మాన్చు
గౌరవ మొసంగు జనులకుఁ గలుష మడఁచుఁ
గీర్తిఁ బ్రకటించుఁ జిత్తవిస్ఫూర్తిఁ జేయు
సాధుసంగంబు సకలార్థ సాధనంబు.''

## పదియవ ప్రకరణము

## శ్రీరామకృష్ణనిర్యాణము : తదనంతరము

దక్షిణేశ్వరదివ్యానందదినములు మాతృదేవి కిఁక స్మరణీయ మగు సమయ మాసన్నమైనది. శ్రీరామకృష్ణునకు కంఠములో ప్రబలమగు వ్రణము బయలుదేఱ, చికిత్సకై (1885–వ సం॥ న) శిష్యులాతని శ్యామపుష్కరము (Syam-pukur) నకుఁ దీసికొనివెళ్లిరి. మాతృదేవి కొలఁదిదినములు దక్షిణేశ్వరముననే యుండెను. ఈ సమయముననే తన కొక బాలిక తోడ్పడ నామె బాగుగాఁ జదువుట నేర్చెను.

కలకత్తాయందలి శ్యామపుష్కరమున శిష్యు లొక యింటి నద్దెకుఁ దీసికొని శ్రద్ధాభక్తులతో శ్రీరామకృష్ణు నకు సేవచేయసాగిరి. అచట తననివాసమున కిసుమంతయు సదుపాయము లేకున్నను, మాతృదేవి వెడలి పథ్యపానీయా దులను సమకూర్చుచు, తదేకదీక్షతో అహర్నిశము గురు దేవుని సేవింపసాగెను.

శ్యామపుష్కరమున గురుదేవుఁడు మూఁడునెలలు గడపెను. అందలి నివాసమెంతయు అననుకూలముగా నుండినకతన శిష్యబృంద మాతనిబసను సమీపముననున్న కాశీపురమందలి యొక యుద్యానభవనమునకు మార్చెను. ఆరోగ్యప్రదమగు నుద్యానభవనమున నివసించుచున్నను, సుప్రసిద్ధులగు వైద్యులెంతటి నైపుణ్యముతో చికిత్సనొనర్చు చున్నను, శిష్యబృందమును మాతృదేవియు నెంతటి శ్రద్ధా

భక్తులతో సేవించుచున్నను శ్రీరామకృష్ణునివ్యాధి నానాఁటికి ప్రబలమగుచుండెను. విధి నెవ్వరు దప్పింపఁగలరు?

ముముక్షుకోటికి మార్గదర్శకమై దివ్యానందసంధాయకమగు జీవితేశ్వరుని జీవనదీపము మినుకుమినుకుమనుచుండ, దుర్భరపరితాపమున మాతృదేవి దైవసాహాయ్యము నర్థింప సమకట్టెను. తారకేశ్వరమునందలి శివాలయమునకు వెడలి యామె గురుదేవుని వ్యాధినివారణమునకై దివ్యోపాయమును వేఁడుచు, ఆ దేవదేవునకు ప్రణమిల్లెను. అన్నపానీయములను విసర్జించి యామె యట్లు రెండు దినములు ప్రార్థించెను. మాతృదేవి దివ్యానుభవమునుగూర్చి యామె మాటలనే యుదాహరించు టుచితము: "రెండవనాఁటి రాత్రి నాకొక పెద్దధ్వని—ఎవ్వరో ఒక్క పెట్టున కుండలదొంతరను పగులఁగొట్టినట్లు—వినిపించినది. నా భ్రాంతితిమిరము తొలఁగినది. నా యంతరంగమున నిట్లు భాసించినది: 'భర్త యెవరు? భార్య యెవ్వరు? ఈ లోకమున ఎవ్వరు నా బంధువు? నే నెందులకు ఆత్మహత్య తలపెట్టినాను?—ఠాకూరు (శ్రీరామకృష్ణు) నందలి నా మమకారము అదృశ్యమైనది. అఖండ వైరాగ్యము కలిగినది. చీకటిలోఁ దడవుకొనుచు వెళ్లి (ఆలయము వెనుకతట్టుననుండు) కుండమునందలి తీర్థము మోమునఁ జల్లుకొంటిని....మఱునాఁడుదయము కాశీపుర వనమునకు వచ్చినంతనే ఠాకూరు నన్నుఁ జూచియిట్లనిరి: 'సరి, నీ కేమైనను లభించినదా? అంతా మిథ్య—ఇంతేకాదా?' "

ఇవ్విషయమై మాతృదేవి మఱియు నిట్లు పలికెను: "ఆ సమయముననే ఒకయేనుఁగు తమకై మందు తీసికొని

వచ్చుటకు వెళ్లినట్లును అందునిమిత్తము నేలను త్రవ్వుచున్న ట్లును ఆయన కలగని మేల్కాంచిరి. 'నీ కేమైనను ఇట్టి కల వచ్చినదా?' యని తరువాత న న్నడిగిరి. ఆలయమందలి కాళీమాత మెడ ఒకవైపునకు ఒరగియున్నట్లు నేను గల గంటిని. ఆ సమయమున నేను, 'తల్లీ! ఇట్లుంటి వేమి?' యని యడుగ నామె యిట్లు సమాధానము చెప్పినది : '(గురు దేవునికంఠమునందలి వ్రణమును జూపుచు) అందువలన— నాకును అది కంఠములో ఉన్నది.'''

ఇట్టి యనుభవము లామెమానసమును విధినిర్ణయ మునకు ఆయిత మొనర్చియుండవలయును.

మాతృదేవికిని శిష్యకోటికిని మాత్రమే కాక, లోక మున కంతకును తీరని లోపము కలుగ నెల్లరను దుఃఖసాగర మున ముంచి, వ్యయనామ సం॥ భాద్రపద బహుళద్వితీయా సోమవారము రాత్రి యించుమించుగా ఒంటిగంటకు (1886–వ సం॥ ఆగస్టు 16–వ తేదీని) శ్రీరామకృష్ణుండు అఖండసచ్చిదానందమయ పరబ్రహ్మైక్యము నొందెను. చందనకర్పూరాదికములతో నాతనిశరీరము దహనసంస్కా రము నందెను. అనంతరము మాతృదేవి యాచారము నను సరించి తన యాభరణములను దీసివేయఁబోయెను. శ్రీరామ కృష్ణుండు మరణించెననియేనా, ఆమెభావము? ఎవ్వని పవిత్ర నామము, ఎవ్వని పవిత్ర జీవితము, ఎవ్వని పవిత్ర మూర్తి మత్త్వము మహోత్తమతారకమంత్రమై, ముముక్షుజన మార్గదర్శకమై, విశ్వకల్యాణహేతుభూతమై యలరారు చున్నవో, ఎవ్వఁడు అవతారమూర్తియో—అట్టి శ్రీరామ

కృష్ణుఁడు తన భౌతిక శరీరమును జాలించినంతమాత్రమునఁ జనిపోయెనని భావింపఁజెల్లునా? మాతృదేవి తనమురుగులను దీసివేయఁ బోవుచుండ, శ్రీరామకృష్ణుఁడు సాక్షాత్కరించి యిట్లు పల్కెనని యామెయే తెలిపియున్నది: "ఏమి చేయుచున్నావు? నేను జనిపోలేదుసుమీ. ఒకగదినుండి మఱియొక గదికి వెళ్లినాను. అంతే." * మాతృదేవి కీదివ్యానుభవము ఉపశాంతికరమై ధైర్యమును జేకూర్చెను. ఇతరాభరణములను దీసివైచినను ఎప్పటివలెనే యామె మురుగులను, † నాఁటినుండియు సన్నని యెఱ్ఱంచులచీరను దాల్పసాగెను.

కొన్నిదినములైనవెనుక శిష్యబృందము మాతృదేవిని కాశీపురవనగృహమునుండి బలరామబోసు (వసువు) అనుభక్తునింటికిఁ దోడ్కొనివెడలి యచట బస నేర్పఱచెను. గురుదేవునస్థులనుగూర్చి యీ సమయమున సన్న్యాసిశిష్యబృందమునకును గృహస్థశిష్యులకును నడుమ తీవ్రవివాదములు చెలరేఁగసాగెను. నరేంద్రుని (అనంతర మీతఁడే శ్రీ వివేకానందస్వామి) నాయకత్వమున సన్న్యాసిశిష్యులెట్టకేలకు అస్థులలోఁ గొన్నిటిని గృహస్థశిష్యుల కొసఁగ నంగీకరించిరి. ఈ వివాదమునుగూర్చి మాతృదేవి గోలాప్ మాయితో నిట్లు పలికెను: "అంతటి మహనీయమూర్తి గతించెను. కాని చూచితివా, అమ్మా, ఆతనియస్థులను గూర్చి వారెట్లు కాట్లాడుచున్నారో!"

* శ్రీరామకృష్ణునిఁగూర్చి యిట్టిదివ్యానుభవము లనేకము లామె వడసినట్లు ఇటుపైఁ గాననగును.

† దక్షిణదేశమున పుణ్యస్త్రీలకు మంగళసూత్ర మెట్టిదో, ఉత్తరదేశమున మురుగులును అంచులచీరయు నట్టివి.

పదునొకండవ ప్రకరణము

## బృందావనయాత్ర

"బ్రహ్మసాక్షాత్కారమును గోరి యసంఖ్యాకులైన జనులు చిరకాలము జపతపములను ధ్యానమును ప్రార్థనలను పూజలను సలిపిన పుణ్యస్థలములందు...పారమార్థిక భావములు ఘనీభూతములై యుండునని చెప్పనొప్పును: ఇట్టి పుణ్యతీర్థములందు మానవుఁడు సులభముగా ఆత్మ ప్రబోధము నొంది భగవంతునిఁ గనఁజాలును" అని శ్రీరామకృష్ణపరమహంస పలికియున్నాఁడు. తన శరీరమును జూపి యాతఁడు తన్నుద్దేశించుచు, "ఇది దర్శింప ననువు పడని పుణ్యస్థలముల నన్నిటిని నీవు దర్శింపుము" అని తన యంత్యదశలో నొకనాఁడు మాతృదేవితోఁ బలికియుండెను. శ్రీరామకృష్ణనిర్యాణానంతరము పదిపదునైదుదినములకు మాతృదేవి ఉత్తర హిందూస్థానమునకు యాత్రార్థమై బయలు వెడలెను.

యోగానందస్వామి (యోగేన్), అభేదానందస్వామి (కాళి), అద్భుతానందస్వామి (లాటు), భార్యాసమేతుఁడై మహేంద్రనాథగుప్త, లక్ష్మీదేవి, గోలాప్‌మాయి అనువారు తన్ననుగమింప, మాతృదేవి వ్యయనామ సం॥ భాద్రపద శుక్ల ప్రతిపత్ సోమవారమున (1886–వ సం॥ ఆగస్టు 30–వ తేదీని) కలకత్తానుండి పయనించెను. దారిలో వారు వైద్యనాథము, కాశి, అయోధ్యయునను పరమపుణ్యక్షేత్రములను దర్శించిరి. కాశిలో మాతృదేవి విశ్వనాథునారాత్రికమును

దర్శించునపుడు అపూర్వపారవశ్యము నొందెను. ఈసమయమున నామె కాశియందలి సుప్రసిద్ధపండితుఁడును యతివరేణ్యుఁడునగు భాస్కరానందస్వామినిఁ గలిసికొని యాతనిఁ గూర్చి యిట్లు పలికెను: "బృందావనమునకు వెడలుచు, దారిలో నేను కాశిలో భాస్కరానందునిఁ జూచినాను. నా మనోవ్యాకులత యప్పుడు చెప్పనలవిగాకుండెను. ఠాకూరు నిర్యాణమైన వెనువెంటనే ఈయాత్ర. భాస్కరానందుఁడు నేను జూచినప్పుడు పూర్తిగా దిగంబరుఁడు. కాని యాతని మనస్సున ఆవిషయమైన స్ఫురణయే లేదుగదా! నన్నును ఇతరస్త్రీలను జూడఁగనే ఆతఁడిట్లు పలికెను: 'తల్లులారా! కలవరపడకుఁడు. మీయందఱిలోను నాకు విశ్వేశ్వరియే కాన్పించుచున్నది. మీరు సిగ్గుపడనేల?' ఆహా! ఎంతటి మహనీయుఁడు! ఆతఁడు కేవలలోకాతీతుఁడు! ఎండలో, వానలో, ఒకేరీతిగా దిగంబరుఁడు!"

మాతృదేవి అయోధ్యను సందర్శించి, పిమ్మట వైష్ణవ సంప్రదాయానుసారము పుణ్యక్షేత్రరాజముగా పరిగణింపఁబడు బృందావనమున కేఁగెను. బృందావనమనినంతనే పారమార్థిక భావము లే భారతీయునిహృదయమునఁ బొంగి పొరలకుండును? శ్రీకృష్ణుని బాల్యలీలా సహస్రములచే పవిత్రీకృతమైన దీపుణ్యస్థలమేకదా! స్వార్థరహితము, అగాధము, అనంతమునగు మధురభావమున, రాధారూపమున, మానవహృదయము మాధవుని ప్రేమించిన దీపుణ్యస్థలముననేకదా! భగవానుని యనంతలీలలను కన్నులార, మనసార, గోపికలు సందర్శించి, తన్మయత నొంది, తరించిన దీపుణ్యస్థలముననే

కదా! బృందావనధూళిని గైకొని శ్రీరామకృష్ణ పరమహంస, దక్షిణేశ్వరమున, తనతపోవనమునఁ జల్లుకొనెను.

మాతృదేవి పారమార్థిక మనోభావములు బృందావన సందర్శనమున సహజముగా మహోద్వేగమును బొందెను. మఱియు పూర్వము రాధాదేవి యిచటనే శ్రీకృష్ణునిఁగూర్చి మహావిరహమును బొందెనను సంస్మరణ మామె ప్రస్తుతావస్థకు భాగవతవృత్తాంతముతోఁగల సాదృశ్యమును జ్ఞప్తికిఁ దెచ్చుటయు నామె శ్రీరామకృష్ణవియోగమున మఱింత పరితపింపసాగెను. ఎడఁదయందడఁగియుండిన దివ్యభావములన్నియు నొక్కుమ్మడి నుబికి తీవ్రభగవత్పరితాపమును గల్గింప, బృందావనమున నాదిమదినములలో నామె నేత్రయుగళమునుండి బాష్పములు సంతతధారగాఁ బ్రవహింపసాగెను. శ్రీరామకృష్ణనిర్యాణమునకుఁ గొలఁదిదినములకు పూర్వము అచటికి వచ్చియుండిన యోగేంద్రమోహినీమాయి మాతృదేవినిఁ గలిసికొనెను. తననెచ్చెలినిఁ గాంచి యామె దుస్సహపరితాపమున, 'ఓతల్లీ! యోగేన్!' అని పలికి, యామెను ఆలింగనమొనర్చుకొని పసిబిడ్డవలె విలపింపసాగెను. ప్రేమపరితాపములు ఒండొంటివెంబడిని వెలువడి క్రమమున దివ్యసంయోగము నొంది యపూర్వపరిణతి గలిగించు నీ దివ్యభావమున బహుదినములు గడచెను. తుదకు అద్భుతదివ్యదర్శనము లభించెను. శ్రీరామకృష్ణుఁ డామెకు ప్రత్యక్షమై యిట్లు పలికెను: "ఎందు కింతగా విలపించుచున్నావు? నేనిక్కడనేయున్నాను. ఎచటికిఁ బోతినని నీ యభిప్రాయము? ఒక గదినుండి మఱియొకగదికి—అంతే."

మాతృదేవి హృదయసంతాపమునకు ఈ దివ్యాను భవ మెంతయు నుపశాంతిదాయక మయ్యెను. శ్రీరామ కృష్ణసాన్నిధ్య మామెకు విశేషముగా ననుభూతము కాఁ జొచ్చెను. శాంత్యానందము లామెహృదయము నాక్రమిం చెను. దివ్యభావపారవశ్యమున నామె తఱచు యమునా సైకతశ్రేణులందు దవ్వులకేఁగి సంచరించుచుండ, సహచరు రాండ్రు ఆమెను వెదకి తోడ్కొని వచ్చువారు. ఆమె మృదులమనోభావములు వారలను వివశుల నొనర్చెడివి.

బృందావనమున మాతృదేవి ధ్యానముతోడను ప్రార్థనలతోడను ప్రొద్దులుపుచ్చుచుండెను. తానును యోగేం ద్రమోహినియు జప మొనర్చుచు, తన్మయతనొందియుండ, ఈఁగలు తమమోమున వాలి పుండ్లను జేయుచుండుట తమకుఁ దెలియకుండెడిదని కాలాంతరమున నామె పలికెను. అట నామె గడపిన యొకసంవత్సరమున నచటి దేవాలయ ములలోఁ బెక్కింటిని బహుపర్యాయములు సందర్శించెను. రాధారమణు నాలయమున బాష్పపూరితనేత్రయై కరములు మోడ్చి యామె యిట్లు ప్రార్థించెను : ''రాధారమణా! ఒరులదోసఁగులను గమనించు దుర్గుణమును నా హృదయము నుండి నిర్మూలింపుము. ఒరుల నెన్నఁడును నిందింపకుందును గాక!'' ఆమె ప్రార్థన యక్షరముల ఫలించెనని చెప్పనొప్పును. ఏలన, పరులదోసఁగుల నెన్నఁజాలకుండుట నాఁటినుండియు నామెశీలమునకు విలక్షణమై యొప్పెను. తనసన్నిధినున్న జనులం దది విపరీతమై కాన్పించిన సమయములం దామె తనప్రార్థనను దెలుపుచు నిట్లు పలికెడిది : ''మునుపు నేనును

ఒరులదోషములను గమనించుచుదానను. అపుడు పరమగురుని ప్రార్థించినాను. ఆ యలవాటు అంతట తొలఁగినది. ఒకరికి మీరు వేయివిధముల సాయముచేతురుగాక, ఒక్కయెగ్గు చేసినంతనే కోపమున వారు ఎడమొగమును పెడమొగమును బెట్టుదురు. దోసఁగులనే గమనించుట మానవస్వభావము. పరులగుణములను గ్రహించుట నేర్చుకోవలయును. ...నరులు సహజముగా భ్రమప్రమాదముల కగ్గమగుదురనుట నిజము. కాని సదా యితరులను నిందించుటవలన పరులదోషములే మనకుఁ గాన్పించుచుండును.'' యోగేంద్రమోహినితో నామె యొకప్పు డిట్లు వచించెను: ''యోగేన్, ఒరుల దోసఁగులను జూడకు, నీ కన్నులు పాపభూయిష్ఠములు కాఁగలవు.''

బృందావనమునుండి వెడలుటకుముందు, బాలకృష్ణలీలావిహారభూమియగు తత్ప్రదేశమునకును పరిసరప్రదేశములకును మాతృదేవి ప్రదక్షిణ మాచరించెను. కీళ్లనొప్పులచే బాధపడుచున్నను, ఆమె యీ ప్రదక్షిణ మవలీలగా సల్పఁగల్గెను. ఆ సమయమున నామె పొందిన పారవశ్యమును గాంచి యనుచరులు దివ్యోత్సాహపూరితులైరి.

బృందావననివాససమయమున మాతృదేవి యపూర్వదివ్యానుభవముల ననేకములను బడసినట్లు తెలియవచ్చుచున్నది. కాని యామెనిరాడంబరస్వభావము వానిని దఱచుగా నొరులకుఁ దెలియనీయకుండెడిది. యోగేంద్రమోహినీ మాయి యొకనాఁ డామె గంటలకొలఁది సమాధినిమగ్నురాలై యుండుట గాంచి, తుదకామెకు బాహ్యస్మృతి గలిగిం

చుటకై చెవిలో భగవన్నామము నుచ్చరింపసాగెను. కాని ప్రయోజనములేదయ్యె. అనంతరము యోగానందస్వామి వచ్చి ప్రయత్నింప నెట్టులో అసంపూర్ణమగు బహిఃప్రజ్ఞ నొందెను. శ్రీరామకృష్ణుఁ డట్టిసమయములందు వచించురీతి నామె యపుడు, "నాకేమైనఁ దినవలయునని యున్నది" అని పల్కెను. అపుడు కొన్ని భక్ష్యములను మంచినీటిని తాంబూలమును వా రామెకు సమర్పించిరి. శ్రీరామకృష్ణుని చందముననే యామె వానినిఁ గొలఁదికొలఁదిగ నారగించెను. తాంబూలపుఁజిలుకను సైతము కొనను ద్రుంచి గురుదేవుని రీతినే సేవించెను. ఈ దివ్యభావముననుండ యోగానందుఁ డామె ననేకప్రశ్నలువేయ నాతఁ డొందిన సమాధానములు గురుదేవుఁడే యొసఁగుచున్నట్లు తోఁచెను. బాహ్యస్మృతి నొందినవెనుక నామె గురుదేవునియొుక తనయంతరంగ మున నపుడు భాసించెనని భక్తబృందమునకుఁ దెలిపెను.

మాతృదేవి బృందావననివాసము మఱియొకకారణ మున చిరస్మరణీయము. లోకమున కామె యొసర్చిన జ్ఞాన దానమిచటనే ప్రారంభమయ్యెనని చెప్పనొప్పును.* ఇవ్విష యమున నామెవచనములనే యుదాహరించు టుచితము: "ఒకనాఁడు ఠాకూరు (శ్రీరామకృష్ణపరమహంస) ప్రత్యక్షమై

---

* శ్రీ రామకృష్ణుడు (తన జీవితకాలముననే) త్రిగుణాతీతుని మాతృదేవియొద్ద మంత్రోపదేశము నొందుమని నియమించియున్నను. అయ్యది సరిగా నెప్పుడు సంఘటిల్లెనో తెలియవచ్చుటలేదు. మాతృదేవి వచనములననుసరించి చూచినచో, బృందావనమున యోగానందస్వామి కామెయొసర్చిన మంత్రోపదేశమే మొట్టమొదటిదిగాఁ గాన్పించుచున్నది.

యోగేన్‌నకు (యోగానందస్వామికి) మంత్రోపదేశ మొన ర్చుమని పలికిరి. నేను గొంచెము జంకినాను—నిజముగా సిగ్గుపడినాను. నాలో నే నిట్లనుకొంటిని: 'ఇది యేమి? జను లేమనుకొందురు? అమ్మ అప్పుడే గురుపదవిని బూని శిష్యులను గూర్చుకొన నారంభించినదని చెప్పుకొనరా?' కాని వరుసగా మూఁడురాత్రులు ఠాకూరు కనఁబడి, 'యోగేన్‌నకు నే నుపదేశింపలేదు, నీ వుపదేశింపుము' అని చెప్పఁగా వింటిని. నే నేమంత్ర ముపదేశింపవలయునో కూడ ఆయన తెల్పిరి. అంతకుమునుపు యోగేన్‌తో నే నెప్పుడును మాటాడియుండలేదు. అందుచే యోగేన్‌కుమారి (యోగేంద్రమోహినీ మాయి) మూలమున నుపదేశింపుమని ఠాకూరు తెలిపిరి. నే నామెతో ఈ విషయము చెప్పినాను. ఆమె యోగేన్నడిగి ఠాకూరాతని కెట్టిమంత్రోపదేశమును జేసియుండలేదని గ్రహించినది. యోగేన్నకును ఠాకూరు ప్రత్యక్షమై నావలన నుపదేశమునొందుమని చెప్పియుండిరి. ఐనను ఈ విషయమునుగూర్చి నాతోఁ జెప్పుట కాతఁడు జంకెను. ఇరువురమును ఆయనయాజ్ఞను బొందుటచే నే నాతని కుపదేశించినాను."

మంత్రోపదేశము జరిగిన విధాన మిది: గురుదేవుని పటమును ఆతనియస్థులు గల సంపుటమును దనయెదుటనుండ, మాతృదేవి యపుడు తనగదిలో పూజ నొనర్పసాగెను. యోగానందస్వామినిఁ బిలిపించి తనసన్నిధినిఁ గూర్చుండనియమించెను. పూజ గావించుచు సమాధిస్థితిని బొందెను. ఆ దివ్యావస్థయందే మాతృదేవి యాతని కుపదేశించెను.

బృందావనమునుండి మాతృదేవి సహచరులతో హరిద్వారమున కేఁగెను. అచటి బ్రహ్మకుండమున నామె గురుదేవునియస్థులను గొన్నిటిని సమర్పించెను. అటనుండి జయపుర పుష్కరములమీఁదుగా కలకత్తాకు మఱలునపు డామె ప్రయాగలో నాఁగి, గురుదేవునిశిరోజములను త్రివేణీ సంగమమున సమర్పించెను. సహజమృదుమధురవచనముల నామె యీ వృత్తాంతమునుగూర్చి యిట్లు పలికెను: “త్రివేణీ సంగమమును సమీపించినాను. అచట గంగ ప్రశాంతముగా నుండెను. శిరోజముల నొకచేతఁ బట్టుకొని జలమున వానిని విడువఁదలఁచుచుండ, అకస్మాత్తుగా నొకయల ఉప్పొంగివచ్చి నా చేతినుండి శిరోజములను లాగికొనిపోయినది. ఈ పావన తీర్థము గురుదేవుని శిరోజములతో సంసర్గము నొంది మఱింత పావనమగుటకో యనునట్లు నా చేతినుండి స్వయముగా వానిని గ్రహించినది!”

## పంద్రెండవ ప్రకరణము

## కామారిపుష్కర జీవితము : తదనంతరము

ఎంతవారికైనను ఆపదలు కలుగక మానవు. ఐనను కరఁగించినచో, బంగారము మఱింత కాంతిమంతమై దీపించురీతిని కష్టకాలమున మహాత్ముల శీలము తేజోదీపితమై వెలయుచుండును. కామారిపుష్కరమున మాతృదేవిజీవితమే యిందులకు నిదర్శనము.

బృందావనమునుండి కలకత్తాకు వచ్చినపిమ్మట మాతృదేవి కామారిపుష్కరమున నివసించుటకై వెళ్లెను. భర్తృమరణానంతరము మాతృదేవి మురుగులను ఎఱ్ఱంచుల చీరలను ధరించుచుండెనని యూరిలోని యమ్మలక్కలు కొందఱు గుసగుసలాడనారంభించిరి. కాని బాల్యమున శ్రీరామకృష్ణునకు నెచ్చెలియగు ప్రసన్నమయి యను వృద్ధ వనిత యాకాకిమూఁకలను తనవాగ్బాణములకు గుఱిచేయుచు నిట్లు ప్రకటింపసాగెను: "గదాయి* భార్య ప్రత్యక్షదేవత. ఆమె సామాన్యస్త్రీయని తలఁపకుఁడు."

కాని మాతృదేవి యింతయేలయని మురుగులను దీసి వేయ, శ్రీరామకృష్ణుఁడు ప్రత్యక్షమై తన్ను వారించెనని తెలుపుచు నిట్లుపలికియున్నది: "లోకాపవాదమునకు వెఱచి మురుగులను దీసివేసినాను. నిజముగా లోకులిదివఱకే ఈ విషయమున గుసగుసలాడ నారంభించిరి. దానికితోఁడు

---

* శ్రీ రామకృష్ణుని చిన్ననాఁటి ముద్దుపేరు.

స్నానార్థము నాకు గంగకు వెళ్లవలెనని య డెను,—గంగా స్నానమనిన నాకు ప్రాణము. కామారిపుష్కరమునకు గంగా నది బహుదూరము. కాని యొకనాఁడు ఠాకూరు 'భూతి' కాలువతట్టునుండి యింటివైపునకు వచ్చుచుండుట చూచి నివ్వెఱపడినాను. నరేన్ (వివేకానందస్వామి), బాబురామ్ (ప్రేమానందస్వామి), రాఖాల్ (బ్రహ్మానందస్వామి) మఱియు ఇతర భక్తులనేకులును ఆయన వెంట వచ్చుచుండిరి. విశేషము, ఆయన పాదపద్మములనుండి యొక దివ్యవాహిని బయలుదేఱి, అలలతో ఆయనముందు పాఱుచుండెను. 'సమస్తము ఈయనయే కదా! ఈయన పాదపద్మముల నుండియే గంగామాత పుట్టినది' అని నాలో నేననుకొంటిని. రఘువీరాలయము పొంతనుండి యంతట వడివడిగా పూవులను గోసి పుష్పాంజలులను ఆ ప్రవాహమున సమర్పించినాను. అపుడు ఠాకూరు నాతో నిట్లు పలికిరి: 'మురుగులను దీసి వేయకు. వైష్ణవ తంత్రములు నీకుఁ దెలియునా?' నేను, 'ఏమవి? అవియేవో నాకుఁ దెలియవు' అంటిని. ఆయన అంతట ఇట్లనిరి: 'గౌరీమణి (గౌరీమాయి) మధ్యాహ్నమిచటికి వచ్చును. వానిని గుఱించి నీ కామె తెల్పును.' నాఁటి మధ్యాహ్నమే గౌరీ దాసి (గౌరీమాయి) రాఁగా, పతి తన సతికి చిన్మయుఁడని ఆమెవలనఁ దెలిసికొంటిని.''

శ్రీరామకృష్ణుఁడు తనయంత్యదశలో శారదాదేవితో నిట్లు పలికియుండెను: ''నా యనంతరము నీవు కామారిపుష్కరమునకు వెళ్లి ప్రాప్తించినదానిని—వట్టియన్నము, ఆకుగూరయుఁ గానిమ్ము—తిని, హరినామస్మరణ చేయుచు,

కాలక్షేపము చేయుము.'' గురువచనములను మాతృదేవి యక్షరములఁ బరిపాలించెను. ఆకుగూర నుత్పన్నము చేయుటకై యామె పాఱను జేపట్టి స్వయముగా కృషియొనర్ప సాగెను. అవి మొలిచి యక్కఱకు వచ్చువఱకును గాదెలోని వడ్లను దంపి, యన్నము వండి, గురుదేవునకు నివేదించి, యే సంబారమునులేని వట్టియన్నమును భుజింపసాగెను. *

సదా పరమేశ్వరార్పితహృదయయగు మాతృదేవి తనస్థితిగతుల నెవ్వరికిని—తుదకు తల్లికిసైతము—తెలుపదయ్యె. తనకుమారి కామారిపుష్కరమునకు వచ్చియుండెనని విని శ్యామసుందరీదేవి జయరాంబాటికి రమ్మని కోరెను. మాతృదేవి యొకనాఁడు తల్లినిఁ గలిసికొనుటకై వెడలెను. తనప్రియపుత్త్రి యించుమించు బికారివేసమున నుండుట గాంచి శ్యామసుందరీదేవి విలపించెను, జయరాంబాటికి రమ్మని మొఱలిడెను. కాని మాతృదేవి సమ్మతింపదయ్యె, తనపరిస్థితులనైనను దెలుపదయ్యె. ఆమె కేవల మిట్లు పల్కెను : ''నేను కామారిపుష్కరమునకు మఱలెదను. ఆ మహనీయుని సంకల్పము ననుసరించి యేమి జరిగినను జరుగుఁగాక !''

కామారిపుష్కరమున మాతృదేవి యేకాంతముగా నివసించుటవలననేమి, యెంతటియిడుమలనైనను పరమ

* దక్షిణేశ్వరాలయ నిర్వాహకులు శ్రీరామకృష్ణున కొసఁగుచుండిన యేడురూపాయిల పింఛనును ఆతనియనంతరము కొంతకాలము మాతృదేవి కొసఁగిరి. కొందఱికుట్రవలననేమి, నిర్వాహకుల సంకుచితబుద్ధివలననేమి, ఆ సాయ మిపుడు విరమింపఁబడెను.

శాంతముగా ననుభవించుటవలననేమి, ఆమెస్థితిగతులు నిజముగా లోకమునకుఁ దెలియవయ్యె. ఆపద లెంతటి యోగులకైనను—అవతారమూర్తులకైనను—ఒకించుక యలజడి కలిగింపకపోవు. ఇవ్విషయమున మాతృదేవియే యిట్లు తెలిపియున్నది : "నాలో నే నిట్లనుకొంటిని : 'నాకొక బిడ్డఁడైనను లేఁడే! 'నా' యనుకొనఁదగినవారు లోకమున నా కెవ్వరును లేరు. నా గతి యేమగునో కదా!' అపుడు ఠాకూరు ప్రత్యక్షమై యిట్లు పలికిరి : 'పుత్త్రుఁడు లేఁడనియా నీ పరితాపము! నీ కనేకపుత్త్రరత్నముల నొసఁగియున్నాను. కాలక్రమమున నింకను ఎందఱెందఱో నిన్ను 'అమ్మా!', 'అమ్మా!' యని పిలుచుచుండ వినఁగలవు.'" ఇట్టి దివ్యానుభవములు గురుదేవుని నిరంతర సాన్నిధ్యమునేగాక, తా నింక లోకమునఁ గొనసాగింపవలయు మహోద్యమము నామెకు వెల్లడింపసాగెను.

ఈ సమయమున ప్రసన్నమయి యింటిపరిచారిక యొకతె రాత్రులం దప్పుడప్పుడు మాతృదేవికి సాహచర్య మొనర్చుట తటస్థించెను. ఆమెమూలమున మాతృదేవి స్థితిగతులు క్రమముగా బాంధవులకును వారిమూలమున కలకత్తాయందలి శ్రీరామకృష్ణశిష్యబృందమునకును వెల్లడికాసాగెను. శిష్యబృందమునడుమ గోలాప్‌మాయి తీవ్రప్రచార మొనర్చి, చందాలను ప్రోగుచేసి, మాతృదేవిని కలకత్తాకు రమ్మని ప్రార్థించుచు శిష్యకోటిపేర వినతిపత్త్రమును బంపెను.

ఈ వినతిపత్త్రమునుగూర్చి వినినంతనే, ఊరిలోని సంకుచితబుద్ధు లెల్లరును అధిక్షేపము లారంభించి రనుటకు

సందియము లేదు. ఈ సమయమున ప్రసన్నమయి మఱల మాతృదేవికి బాసటయై, వారియాక్షేపములను నిరసించుచు నిట్లు ప్రకటించెను: "గదాయిభార్యనుగూర్చి యీ పెద్దమ్మల కేమి తెలియును? గదాయిశిష్యు లామెబిడ్డలు. వారి యాహ్వానము నామె యంగీకరించు టెంతయు సమంజసము." పూజ్యురాలును పలుకుబడి గలిగిన వ్యక్తియునగు ప్రసన్నమయిమాటల నెల్లరును శిరసావహింపవలసినవారైరి. మొదట సంశయించినను శ్యామసుందరీదేవియుఁ దుదకు సంతసముతోఁ దనయంగీకారము నొసఁగెను.

కామారిపుష్కరమున నొకసంవత్సర మైనవెనుక మాతృదేవి కలకత్తాకు వచ్చినంతనే శిష్యకోటి, అందు ముఖ్యముగా శ్రీరామకృష్ణుని శిష్యురాండ్రు, అఖండానంద భరితలైరి.

మాతృదేవియెడ శిష్యుల మనోభావములనుగూర్చి యిట నొకవిషయము తెలుపవలసియున్నది. శారదాదేవి యేమంత యాత్మవికాసముగల వ్యక్తియనియు, శిష్యురాండ్రు ఆమె తమ జాతికిఁ జెందిన వ్యక్తి కావున గోరంతలు కొండంతలు చేయుచుండిరనియు గృహస్థశిష్యులు కొందఱు తలఁప సాగిరి. నిజముగా నొకరు తమనిరసనభావము నిట్లు వెలిపుచ్చినట్లు తెలియవచ్చుచున్నది: "శ్రీరామకృష్ణుని నే నెఱుఁగుదును, కాని యతనిభార్యనుగూర్చి నే నేమియుఁ నెఱుఁగను." కాని గోలాప్‌మాయి, యోగేన్‌మాయి, యోగానందస్వామి మున్నగువారివలన బృందావనమందును ఇతరస్థలములందును ప్రత్యక్షముగా దర్శింపఁబడిన యామె పారమార్థిక ప్రతిభాతి

శయమునుగూర్చి విని వారిలో ననేకులు తమయభిప్రాయ మును మార్చుకొనుటయేగాక, యామెయెడ విశేషగౌరవ భావమును జూపసాగిరి. ఎల్లరును మాతృదేవి సదుపాయమును గూర్చి శ్రద్ధవహింపసాగిరి. ఐనను శారదానందస్వామి స్వయ ముగా నిరుపమానమగు కృషియొనర్చి యామెనివాసపోషణ ములకై శాశ్వతమగునేర్పాటు గావించుపర్యంతము శిష్య బృందమున ముఖ్యముగా గోలాప్‌మాయియు యోగానంద స్వామియు ఆ మహాకార్యమును నిర్వహింప నారంభించిరి. 1909-వ సంవత్సరమున కలకత్తాయందలి బాగ్‌బజారున మాతృదేవి నివాసమునకై శారదానందస్వామి ఉద్బోధన కార్యాలయ మను దివ్యభవనమును నిర్మించెను. అంతవఱకు (అనఁగా 1888-వ సం॥ మొదలుకొని) శిష్యులు మాతృదేవికి అద్దెయిండ్లలో నివాసమేర్పఱుచుచువచ్చిరి. ఈ సమయము ననే (ప్రాయికముగా 1893-వ సం॥న) మాతృదేవి వారము దినముల పర్యంతము పంచాగ్ని * మధ్యమున పంచతపమను మహాతపమొనర్చెనని తెలియవచ్చుచున్నది. †

మాతృదేవి పారమార్థికశక్తిసామర్థ్యములు సంపూర్ణ వికాసము నొందెను. అవలీలగా నొరులకు ఆత్మప్రబోధము నొనఁగూర్చుట కేమి, గురుదేవుని మహోద్యమమును గొన

* నలువైపులను నాలుగగ్నులును మింట సూర్యుఁడును.

† ఈ సమయమున మాతృదేవి గురుదేవుని నామమును జపించుచుండ, అగ్నులకు వేఁడిమియేలేనట్లు తోఁచెడిదని వచించియున్నది. చిన్ననాఁటి నుండియు నామె కొక్కొక్కప్పు డొక బాలికయు, వేఱొకప్పు డొక సన్న్యాసియుఁ దనయెదుట సంచరించుచున్నట్లు గాన్పించెడిదనియు ఈ తపమువలన తద్దర్శనము తొలఁగెననియుఁ దెలియవచ్చుచున్నది.

సాగించుట కేమి, ఆమె సమర్థురాలయ్యెను. మాతృదేవి కామారిపుష్కరమునుండి వచ్చినపిమ్మట యోగేన్ మాయి మున్నగు నామెసహచరురాండ్రు ఆమె విశేషముగా అంతరవలోకనాయత్తచిత్తయై యుండుటయు, అలౌకికతేజము ఆమెవదనమున వెల్గొందుచుండుటయుఁ గనుఁగొనసాగిరి. ఆమె పారమార్థిక ప్రభావముల కింతకంటెను ప్రత్యక్షనిదర్శనములను (1888–వ సం॥న) గాంచు సదవకాశములు వారికి లభించెను. బలరామబాబుగృహమున మాతృదేవి ధ్యానించుచు సమాధిస్థితిని జెందియుండ, తాను గాంచితినని యోగేన్ మాయి తెలిపియున్నది. తనదివ్యానుభవమును గూర్చి మాతృదేవి యామె కిట్లు తెల్పెనఁట : "ఆ స్థితిలో నే నతిదూరదేశమునకు వెడలినట్లు కనుఁగొంటిని. అచటివారందఱును నాయందపరిమితానురాగమును జూప మొదలిడిరి. నా సౌందర్యము వర్ణనాతీతమైయుండెను.* శ్రీగురుదేవుఁడును అటనుండెను. మహాదరముతో వారు నన్ను ఆయనపక్కఁ గూర్చుండఁబెట్టిరి. ఆ దివ్యానందము ఇట్టిదని చెప్పఁజాలను. ఆ దివ్యభావమునుండి మనస్సు ఒకించుక సామాన్యస్థితికి వచ్చినంతనే నా శరీర మిచటఁ బడియుండుటఁ జూచినాను. అంత నిట్లనుకొంటిని : 'ఈ కురూపశరీరమున ఎట్లు ప్రవేశించుట ?' నా కెంతమాత్రము మనస్కరింపలేదు. ఎంతో

* శ్రీరామకృష్ణుఁ డొకప్పుడు గోలాప్ మాయితో నిట్లు పలికెను : "ఆమె (శారదాదేవి) సరస్వతీదేవి అవతారము...కలుషనేత్రములతో లోకులు తన్నుఁ జూచి పాపమున కొడిగట్టుకొనకుండుటకుఁగాను ఆమె తనదివ్యసౌందర్యమును దాఁచుకొనియున్నది."

సేపైనతరువాత తుదకు ఎట్లో మనస్సు ఒడఁబడినది. అంతట బాహ్యస్మృతి కలిగినది.''

మఱియొకనాఁడు మాతృదేవి నీలాంబరముఖోపాధ్యాయు నింట యోగేన్‌మాయితోడను గోలాప్‌మాయితోడను గూడి ధ్యానించుచుండెను. తన ధ్యానమైన వెనుక యోగేన్ మాయి మాతృదేవినిఁ దిలకింప, నామె యప్పటికిని ధ్యాన నిమగ్నమై యుండెను. బహిఃప్రజ్ఞను బొందుట కామె కెంతయోసేపు పట్టెను. బాహ్యస్మృతి చిహ్నములు పొడకట్టు సమయమున నామె యిట్లు పలుకసాగెను: ''ఓ యోగేన్! నా చేతులేవి? కాళ్లు ఏవి?''* యోగేన్‌మాయి మాతృదేవి శరీరావయవములను నిమురుచు నిట్లు పలికెను: ''ఏల తల్లీ! ఇవిగో మీ చేతులు, ఇవిగో మీ కాళ్లు.'' ఐనను, చాల సేపటికిఁగాని యామె పూర్ణమగు శరీరస్మృతి నొందలేదు.

సమాధిస్థితి మాతృదేవి కెట్లు కరతలామలకమై యొప్పెనో ఈ యనుభవములే వేనోళ్లఁ జాటుచున్నవి.

నిరుపమానమగు మఱియొకదివ్యదర్శన మించు మించుగా ఈ సమయముననే మాతృదేవికి లభించెను. శ్రీరామకృష్ణుఁడు గంగానదిలోఁ బ్రవేశించుచుండ, నాతని శరీరము ఆ దివ్యతీర్థమున లీనమగుచుండెను. నరేంద్రుఁడు

---

* ఇది నిర్వికల్ప సమాధిస్థితియని పలువురచే నెన్నఁబడియున్నది. కాశీపురవనగృహమున శ్రీరామకృష్ణసన్నిధినుండ నరేంద్రుఁడును (వివేకానందస్వామి) నిర్వికల్పసమాధిస్థితిని బొంది క్రమముగా బాహ్యస్మృతి నొందినప్పుడు సరిగా నిట్లే యొక సోదరశిష్యుని సంబోధించుచు, 'అన్నా! గోపాలా! గోపాలా! నా శరీర మేది?'' యని ప్రశ్నించెను.

(వివేకానందస్వామి) "జయ! రామకృష్ణ!" యని జయజయ ధ్వానములు సల్పుచు, ఆ తీర్థమును జనసహస్రములపై ప్రోక్షించుచుండెను. ఆ దివ్యదర్శనము మనఃఫలకమున ముద్రితమై దీపింప, గురుదేవునిశరీరము ఐక్యముగాంచిన యా గంగానదీతోయములఁ గాలిడుటకుఁ జాలకాలముపాటు మాతృదేవికి మన సొప్పకుండెడిది.

ఇంచుమించు మాతృదేవి యీ దివ్యదర్శనము నొందిన సమయముననే శ్రీ వివేకానందస్వామి సనాతనధర్మప్రచార మహోద్యమమును — ఖండఖండాంతరములందు శ్రీరామ కృష్ణపరమహంస పరమాదర్శవ్యాపనమును—ఆరంభించిన సుముహూర్తము సంఘటిల్లెను. వివేకానందస్వామి మహో త్సాహముతో నిట్లు కృషియొనర్చుచుండ, గురుసందేశ వ్యాపనమహోద్యమమున మాతృదేవి నిర్వహింపవలయు బాధ్యత విశిష్టాకృతినిఁ దాల్పసాగెను. ఆమె దివ్యోపదేశ ముల నంది యాత్మవికాసమును గాంచుటకై ముఖ్యముగా భరతఖండమున నానాదేశములనుండియు ముముక్షువు లరు దెంచి యామె నాశ్రయింపసాగిరి.

జనసహస్రమునకు జ్ఞానదాన మొనర్చుచు, బాంధవ సమాజమున బంధవినిర్ముక్తయై, దివ్యప్రేమమూర్తియై యామె విరాజిల్లెను.

# పదుమూఁడవ ప్రకరణము

## బాంధవసమాజమున మాతృజీవితము

నిత్యసమాహిత చిత్తులగువారికి ఆకాశాది భూతములకు వలె గృహారణ్యములు సమములే యగును.* దాంతులగు మహనీయులెచట నివసింతురో అదియే అరణ్యము, అదియే ఆశ్రమము.† "భగవత్పాదపద్మములను స్పృశించిన మానవోత్తములు లోకవ్యవహారనిమగ్నులైయున్నను, ఏకాంతవనప్రదేశమున నున్నను నిర్లిప్తులైయుందురు" అని శ్రీరామకృష్ణపరమహంస పలికియున్నాఁడు. బాంధవమధ్యమున మాతృదేవిజీవిత మిందలి సత్యమును వేనోళ్లఁ జాటుచున్నది.

మాతృదేవి కలకత్తానుండి వెడలి జయరాంబాటిలో పుట్టినింట నివసించుచువచ్చిన సమయము లనేకములు గలవు.‡ తల్లికిని, ప్రసన్నకుమారుఁడు, వరదాప్రసాదుఁడు,

---

* "అరణ్యే సదనే తుల్యే సమాహిత మనోదృశామ్,
భవతా మిహ భూతానాం భూతానాం మహతా మివ."
—యోగవాసిష్ఠము.

† "యత్రైవ నివసేత్ దాన్తః తదారణ్యం తదాశ్రమమ్."
—మహాభారతము.

‡ కాని యామె మఱల కామారిపుష్కరమునకు వెళ్లినట్లు అంతగాఁ గాన్పింపదు. ఐనను గురుదేవుని జన్మస్థలమైన యా గ్రామము నెడ ఆమె విశేషగౌరవభావము గలిగియుండెడిది. నిజముగా తాను కామారిపుష్కరవాసినిగా భావించుకొనెను. ఆమె కాశీయాత్ర నొనర్చినతఱి స్వగ్రామమునుగూర్చి పురోహితు లడుగ, కామారిపుష్కరమని

కాళీకుమారుఁడు, అభయచరణుఁడు నను తమ్ములకును మాతృదేవి తోడ్పాటు ఆవశ్యకమగుటయే యిందులకు ప్రధానకారణము. తల్లి శ్యామసుందరీదేవి వృద్ధురాలయ్యెను. కోడండ్రు చిఱుతప్రాయమువారగుటచే గృహకృత్యములను నిర్వహింపఁజాలకుండిరి. అయ్యెడఁ దల్లి శ్రమ చెందుట సహింపఁజాలక మాతృదేవియే ధాన్యమును దంపి, యన్నము వండి, సకలకార్యములందును ఎల్లరకును దోడ్పడుచుండెను. వారి నిమిత్త మామె పడుచుండిన శ్రమను దలఁచి శ్రీరామకృష్ణశిష్యుఁడును కవిచంద్రుఁడునగు గిరీశచంద్రుఁ డిట్లు వచించెను: "మాతృదేవివలన అంతటి సేవలను బడయుట కామెసోదరులు పూర్వజన్మమున అఖండతప మొనర్చియుండవలయును."

మాతృదేవిసోదరుఁడగు ప్రసన్నకుమారునకు నళిని, మాకు అను నిరువురు పసిబాలిక లుండిరి. వారిని సంరక్షింప నాతని (ద్వితీయ) భార్యకుఁ దగిన ప్రాయములేనికతన మాతృదేవియే యా బాధ్యతను వహించి తఱచుగా నాతని యింట నివసింపసాగెను.

మాతృదేవిసోదరులకు ఆర్థికచింతయేగాని పారమార్థిక చింత సుంతయు లేదయ్యె. మాతృదేవి సదుపాయమునకు వలయుధనమును శిష్యబృంద మొసఁగుచుండినకతన సోదరులు నలువురును ఆమెను సమానసంపదగా భావించుచు, ఆమె వలన సాధ్యమైనంత సాహాయ్యసంపదను—లాభమును—

---

వచించియుండెను. అట గురుదేవునివలనఁ దనకు సంక్రమించిన కుటీరము నామె యావజ్జీవము కాపాడుచువచ్చెను.

బడయఁజూచుచుండిరి. ఇవ్విషయమున వారిలో వారికిఁ బోటీలు, కక్షలు, కార్పణ్యములును. వానినిగూర్చి శిష్యులిట్లు తెలిపియున్నారు: "అమ్మ యొకప్పుడు కలకత్తానుండి కొందఱు శిష్యురాండ్రతో జయరాంబాటికి వచ్చెను. వారిలో నొక రామెతో నిట్లనిరి: 'అమ్మా! చూచితిరా, మీ యెడల మీ సోదరుల ప్రవర్తన! గ్రామమునకు వచ్చుచుండ, గౌరవార్థము వారొక మనుష్యునైనను బంపరైరి.' అనంతరము అమ్మ యివ్విషయమై యొక సోదరునిఁ బ్రశ్నింప నాతఁ డిట్లు పల్కెను: 'అక్కా! కాళినిఁ (కాళీకుమారుని) జూచి భయపడి నేనట్లు చేయలేదు. చేసినపక్షమున నిన్ను నా వలలో వేసికొనఁ బ్రయత్నించుచున్నానని నన్నతఁడు నిందింపవచ్చును. నీ వెంత అమూల్యమైన సంపదవో నాకుఁ దెలియదా?...ముందుజన్మములలోసైతము నిన్ను నా సోదరిగాఁ బడయునట్లు నన్ను ఆశీర్వదింపుము. నాకు మఱేమియు వలదు.' అమ్మ యందుల కిట్లు సమాధానమొసఁగెను: 'నేను మీ కుటుంబమున మఱల జన్మింతుననుకొనుచున్నావా? చాలును ఈ యనుభవము! తిరిగి మీ సోదరిని అగుటయా!! చెప్పనక్కఱలేదు! మా తండ్రి రామభక్తాగ్రేసరుఁడు. మా యమ్మ దయాస్వరూపిణి. అందుచేతనే ఈ కుటుంబమున జన్మించినాను.'"

సోదరులు ఎంతసేపు డబ్బిమ్మని ప్రాఁకులాడుచుండ, మాతృదేవి విసువుచెంది యొకప్పు డిట్లు పలికెను: "ఎంతసేపు డబ్బుకోసమే వారి ప్రాధేయత. భక్తి జ్ఞానముల నిమ్మని ప్రమాదవశమున నైన వా రడిగిరా?"

చదువరులారా! మాతృదేవి పారమార్థిక ప్రతిభాతిశయము ఎట్టిదో పరికింపుఁడు!

ఒకనాఁడు కాళీకుమారుఁడును వరదాప్రసాదుఁడును వాదులాడుచు, ముష్టియుద్ధమునకు దిగనుండిరి. మాతృదేవి వారలను శాంతింపఁజేయుటకై యత్నించుచుండ నొక శిష్యుఁడును గొంద ఱితరులును వచ్చి వారిని వేఱుపఱిచిరి. సోదరుల పరస్పరద్వేషమును గని మాతృదేవి యెంతయుఁ బరితపించుచుఁ దనగృహమున కేఁగెను. అచటఁ గూర్చుండి పక్కున నవ్వుచు నామె యిట్లు విమర్శించి పలికెను: "ఆహా! మహామాయ ఏమి మోహమును గల్పించినది! ఇదిగో, మహాసంసారము,—నరుఁడు 'నాది' యనుకొనున దంతయు మరణకాలమున దిగవిడిచి పోవలసినదేకదా! పూచికపుల్లయైనను వానితోఁ బోఁబోదు. ఈపాటిసంగతి లోకులు గ్రహింపఁజాలకున్నారు, ఆశ్చర్యము!" ఇట్లనుచు మఱల నవ్వసాగెను.

మాతృదేవి సోదరులందెల్ల ధీమంతుఁడగు నాతఁడు అభయచరణుఁడు. ఈతఁడు వైద్యశాస్త్రమున నుత్తమ పరీక్షలో నుత్తీర్ణుఁడయ్యెను. ఐనను, తుదకు ఈతని మూలమునసే దుర్భరము, అనంతమునగు బాధ్యతను మాతృదేవి వహింపవలసివచ్చెను. దురదృష్టవశమున నాతఁడు విషూచి వ్యాధిగ్రస్తుఁడై (1899-వ సం॥న) మరణించెను. ఆ సమయమున నాతనిభార్య సురబాల గర్భము దాల్చియుండెను. తన యవసానకాలమున నాతఁ డామెను మాతృదేవికిఁ జూపుచు నిట్లు పలికెను: "ఇంతటినుండి వారిని (అనఁగాఁ దన భార్యను

ఆమె కనఁబోవు బిడ్డను) నీవే రక్షింపవలయును.'' తమ్ము లందఱియందును చిన్నవాఁడగు నభయుఁడు మాతృదేవి కెంతయు ననుంగుతమ్ముఁడు. ఆతని యకాలమరణ మామెకు విశేషసంతాపహేతు వయ్యెను. ఇది యిటులుండ, సురబాల దురదృష్టము క్రమముగా నామెకు మఱింత పరితాపమును గలిగింపసాగెను. ఏలన, పాపము, సురబాల తనకు సంభవించిన మహాపదకుఁ దాళఁజాలక మనోవైకల్యము నొందెను. ఆ స్థితిలో నుండఁగనే యామె యొక యాఁడుబిడ్డను గనెను. దిక్కులేని యా తల్లిని, బిడ్డను సంరక్షించు భారము మాతృదేవియే వహింపవలసివచ్చెను. వారల కొక దాది నేర్పఱచి, తగు సదుపాయములను గల్పించి, యామె కలకత్తాయందలి శిష్యబృందమునొద్దకు మఱలెను.

ఎన్ని యేర్పాటుల నొనర్చినను, ఆ మాతాశిశువుల దైన్యస్థితి యామెమృదులమాతృహృదయమును గలంచుచునే యుండెను. ఆమె యొకదృశ్యమును గాంచెను. దానినిగూర్చి యామె యిట్లు పలికెను: ''ఒకనాఁడు సాయంకాలము నే నాలయమున పూజించుచుంటిని. అకస్మాత్తుగా నా దృష్టి నుండి నాటకరంగమునఁ దెరవలె నొక యావరణము తొలఁగెను. మా పుట్టినింట రాధు (సురబాలకుమార్తె)* మహాబాధల పాలగుచుండుట చూచినాను....ఆమె దైన్యస్థితి నన్ను తల నీటిలో నదిమిపెట్టఁబడిన దానివలె నుక్కిరిబిక్కిరి

* రాధారాణియను ఈ బాలిక 'రాధు' అనియు 'రాధి' యనియు ముద్దుపేరులతోఁ బిలువఁబడుచుండెడిది.

చేసివేసెను. నేను సంరక్షింపనిచో, ఆ పసికూన యెట్టి యిడుమలపాలగునో స్పష్టముగా గోచరించినది.''

'అది ప్రేమయా, మోహమా?' యని మనకు సంశయము గలుగునంతవఱకు—తుదకు అంత్యదశలో స్వాయముగా నామె యీ బంధమును విచ్ఛేదనమొనర్చుకొనుపర్యంతము — నాఁటినుండియు మాతృదేవి యా బాలిక యోగక్షేమములనుగూర్చి పరితపింపసాగెను.

రాధు కష్టములనుగూర్చి మాతృదేవి యీ దృశ్యమును గాంచిన వెంటనే జయరాంబాటికి వెడలి యా బాలికను స్వాయముగా సంరక్షింప నారంభించెను. ఇంతటినుండియు రాధు నెడఁబాయుటనిన నామె సహింపఁజాలకుండెడిది. ఆ బాలిక లేనిచో, అన్నపానీయము లామెకు రుచింపకుండుటయు, ఆమె తనపక్కను బరుండనిచో నిద్రాభంగము నొందుటయు శిష్యులు గమనించియున్నారు. ప్రేమపాశ మెంత బలీయము! మాతృదేవి నిజముగాఁ దనపాలిటి మాతృదేవియై వర్తించుచుండ, రాధారాణి యామెను ''అమ్మా'' యని పిలిచెడిది.*

క్రమముగా రాధుమూలమునను, ఆమెతల్లిమూలమునను మాతృదేవి పొందిన పరితాపము, అనుభవించిన కష్టములు, వర్ణనాతీతములు. తన యేకపుత్రికకుఁ దనకంటె మాతృదేవియే విశేషప్రేమాస్పదురాలై యుండుట సురబాలకు సహింపరానిదై యసూయను గలిగింపసాగెను. మనో

* తనతల్లి నా బాలిక 'నేడిమా' అనఁగా 'బోడెమ్మ' యని పిలిచెడిదఁట!

వైకల్యమునకు అసూయ తోడ్పడ, పరులయెదుట మాతృదేవి నామె నిరంతరము దూషింపనారంభించెను. అర్భకురాలగు రాధు రోగములకుఁ బుట్టినిల్లై యుండుటయు, మాతృదేవి యామెకు వైద్యునిచే మందిప్పించినపు డెల్ల, తనకూఁతు నామె చంపఁదలఁచుచుండెనని సురబాల నిందించును. ఒకప్పుడు కోపావేశమున నామె పొయినుండి పెద్దకొఱవినిఁ గైకొని మాతృదేవి నెదుర్కొనెను. దైవవశమున నపు డచటనుండిన కొందఱుశిష్యులు అడ్డుకొని మాతృదేవినిఁ గాపాడిరి. ఈ యున్మత్తురాలు పెట్టుబాధలు దుర్భరములైనపుడు మాతృదేవి యిట్లు వచించును: "బహుశా ముండ్లుగల బిల్వపత్రములతో శివుని నేను పూజించియుండవలయును. అందువలననే సంసారమున నాకీ ముల్లు సంప్రాప్తమైనది."

ఒక్కవిషయమునమాత్రము సురబాల వెఱ్ఱికి విధానము గోచరించెడిది: మాతృదేవికి ప్రాప్తించిన ధనమును, ఆస్తియుఁ దుదకుఁ దన రాధికే చెందునని యామెకు గట్టి నమ్మకము. మాతృదేవి నివాసమునకై కలకత్తాలో ఉద్బోధనకార్యాలయము నిర్మింపఁబడిన సంగతిని వినినప్పు డామె బ్రహ్మానందపడెనని తెలియవచ్చుచున్నది. పరులకు మాతృదేవి దానధర్మము లొనర్చుటకంటె సురబాలకు సహింపరానిది వేఱొండు లేదయ్యె. ఈ విషయమై యామె తన్నొకప్పుడు తీవ్రముగా దూషింప, మాతృదేవి యిట్లు సమాధానించెను: "నాది బిడ్డలనైజము. నే నూరక అంచనాలు వేయఁజాలను. ఎవరు అర్థింతురో వారి కిచ్చెదను."

రాధుతల్లి మాతృదేవికి ముల్లైనచో, ఆమెబాలిక యంతకంటె మొనదేలినముల్లై పరిణమించెను. ఆమెకు ఏండ్లు వచ్చినకొలఁదియు మనశ్శరీరదౌర్బల్యము హెచ్చు చుండెను. శారీరకముగా నామె సదా వ్యాధిగ్రస్తురాలు, మానసికముగా కేవలము అవివేకురాలు. ఆమె శీలమున మనోజ్ఞమగు నమాయకత్వ ముండినను, అప్రాజ్ఞత యా సుగుణమును జాలవఱకుఁ గప్పిపుచ్చెను. వెంకితనము, ముంగోపము, వెఱ్ఱిధోరణి—ఇవన్నియు నామెమానసమున నేకీభవింప, మాతృదేవి యామెయం దెంతటి ప్రేమానురాగ ములను జూపినను, ఆమె యోగక్షేమములనుగూర్చి యెంతటి శ్రద్ధవహించినను, ఇసుమంతయు ఆ బాలిక చక్కఁబడదయ్యె. అది గని మాతృదేవి చింతించుచు నొకప్పు డిట్లు పలికెను: "రాధు నా కెంతటి తాపత్రయమును గల్పించుచున్నది! గౌర్దాసి (గౌరీమాయి) నిఁ జూడుఁడు. ఆమె తనబాలిక నెంతటి వృద్ధిలోనికిఁ దీసికొనివచ్చినదో! నేనో, తుద కీ కోఁతిని సృజించినాను!"

రాధు మాతృదేవిని గాఢముగా ప్రేమించెననుటకు సందియములేదు. కాని యామెప్రకృతిపరిజ్ఞానములకుఁ దనకు ప్రేమపాత్రమైన వ్యక్తినిఁ దన ఆటబొమ్మగా పరిగణించుట కును, తిట్టి తూలనాడుటకును స్వాతంత్ర్యమనికదా ప్రేమకు తాత్పర్యము! ఆమె మాతృదేవి చెప్పినమాటను సుంతయు వినదయ్యె, పరులయెదుట నామెను తిరస్కరించి వెక్కిరిం చును, నిష్కారణముగా నామెయెదుటఁ జిఱచిఱలాడును, మర్యాదను విడిచి యామెను దూషించి శపించును, అల

ష్యముగా నామెపై వస్తువులను గిరాటువేయును—వేయేల, మఱియెవ్వరికైనను ఆమె విపరీతచేష్టలచే ప్రాణము విసివి, 'ఎందు కీరోఁత!' యనిపించెడిది. కాని తాలిమిని భూదేవి యగు మాతృదేవి యట్లు తలఁపదయ్యె.

రాధారాణికి మాతృదేవి విరోధికృన్నామ సం॥ జ్యేష్ఠమాసము (జూన్ 1911–వ సం॥) న. వివాహ మొనర్చెను. కాని యామె భర్తయు నామెయు మాతృదేవి యొద్దనే నివసించువారు. కాలక్రమమున నామె గర్భవతి యయ్యెను. ఈ సమయమున నామె మనశ్శరీరదౌర్బల్యములు తుదముట్టెను. చికిత్సకై మాతృదేవి యెంతయో శ్రమపడి సమస్తసదుపాయముల నొనర్ప నామె నిరుపద్రవముగా ప్రసవించెను. ఈ సమయమున రాధు మాతృదేవికిఁ గలిగించిన బాధలనుగూర్చి యొకశిష్యుఁ డిట్లు వ్రాసియున్నాఁడు: "రాధు గనిన బిడ్డకు ఆఱునెలలు వచ్చినవి. దౌర్బల్యముచే రాధు ఇంకను లేచి నిలువలేని స్థితిలో నుండెను. ఆమె కేవలము ప్రాఁకుచుండెడిది. విశేషము, ఆమె నల్లమందలవాటుచేసికొనినది. కొలఁదినెలలుగా మాతృదేవియు వ్యాధిగ్రస్తురాలై యుండెను. ఆమెకు జ్వరము వచ్చుచుండెడిది. రాధుకు నల్లమందు అలవాటు మాన్పుటకై యామె యత్నించుచుండెను. కాని రాధు ఆమె మాట వినదయ్యెను. నాఁడు ఉదయము మాతృదేవి కూరలను దఱుగుచుండఁగా, నల్లమందుకోసము రాధు ఆమెను సమీపించెను. అది గని యామె యిట్లు పల్కెను: 'రాధీ! ఎంతకాలము ఈ నల్లమందలవాటు? దీనిని విడిచియుండఁజాలవా? ఎంత

సేపు నిన్నుఁగూర్చియేనా నా తాపత్రయము? నా కిది సాధ్యమా? నీకోసమై నా భక్తిని ముక్తిని సమస్తము కోల్పోయినాను. నీ ఖర్చులనన్నిటిని నే నెట్లు భరింపఁగలనో చెప్పు.' ఈ మాటలను విని రాధు ఆగ్రహముఁ జెంది కూర బుట్టనుండి యొక పెద్ద వంకాయను గైకొని మాతృదేవివైపు బలిమికొలఁది గిరాటువేసెను. అది దిబ్బున నామెకుఁ దగుల బాధచే నామె వెన్ను చుట్టుకొనిపోయెను. తత్‌క్షణమే యా తావున బొబ్బ తేలెను. గురుదేవునిపటమును దిలకించి కరములు మోడ్చి మాతృదేవి యిట్లు ప్రార్థించెను: 'ప్రభూ! ఆమెను క్షమింపుఁడు, ఆమె యవివేకురాలు.' అనంతర మామె తనపాదరజమును గైకొని రాధుతలపైనుంచి యిట్లు వచించెను: 'రాధీ! ఈ తనువునుగూర్చి ఠాకూరు (శ్రీ పరమహంస) ఒక్కకఠినవాక్కునైనను పలికియెఱుఁగరు, నీవు దీని నింతగా హింసించుచున్నావు. నా అంతరువు నీ వెట్లు తెలిసికోఁగలవు? నేను మీ యందఱితోడను మసలుచుండుటచే నన్ను గడ్డిపరకవలెనైనను దలఁపకున్నావు.' ఈ మాటలను విని రాధు వలవల యేడ్వసాగెను.

"రాధుసంరక్షణమునకు వలయు ధనమును మాతృదేవికి శిష్యు లొసఁగుచుండిరి. ఈ సందర్భమున శారదానంద స్వామి తనకు ప్రతిమాసమును ధనమును బంపుటకై శ్రమపడుచుండెనని విని మాతృదేవి యిట్లు పలికెను: 'శరత్ వద్ద నా కిచ్చుటకుఁ దగినంత సొమ్ము లేదనుకొందును. కాని పక్షమున, అతఁ డట్లు వ్రాయఁడు. సొమ్ముఁ బంపెదనని బెంగుళూరువాసియగు నొకభక్తుఁడు మొన్న చెప్పినాఁడు.

కాని యందుకోస మతనికి నే నెట్లు వ్రాయఁగలను? కడసారి ఠాకూరు చెప్పినమాటలను బరిపాలింపవలదా? రాధీ, ఇటు చూడు. నీ నిమిత్తము సమస్తము పోఁగొట్టుకొనుచున్నాను! ఠాకూరు నాతో ఇట్లనిరి: 'చిల్లిగవ్వకుఁ గానీ, ఎవ్వరివద్దను చేయిఁ జాపకు. సామాన్యమగు నన్నవస్త్రములకు నీ కెన్నఁడును లోపము కలుగఁబోదు. గవ్వకుఁ గానీ, ఎవ్వరినైనను అర్థించితివా, వారికి నీ తలను అమ్ముకొనుచున్నావని జ్ఞప్తిలో నుంచుకొనుము.' "

మాతృదేవి జయరాంబాటిలో నున్నను, కలకత్తాలో నున్నను, రాధును, ఆమెతల్లియు నితరబంధువులు మఱికొందఱును ఆమెయండను మనుచుండిరి. ఇట్లు నిరంతరము బంధువులమధ్యమున — సంసార బంధములనడుమ — మసలుచుండియు మాతృదేవి భవబంధవిముక్తయై యెటు లొప్పెనని చదువరులు ప్రశ్నింపవచ్చును. బాంధవసమాజముపై స్పృహ లేకుండుట సన్న్యాసులకు ప్రధానధర్మమైయుండ,— రాగవిరహితమగు చిత్తవృత్తి పారమార్థికులకు ఆవశ్యకమై యుండ—రాధు నెడ మాతృదేవి కంతటి మమకారము తగునాయని, అది యామె ఆత్మవికాసమునకు కళంకము నాపాదింపదా యని, విమర్శకులు శంకింపవచ్చును.

నిజముగా మాతృదేవి పరార్థజీవితమునకును పారమార్థికజీవితమునకును ఈ ఘట్టము వన్నె దెచ్చునని మా సమాధానము. ఇయ్యది సమంజసమని తెలుపుట కనేక నిదర్శనములు కలవు.

బాంధవసమాజముతో సంబంధము విడనాడుట సన్న్యాసులకు విధింపఁబడిన నియమమనుటకు సందియము లేదు. త్యాగమునకును బ్రహ్మచర్యమునకును పెన్నిధియై యొప్పినను, మాతృదేవి గృహస్థాశ్రమమును వీడలేదనియు సన్న్యాసిని కాదనియు మనము గుర్తింపవలసియున్నది. పసితనముననే శ్రీరామకృష్ణపరమహంస సహధర్మచారిణియై స్వార్థరహితమగు సేవలనొనర్చుచు, గృహస్థజీవనముననే యామె పరిపూర్ణమగు నాత్మవికాసమును గాంచెను. ఆమె యొనర్చిన కార్యములన్నియు యోగవిరాజితములని చెప్ప నొప్పును. అవ్యాజప్రేమయేకదా యామెకార్యము లన్నిటికిని మూలము! లోకమున మాతృప్రేమను మించిన ప్రేమ లేదని చెప్పుదురు. కాని ముందెన్నఁడో బిడ్డలవలన పోషణాదికములను బడయనగునను ప్రతిఫలాపేక్ష మాతృప్రేమయందును గొంతవఱకు గోచరించును. ప్రతిఫలము నొసఁగఁజాలని వ్యక్తినిఁ బ్రేమించుట లోకమున నెంతయు దుర్లభము; తాను బడు నష్టకష్టములకును, అనంత తాపత్రయమునకును ప్రతిఫలముగఁ దిట్టులను, తన్నులను బ్రసాదించు వ్యక్తినిఁ బ్రేమించు టెఁక నెంతటి దుర్లభమో, దేవతాగుణమో, చింతింపుఁడు! ప్రేమానురాగములకును స్వార్థత్యాగమునకును ఇంతకంటె పరమావధి యేది? ఏయాశ్రమమున నున్న నేమి? ఇట్టి ప్రేమానురాగములకు ఆశ్రయమగు వ్యక్తియేగదా మహనీయమూర్తి! 'ఉదార చరితానాం తు వసుధైవ కుటుంబకమ్' అనికదా పెద్దలు చెప్పుదురు!

నిజముగా కుటుంబమునఁ దన కెట్టి బాధ్యతయు లేకున్నను, అనంతకారుణ్యముచే—సహజ ప్రేమానురాగ ములచే—మాతృదేవి దీనులును నిస్సహాయులునగు బంధు వులకు నిరుపమానమగు సేవల నొనర్చెను. గృహస్థాశ్రమ మునకుఁ బట్టుఁగొమ్మయు సమష్టిజీవనమునకు హృదయమునగు మహోన్నత మాతృప్రేమ మిటులామె జీవితమున రూపు దాల్చెను. స్వార్థరహితయు, అకలంకచరితయు నగు నామె కుటుంబజీవనము శుద్ధసన్న్యాసదృష్టికి కలంకభూయిష్ఠముగాఁ దోఁచినఁ దోఁచుఁగాక, యీ కలంకముచేతనే యామె పారమార్థికజీవనచంద్రమండలము మఱింత మనోహరమై దీపించుచున్నదని చెప్పనొప్పును.

"సరసిజమనువిద్ధం శైవలేనాపి రమ్యమ్
మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి;
....................................."

(నాఁచునఁ బెనఁగొనియుండియు నలినము రమ్యమే యగును; నల్లనిదయ్యు, కలంకము చంద్రుని శోభాయమాన మొనర్చు చున్నది...) అని మహాకవి కాళిదాసు వచించియుండెఁ గదా?

రాధారాణియెడ మాతృదేవి కిట్టి ప్రబలానురాగము నకు అలౌకికమగు మఱియొక హేతువు కలదు. ఆమె జీవితో ద్యమము నెఱవేఱుట కీ ప్రబలానురాగమే విచిత్రముగా కారణభూతమైయొప్పెను. శ్రీ పరమహంస నిర్యాణానంతరము మాతృదేవిమానసము తఱచుగా సమాధిమగ్నమగుట గని యున్నాముకదా ? బంగారు మేదియో కొంత కలగలపు

లేనిదే నగలుచేయుట కుపయోగపడనిరీతిని ఏదైన నొక వాంఛ—లోకమునకుఁ దన్ను బంధించు పాశము—లేనిదే యుత్తమసమాధిగతమానసము బాహ్యలోకములోనికి దిగి వర్తింపఁజాలదు. రాధు మాతృదేవి కీ లౌకికపాశమును సమకూర్చెను. ఈమె సంసర్గములేనిచో, మాతృదేవి సమాధినిమగ్నయై యచిరకాలముననే తనువుఁ జాలించి యుండెడిదని గ్రహింపవలసియున్నది. ఇవ్విషయమునుగూర్చి మాతృదేవియే స్వానుభవము నిట్లు వెల్లడించెను :

"ఆహా! రాధుమూలమున ఠాకూరు నా కెట్టి బంధమును గల్పించిరో!...ఠాకూరు నిర్యాణము నొందిన యనంతరము జీవితము నాకు కేవలము రసహీనముగాఁ దోఁచినది. ఇహమనిన, పరిపూర్ణమగు నలక్ష్యము గలిగినది. ఉదాసీనత ప్రబలినది. అపుడు ఇట్లు ప్రార్థించు దానను : 'ఇంకను ఈ లోకములో ఉండి నేను సాధించున దేమి?' ఆ సమయమున నాయెదుట పదిపండ్రెండేండ్ల బాలిక, ఎఱ్ఱనిబట్ట కట్టుకొని నడయాడుచున్నట్లు గోచరించినది. ఠాకూరు ఆమెను నాకుఁ జూపుచు నిట్లు పలికిరి : 'అదిగో, నీ జీవగఱ్ఱ, దానిని విడువకు, చాలమంది బిడ్డలు (శిష్యులు) నీ కడకు వత్తురు.' ఆ బాలిక మాయమయ్యెను. కాలాంతరమున నేనీ తావుననే కూర్చుండి యుంటిని. ఆ దినములలో రాధితల్లికి పూర్తిగా మతిపోయినది. ఆమె కొన్ని చింపిగుడ్డలను చంకఁబెట్టుకొని యీడ్చుకొనుచుఁ బోవుచుండ, రాధు ఆమెవెనుక నేడ్చుచు, ప్రాఁకుచుండెను. అది చూచినంతనే నా గుండె నీరైనది. తత్క్షణమే పరు

గత్తి వెళ్లి రాధు నెత్తుకొంటిని. అంత నే నిట్లనుకొంటిని: 'ఆహా! ఈ బిడ్డను నేను సంరక్షింపనిపక్షమున, ఈమెను జూచువా రెవ్వరు? ఈ బిడ్డకుఁ దండ్రి లేఁడు, తల్లినిఁజూడఁ బోయిన, అదిగో ఆ పిచ్చిది!' నేను ఆ బిడ్డ నెత్తుకొనినంతనే ఠాకూరు కనఁబడి యిట్లు పలికిరి: 'ఈమెయే ఆ పిల్ల, నీ జీవగఱ్ఱ, ఈమెను విడువకు, ఈమె యోగమాయ.' ''

మాతృదేవిశిష్యులలో నొక రామెను, ''అమ్మా! రాధు అనిన, అహర్నిశము మీ కింత తాపత్రయ మెందు లకు?'' అని యొకప్పుడు ప్రశ్నించిరి. సహజవినయముతో నామె యిట్లు సమాధాన మొసఁగెను: ''మేము ఆఁడువారము గదా? మా పిల్లలను ప్రేమించుట మాకు సహజము.'' ఆ సమాధానముతో నాతఁడు సంతృప్తినొందక, మఱియొక సారి అదియే ప్రశ్న వేసెను: అంత నామె యావేశపూరితు రాలై యిట్లు తెలిపెను: ''ఓయీ! నన్నుఁ బోలువారు నీ కెచ్చట కనిపింతురు? వెదకిచూడు. పరతత్త్వమును గూర్చి గాఢముగా ధ్యానించువారి యంతఃకరణము నిశితము, నిర్మలము నగును. అట్టి యంతఃకరణముతో వా రేమి చింతించినను, అతితీవ్రముగా చింతింతురు. కావున ఇతరుల కది రాగమువలెను మమకారమువలెను గనిపించును. మెఱుఁగుదీఁగ అద్దమువంటివస్తువులయందే కాని కొయ్యలలో ప్రతిఫలింపఁజాలదుకదా!''

శ్రీశారదా శ్రీరామకృష్ణుల నొండొరులతోఁబోల్చుచు, యోగేన్ మాయియు నొకప్పు డిట్లే సంశయింపసాగెను.

ఒకనాఁ డామె గంగానదీతీరమునఁ గూర్చుండి ధ్యానించు చుండ నొక దివ్యదర్శనమును గాంచెను: శ్రీరామకృష్ణుఁడు ప్రత్యక్షమై యిట్లు వచించు టామెకు వినవచ్చెను: "అదిగో, చూడు. గంగలో నేదియో తేలియాడుచుండుట నీకుఁ గనిపించుటలేదా?" (అప్పుడు పుట్టిన బిడ్డ ప్రేవులతోఁ బెనఁగొని ప్రవాహమునఁ గొట్టుకొనిపోవు టామెకు గోచరించెను.) గురుదేవుఁ డిట్లు పల్కెను: "గంగానది నేదియైనను అపవిత్రము చేయఁగలదా? గంగోదకము దేనిచేనైనను మాలిన్యము నొందునా?* ఆమెను (మాతృదేవిని) గూర్చియు నిటులే పరిగణింపుము. కలనైనను ఆమెను గూర్చి యెట్టిసంశయమును బొందకు. (తనతనువు సూచించుచు) ఇదియు నామెయు నొక్కటేయని గ్రహింపుము."

మాతృదేవి బాంధవప్రేమానురాగములను గూర్చిన యీ సమాధానములు కేవల స్వసంవేద్యమగు ననుభవములపై నాధారపడియున్న కారణమున నామె శిష్యవర్గమునకును అనుచరులకును మాత్రమే నచ్చవచ్చునని విమర్శకు లధిక్షేపింపవచ్చును. అగుచో, సర్వజన గోచరములగు తార్కాణములును గలవు: వాని నిట సంగ్రహముగాఁ దెలిపెదము.

(1) మాతృదేవి సాన్నిధ్యమును బడసినవారిలో ననేకులు సర్వసంగపరిత్యాగ మొనర్చి సన్న్యాసాశ్రమమును స్వీకరించి వఱలిరి. ఆమె యనురాగము వట్టి మమకార

* అచిరకాలముననే అనేక విషక్రిములను గంగాజలము నశింపఁ జేయఁగలదని రసాయనశాస్త్రజ్ఞులు నేఁడు కనుఁగొనియున్నారు.

మగుచో, పరులందు త్యాగవైరాగ్యములను బురికొల్పు నలౌకిక సామర్థ్య మామె కెందుండి వచ్చెను?

(2) లౌకికుల కొకవ్యక్తియెడ మమకారము వృద్ధి యైనకొలఁదియు నితరులయెడ ప్రేమానురాగములు సన్నగిల్లుచుండును. అంతియేగాక, ఒరులయోగక్షేమములయెడ వారు పెడమొగము పెట్టుదురు. కాని మాతృదేవియో, తనవారు, లాతివారు ననుభేదమును గలనైనను బాటింపక, పరులయోగక్షేమములు తనవని భావించి, ఎల్లరయందును అవ్యాజప్రేమానురాగములను జూపుచు, నిజముగా నెల్లరకును తల్లియై వర్తించెను. ఆమె ప్రేమాదరములను గాంచి పులకితాంగులై యానందాశ్రువులను విడిచిన శిష్యులనేకులు గలరు. నిజముగాఁ దమతల్లిదండ్రులైనను నామెవలెఁ దమ్ము ప్రేమించియెఱుఁగరని పలువురు వక్కాణించియున్నారు.

(3) మాతృదేవియే యిట్లు వచించుచుండెడిది: "రాధియెడ నా ప్రేమబంధము బుద్ధిపూర్వకముగా నేను గల్పించుకొనినదే", లేదా, "లవలేశమైనను నా మనస్సు రాధిపైన నిలువదు, నేనే బలాత్కారముగా ఆమెపై నిలుపుదును. 'ప్రభూ! అనుగ్రహించి నా మనస్సును గొంచెము రాధిమీఁదికి మఱలింపుఁడు. లేనిచో, ఆమెను సంరక్షించువా రెవ్వరు?' అని గురుదేవుని ప్రార్థింతును."

ఇందలిసత్య మామెయవసానకాలమున నెల్లరకును విస్పష్టముగా గోచరించెను. లౌకికుల కామరాగములు అత్యంతబలీయములై యుండుసమయము అవసానసమయము గదా? ఆప్తులును తమ ప్రేమపాత్రులును తమ ప్రక్క

నుండవలయునని వా రా సమయమున కాంక్షింతురు. కాని మాతృదేవి యా సమయమున రాధును, ఇతరసన్నిహితులను జయరాంబాటికిఁ బంపివేయుఁడని పదేపదే తనయనుచరులతోఁ జెప్పెను. వారిపసిబిడ్డలు తనశయ్యను సమీపించినపుడు సైతమామె వారినిఁ దొలఁగింపుఁడని పలికెడిది: తన మనస్సును వారినుండి మఱల్చివైచుకొంటిననియు వారు తనయెదుట నుండుట దుస్సహమై యున్నదనియుఁ దెలిపెడిది.

పురాణప్రసిద్ధమగు జడభరతుని వృత్తాంతముతో ఈ సంఘటనములను బోల్చిచూచినచో, మాతృదేవి నిర్మమతయు నిస్సంగతయు నెట్టివో విశదము కాఁగలదు. *

---

* అతఁడు తాను బెంచిన లేడిపిల్లనుగూర్చి మోహపాశబద్ధుఁడై తదేకధ్యానముతో ప్రాణములు విడిచి, మఱుజన్మమున లేడియై పుట్టెను; ఉత్తరజన్మమున నాతఁడే జడభరతుఁడై, ముక్తుఁడై యొప్పెను.



## పదునాలవ ప్రకరణము

## గురుత్వము

విరిసిన పూవుల పరిమళములచే, తేనియలచే ఆకృష్టములై వాని నాను తమకమునఁ దేనెటీఁగల గణములు వానికడ కరుదెంచును. హృదయవికాసమును గాంచిన మహనీయుల సౌశీల్యమాధురీసౌరభములచే నాకర్షణమంది వారల బోధామృతమును గ్రోలు తమకమున ముముక్షుజన బృందములు వారికడ కరుదెంచును.

శిష్యులను గూర్చుకొనుటకై ప్రాఁకులాడు గురువులు శిష్యవిత్తాపహారకులుగాని శిష్యహృత్తాపహారకులు గారు. తత్త్వజ్ఞానసంశోభితులగువారే సద్గురువులు. వారే బోధగురువులు, ఇతరులు 'బాధగురువులు'. సద్గురువులు పండితులుగాఁ గాన్పింపకున్నను బాధ లేదు. వారు శాస్త్ర పండితులుగారని హతాశులము గానక్కఱలేదు. ఏల? జీవనజ్యోతియగు జ్ఞానమున వారి కెన్నఁటికైనను గొఱంత గలుగునా? పుస్తకములలోఁ గల జ్ఞానమునంతటిని మించు దివ్యజ్ఞానము – సాక్షాత్కారరూపమగు తత్త్వజ్ఞానసంపద – వారికడ అపారముగా, అనంతముగా వెలయుచుండును. అట్టిమహనీయులు సంసారముననున్నను, సంసారము వారిలో నుండదు; లౌకికకృత్యముల నొనర్చుచు, తాపత్రయ మందుచున్నట్లు కాన్పించినను, వారియంతరంగమున అలౌకిక శాంతి విహరించుచుండును. బాహ్యమున అల్లకల్లోలము గోచ

రించినను, సాగరగర్భమున అనంతశాంతి విరాజిల్లుచుండును గదా!

మాతృదేవిజీవితమే మన కింములకు నిదర్శనము. ఆమె జీవితోత్తరభాగమున నిరుతెఱంగుల వ్యక్తులు—ఒక వైపున బంధుజాలము, మఱియొకవైపున శిష్యవర్గము—ఆమె నాశ్రయించుకొనియుండుట కాననగును. ఐహిక ఫలాపేక్షచే బంధువు లామెయండఁ జేర, నామె సాన్నిధ్యసంసేవనములవలన ఆత్మశ్రేయమును బడయనెంచి శిష్యు లామె నాశ్రయింపసాగిరి. మానవత్వమును దివ్యత్వమును అత్యద్భుతరీతి నామెవ్యక్తిత్వమున సమన్వయమంద, నొకవైపున లౌకికులగు బంధుగులకును మఱియొకవైపున ముముక్షువులగు శిష్యులకును గూడ నామె సమాశ్రయమై యొప్పెను. వివిధసందర్భములలో మాతృదేవి నుడివిన వాక్కులే యివ్విషయమును బలపఱచుచున్నవి. ఆమెవచనముల నరయుఁడు:

(సోదరుల నుద్దేశించుచు) "ఎంతసేపు డబ్బుకోసమే వారి దేవురింపు. ఎన్నఁడైనను—ప్రమాదవశముననైనను—భక్తిజ్ఞానముల నిమ్మని న న్నడిగిరా?" "దైవసాక్షాత్కారము నాకు కరతలామలకము." "సంసారకృత్యములలో మునిఁగి తేలుచున్నను—ఎపుడు కోరుదునో అపుడు—ఇదంతా మహామాయాలీలయని త్రుటిలో గ్రహింతును." "నన్ను మీ బంధువురాలిఁగాఁ దలఁపకుఁడు, సంకల్పమాత్రముననే యీ శరీరమును విడువఁగలను." "నేను జీవించియున్నంతవఱకు నా వాస్తవస్వభావమును ఎవ్వరును దెలిసికోఁజాలరు...."

ఆమె వ్యక్తిత్వమందలి దైవమానవప్రకృతులు నిజముగా నామెమాతృత్వమున ఏకమై దేదీప్యమానమై వెల్గొందుచున్నవి. మాతృభావమే యామెజీవితగాన మాధుర్యమనియుఁ జెప్పనగును. కలనైనను ఫలాపేక్ష నెఱుఁగని మాతృభావము—కృతఘ్నతయు హింసయు ప్రతిఫలమై కానవచ్చినను మార్పు నొందని మాతృభావము—ఆమె బాంధవప్రేమానురాగనిలయమై యెటు లొప్పెనో గమనించి యున్నాము. ఈ మాతృభావమే యామె గురుత్వమునకును ప్రేరణశక్తియై ప్రకాశించెను.

గురుశిష్యుల పరస్పర సంబంధము అతి పవిత్రము, అలౌకిక ప్రేమబద్ధము, అత్యంతసన్నిహితము. గురుకటాక్ష మూలమున పరమేశ్వరానుగ్రహము దనపైఁ బ్రసరించి మోక్షమును దనకు కరతలామలకమొనర్చునని శిష్యుఁడు భావించును, కావుననే గుర్వాజ్ఞ నాతఁడు తలఁ దాల్చును. అగుచో, గురువగు నాతఁ డెట్టివాఁడై యుండవలయును? వేదశాస్త్రసారవేత్త, పావనాత్ముఁడు, కామవిరహితుఁడు, బ్రహ్మవేత్తలలో మేటియునై యలరారు మహనీయమూర్తియై* యుండవలయును. కావుననే గురుని మానవమాత్రునిగా గణింపరాదనియు, సాక్షాద్భగవదవతారమూర్తిగాఁ గనవలయుననియు శాస్త్రములు చెప్పుచున్నవి.†

* "శ్రోత్రియోఽవృజినోఽకామహతో యో బ్రహ్మవిత్తమః."

—వివేక చూడామణి, 33.

† "ఆచార్యం మాం విజానీయాన్నావమన్యేత కర్హిచిత్,
న మర్త్యబుద్ధ్యాసూయేత సర్వదేవమయో గురుః."

—భాగవతము.

"తన గురు నెవ్వఁడు మానవమాత్రునిగా గణించునో అట్టి వాఁ డెన్ని జపతపములు చేసినను, అన్నియు నిష్ఫలములు" అని శ్రీరామకృష్ణపరమహంస పలికియున్నాఁడు.

శిష్యున కుపదేశించునపుడు గురు వెంతటిమహా బాధ్యతను వహించునో మాతృదేవి వచనములవలననే మనకు వెల్లడి కాఁగలదు. స్వానుభవము నిటు లామె తెల్ల మొనర్చెను: "గురునిశక్తి మంత్రద్వారమున శిష్యునియందు ప్రవేశించును; కావుననే ఉపదేశసమయమున శిష్యుని పాపములను గైకొని తత్ఫలముగా గురువు విశేషమైన శరీరబాధల ననుభవించును — వ్యాధులఁ బొల్పడును. గురుత్వము వహించుట కష్టముల కెల్ల కష్టము. * ఏమన, శిష్యుని

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః,
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః."
—శుకోపనిషత్తు.

* ఒక భక్తునితో మాతృదేవి యొకప్పు డిట్లు వచించెను: "ఎవరి బాధ్యతను నాపైఁ బెట్టుకొనియున్నానో వారందఱును బంధవిముక్తులు కానిదే, ఈ శరీర పతనానంతరమైనను నాకు ముక్తికలుగుననుకొనుచున్నావా? సదా నేను వారిచెంత నుండవలయును. వారివిషయమున సమస్తమైన మంచిచెడ్డలకును నే నుత్తరవాదినిని. మంత్రోపదేశము చేయుటనిన మాటలా? ఎంత బ్రహ్మాండమైన బాధ్యతను మేము వహింపవలయును! వారికోసము ఎంత తాపత్రయపడవలయును! చూడు, మీ నాయన గతించెనుగదా, నీ విషయమై నే నెంతో బెంగ పెట్టుకొనియున్నాను... ఈ పరీక్షనుండి నీవు బయటఁబడవలయునని సదా (దేవుని) ప్రార్థించుచున్నాను... నేను జెప్పినదంతయు నీకు అరమగునా? ఐనపక్షమున నా బాధ చాలవఱకుఁ దొలఁగును. శ్రీ గురుదేవుఁడు తన వేర్వేఱుబిడ్డలతో వేర్వేఱువిధములుగాఁ గ్రీడించుచున్నాఁడు, ఐనను ఈ భారమును నేను వహింపవలసియున్నది."

పాపబాధ్యతను గురువు భరింపవలయును, బాధపడవలయును. కాని, ఉత్తముఁడగు శిష్యుఁడు గురువునకుఁ దోడ్పడును. కొందఱు శిష్యులు శీఘ్రముగా వికాసము నొందుదురు, కొందఱు మెల్లఁగాఁగాని పొందరు. అంతా పూర్వకర్మ ఫలితమైన సంస్కారముల ననుసరించి నడచును. ఇందు వలననే రాఖాల్ (బ్రహ్మానందస్వామి) ఎవ్వరికైనను ఉపదేశించుటకు అంతగా సంకోచించుచుండుట. నాతో నాతఁడిట్లనెను: 'అమ్మా! శిష్యుని కుపదేశింపఁగనే నాకు అస్వస్థతగా నున్నట్లు తోఁచును. మంత్రముమాట చెప్పినంతనే నాకు జ్వరము వచ్చినట్లు తోఁచును.' "

బ్రహ్మానందస్వామి యెంతయు నరుదుగా నుపదేశించుట కిదియే కారణముగావచ్చును. అందువలన మంత్రదీక్ష నపేక్షించిన భక్తులం దధికసంఖ్యాకులు మాతృదేవియొద్దకుఁ బంపఁబడువారు. ఏలన, తనకు బాధ కలుగవచ్చునను భావము సంసారపరితప్తులకు ఆశ్రయ మొసఁగుపట్ల నామె కెన్నఁడును గణనీయము కాదయ్యె. మాతృదేవి వాత్సల్యాతిశయము నెంచి ప్రేమానందస్వామి యొకప్పు డిట్లు పలికెను: "మనము హరించుకోఁజాలని విషమును అమ్మ కడ కంపుచున్నాము. ఎట్టిపాపులకైనను ఆమె తనయాశ్రయము నొసఁగుచు, వారల పాపములనుగైకొని స్వయముగా భరించు చున్నది."

తా ననుభవించిన తీవ్రశరీరబాధలును వ్యాధులును శిష్యులనుండి తాను గ్రహించిన పాపములకు ప్రతిఫలములని మాతృదేవి విశ్వాసము. దర్పణనైర్మల్యప్రకాశములు లేశ

మగు కళంకముచేనైనను బాధితమగు చందమున, ఆకృతినిఁ దాల్చిన పవిత్రత యనఁదగు నామెశరీరము పాపమనో మాలిన్యముల స్పర్శ సోఁకినంతనే తీవ్రబాధనందు టబ్బురము కానేరదు. పాపప్రవృత్తులతోఁగూడిన జను లామె పాదములనుదాఁకఁబోయినచో, అప్రయత్నముగా నవి చట్టున ముడుచుకొనెడివి. ఎట్టులైనను అట్టివా రామెపాదములను స్పృశించినచో, శరీరము మంటలెత్తి, నామె బాధపడుట శిష్యు లనేకపర్యాయములు కనియున్నారు. 1916-వ సంవత్సరమున బేలూరుమఠమున నామె దుర్గాపూజను గాంచిన సమయమున అసంఖ్యాకులైన జనులామెకు ప్రణమిల్లి పాదములను స్పృశించిరి. అనంతర మామె గంగాజలములతోఁ దన పాదములను మఱల మఱలఁ గడుగుకొనసాగెను. యోగేన్‌మాయి యది గాంచి యిట్లని వారింపఁబోయెను: "అమ్మా! అది యేమి? నీటిలో పాదము లట్లు నానుటవలన జలుబు చేయదా?" మాతృదేవి యిట్లు సమాధాన మొసఁగెను: "యోగేన్! నీకుఁ దెలియదు. కొందఱు నా పాదములను తాఁకుదురు. అపుడు నాకెంతో హాయిగానుండును. మఱి కొందఱు తాఁకిననో, కందురీఁగ కుట్టినట్లు పాదములు మంట లెత్తును. ఆతాపము కొంచె ముపశమించుటకుఁగాను గంగాజలములతో వానిని ప్రక్షాళన మొనర్చుకొందును."

ఈ సంఘటనమునకు ప్రబలనిదర్శనమును జయరాంబాటిలోఁ దాను గాంచినట్లు మఱియొకశిష్యుఁడు తెలుపుచున్నాఁడు. అపుడు మాతృదేవికి పరిచర్య నొనర్చుచుండిన శిష్యుఁడు బయటికి వెడలియుండెను. అతఁడు మఱల వచ్చి

చూచుసరి కామె పంచాదియరుగునఁ దుంగచాపపైఁ బండు కొనియుండెను. శిష్యునిఁ గాంచి యామె యిట్లు తెలిపెను: "ఒక నడిమివయస్సుమనుష్యుఁడు మఱియొకరితో నిక్కడకు వచ్చినాఁడు. దూరమునుండి నే నాతనిఁ జూచి గదిలోనికి వెళ్లి మంచముమీఁదఁ గూర్చుంటిని. పాదములను స్పృశించి ప్రణామముచేయవలెనని ఆతనికి ఆతురత. వద్దని నేను వెనుకకు తగ్గినను, వినక యాతఁడు బలవంతముగా నాపాదములను తాఁకి నాఁడు. ఆ క్షణమునుండియు నా పాదములందును కడుపులోను అపరిమితబాధవలన యమయాతన ననుభవించుచున్నాను. మూఁడునాలుగుసార్లు పాదములను గడుగుకొంటిని గాని యీ మంట తగ్గుటలేదు. నీవిక్కడ నుంటివేని, నా సంజ్ఞవలన ఆతని నా పాదములను తాఁకకుండ వారించియుందువు."

మాతృదేవి కలకత్తాలో నివసించునపుడు—ముఖ్యముగా జనసామాన్య మామెను సందర్శించి ప్రణామమొనర్ప నంగీకరింపఁబడు దినములలో—శిష్యు లిట్టి సంఘటనములను దఱచు కనుఁగొనువారు. కాని యామె తన బాధలనుగూర్చి యెవ్వరికైనను జెప్పునెడల నిట్లు హెచ్చరించుచుండెడిది: "శరత్ (శారదానందస్వామి) తో మాత్రము ఈ సంగతిఁ జెప్పఁబోకుఁడు. చెప్పితిరా, అతఁడు జనులను రానీయకుండఁ జేయును" తన కెంతటిబాధలుకలిగినను, ఆత్మశాంతిని బడయఁగోరి తన్ను సందర్శింపవచ్చు జనుల కాటంకము కలుగుటనిన, ఆమె సహింపఁజాలదయ్యె.

నిజముగా పరులనిమిత్తము బాధపడుట నామె తన యనన్య సామాన్యమగు హక్కుగా పరిగణించెను. మాతృ

దేవికి బాధకలుగవచ్చునను కారణమున నొకప్పుడొక శిష్యుఁ డామెపాదములను స్పృశింప సంశయించుచుండ నామె యిట్లు పలికెను : "బిడ్డా! భయపడకు. మేమిందుకోసమే జన్మించి నాము. పరులపాపములను దుఃఖములను గైకొని మేమే భరింపనిపక్షమున మఱెవ్వ రటులఁ జేయుదురు? మఱెవ్వారు పాపుల—దుఃఖితుల—బాధ్యతను వహింతురు?" అంత్య దశలో నామె వ్యాధిగ్రస్తురాలై యెంతయో కృశించి యుండ, శిష్యు లామె తేఱుకొనినపిమ్మట నిఁక నెవ్వారికిని ఉపదేశ మొనర్పనీయరాదని తమలోఁ దా మనుకొనుచుం డుట విని మాతృదేవి యిట్లు పలికెను : "ఏమేమి? శ్రీ పరమ హంస కేవలము రసగుల్లలను (ఒకవిధమైన పాలపిండివంట) ఆరగించుటకే వచ్చెననుకొనుచుంటిరా?"

మాతృదేవి యొకప్పుడు మన్నెపుజ్వరముచే బాధ పడుచుండ నొకభక్తుఁ డామెయొద్ద మంత్రదీక్ష నొందుటకై బారిసాల్ అను దూరప్రదేశమునుండి వచ్చెను. తనస్థితి నెంచి తనయనుచరుఁడగు శారదానందస్వామి గావించిన నియమము ననుసరించి శిష్యు లాతని నిరాకరించిరని మాతృదేవి తెలిసి కొని యఖండప్రేమావేశముతో నిట్లు ఘోషించెను : "వల దనుటకు శరత్ (శారదానందస్వామి) ఎవరు? నేనిందులకై జన్మించినాను. ఓయీ, నేఁడేమైన భుజింపుము. రేపు నీకు ఉపదేశము చేయుదునులెమ్ము." ఏలన, ఉపదేశమునొంద నిదే భుజింపనని యా భక్తుఁడు దీక్ష వహించియుండెను.

లోకవ్యాప్తము, లోకాతీతము నగు దివ్యమాతృ ప్రేమానురాగములచే, సర్వజనకారుణ్యముచే, ఆమె

తన్నర్థించిన వారికెల్ల మంత్రోపదేశ మొనర్పసాగెను. ఇవ్విషయమై మాతృదేవియే యొకప్పు డొకశిష్యున కిట్లు తెల్పియున్నది: "నాయనా, ఇక్కడికి వచ్చువారిలో అనేకులు దేనికైనను వెనుదీయరు, వారు చేయని పాపమే లేదు. కాని, వా రిక్కడకు వచ్చి నన్ను 'అమ్మా' యని వేఁడుకొని నంతనే నే నన్నిటిని మఱచిపోవ, అర్హత గలదానికంటె అదనముగా వారు నావలనఁ బొందుచుందురు."

మాతృదేవి యౌదార్యమునుగూర్చి విమర్శించుచు యోగేన్‌మాయి యొకప్పుడు పరిహాసపూర్వకముగా నిట్లు పలికెను: "గురుదేవునిశిష్యులను జూడుఁడు. వారిలో ప్రతి వ్యక్తియు ఆధ్యాత్మికసింహము. కాని మీ శిష్యులసంగ తియో అమ్మా!" మాతృదేవి యిట్లు సమాధానించెను: "ఆశ్చర్య మేమి? బిడ్డలలో ఉత్తమోత్తములైనవారిని ఆయన ఎన్నుకొనిరి. అఖండజాగరూకతతోఁగదా వారిని ఆయన ఏర్చికూర్చుకొనిరి! కాని నా వైపునకో, ఈ చీమల బారునంతయుఁ ద్రోసిరి! నా శిష్యులను ఆయన శిష్యులతోఁ బోల్పఁబోకుము." ఐనను తనయుపదేశతత్త్వ ప్రయోజన ములనుగూర్చి ఆమె యొకశిష్యున కిట్లు తెల్పెను: "నే నీయ వలసినదంతయు ఉపదేశసమయముననే ఇచ్చియున్నాను. వెనువెంటనే చిత్తశాంతి కావలయునందువా, నియమిత మగు సాధనలను చేయుము. లేదా, శరీరపతనానంతరము మాత్రమే నీకు శాంతి లభింపఁగలదు." తనశిష్యుల శ్రేయోభివృద్ధికై అనుదినము తాను గురుదేవుని ప్రార్థింతు ననియు ఆయనమూలమునఁ దాను గ్రహించిన మంత్రముల

వలన నెవ్వరైనను ముక్తి నొందుట నిస్సంశయమనియు వేఱొకశిష్యునితో నామె వచించెను.

నిజముగా శిష్యులశ్రేయమునుగూర్చి మాతృదేవి వహించిన శ్రద్ధ నిరుపమానము. ప్రతిదినము ఆమె శిష్యుల నిమిత్తమై ఎంతయోసేపు జపమొనర్చును. అంత్యదశలో విశేషవ్యాధిగ్రస్తురాలై యుండ, ధ్యానమునకుఁ గూరుచుండఁ జాలని స్థితిలోనున్నను, ఆమె జపమొనర్చుచుండుట శిష్యులు గాంచియున్నారు. రాత్రి రెండుగంటలకామె లేచుచుండుట గాంచి యొకశిష్యుఁ డామెను, "అమ్మా, మీకు నిద్ర పట్టుటలేదా?" యని ప్రశ్నింప నామె యిట్లు సమాధాన మొసఁగెను: "నాయనా! నిద్ర పట్టుటెట్లు? ఈ బిడ్డలంద ఱును ఎంతో ఆత్రముతో వచ్చి ఉపదేశము నొందుదురు. కాని వీరిలో అనేకులు నియమముగా జపముచేయరు. కాని నేను వారిబాధ్యతను గ్రహించినాను గాన వారిశ్రేయమును జూడవలదా? అందుచే వారినిమిత్తము జపించుచు, నిరంత రము గురుదేవు నిట్లు వేఁడుకొనుచుందును: 'దేవా! వారికి జ్ఞానదీప్తిని గలిగింపుఁడు. మోక్షము నిండు, దుర్భరము సంసారదుఃఖము. వారు మఱల జన్మింపకుందురుగాక!'"

ఉపదేశమునకై మాతృదేవిని సమీపించిన వందల కొలఁదిజనులలో నిరాకరింపఁబడిన మందభాగ్యులే పది పండ్రెండుగురు మాత్రమో ఉండినట్లు తెలియవచ్చుచున్నది. వారినైనను బహుశః ఆమె పరీక్షించుటకై నిరాక రించెననియు వారా పరీక్షకు నిలువఁజాలకపోయిరనియు గ్రహింపనగును. ఒక యువకునివిషయమై ఆమె యిట్లు

వచించియున్నది : "శిష్యత్వము నర్థించువానిని గురువు పదేపదే వెడలఁగొట్టవచ్చును. నిజముగా గుర్వనుగ్రహము కోరువాఁడు బిచ్చమెత్తుకొనియైనను — ఎంతదూరమునుండి యైనను — గురుసన్నిధికి వచ్చును...."

స్వీయబాధలనైనను సరకుగొనక ముముక్షువుల కుపదేశించుటయందేగాక, భోజనాదిసమస్త సదుపాయములను సమకూర్చుటయందామె మాతృభావము సముజ్జ్వలమై దీపించెడిది. ఆమెవాత్సల్యమును గాంచి శిష్యులు ఆనందపారవశ్యమును గాంచువారు. బాల్యమునఁ దల్లినిఁ గోల్పోయిన యువకులు — తల్లిప్రేమయన నెట్టిదో యెఱుఁగనివారు — అనేకులు మాతృదేవిసాన్నిధ్యమునొందినంతనే, 'ఆహా! మా యమ్మను గనుఁగొంటిమి' అని బ్రహ్మానందమున నోలలాడువారు. తమతల్లియైనను దమ్మట్లు ప్రేమించియెఱుఁగదని కృతజ్ఞతాశ్రువులను విడిచిన శిష్యులు కలరు. "నావంటిపుత్త్రులు మీకు అనేకులు కలరు. కాని మీవంటితల్లి నాకు లేదు" అని యొకశిష్యుఁ డామెతో వచించెను. జయరాంబాటిలో నుండ, తనయొద్దకు శిష్యులు వచ్చుచో, ఆరోగ్యముగా నున్నంతకాలము స్వయముగా వండి, వారికి వడ్డించి, వారల యెంగిళులనుసైతము పట్టుపట్టియెత్తెడిది. తాము వచ్చినంతనే తమబడలిక దీరుటకై మాతృదేవి తమకు విసరుట, ప్రక్షాళనమునకై పాదములపై నీరు పోయుట మున్నగు కార్యములను సహింపఁజాలక వారు ప్రతిఘటింపఁబోవ, వినిర్మలమనోభావమున ప్రేమమీఱ నామె యిట్లు పలికెడిది : "మీకు నేను జేసిన దేమున్నది?

మీ అమ్మను గానా నేను? తనబిడ్డకు సర్వవిధములను సేవ చేయుట — తుదకు స్వయముగా చేతితో మాలిన్యము నెత్తుట తల్లిహక్కుగాదా?'' ఇం దతిశయోక్తి ఆవంతయు లేదు, ఏలన మాతృదేవి కలకత్తాలో నుండఁగా, నొకప్పు డొకభక్తురాలిబిడ్డ గదిలోని తివాసిని మలినముచేయ, భక్తురా లెంత ప్రతిఘటించినను, గణింపక, మాతృదేవియే దానిని శుభ్రమొనర్చెను. వినయసందీపితములగు మాతృదేవి ప్రేమానురాగములను గాంచి భక్తురాలు నిశ్చేష్టురాలయ్యెను.

తేయాకుపానీయమున కలవడిన యేశిష్యునికోసమో, వ్యాధిగ్రస్తుఁడైన యేభక్తునికోసమో పాలను సంపాదించుటకై ఉదయమున మాతృదేవి యింటింటికి వెడలుచుండుట జయరాంబాటిలో సర్వసాధారణముగా గోచరించుదృశ్యము. వ్యాధిగ్రస్తుల కామె తల్లికంటె నెక్కువగా సమస్తపరిచర్యల నొనర్చెడిది. చేతిలోఁ గురుపులు వేసిన యొకశిష్యుని కామె స్వయముగా బహుదినములపర్యంతము అన్నము తినిపించెను. ఏ ప్రియశిష్యునిరాకనో నిరీక్షించుచు నామె యంతకు మునుపు చేయఁబడిన మిఠాయిలను దాఁచియుంచును. భక్తపరిపోషణమనిన నామెకు బ్రహ్మానందము. * భోజనసమయ

* ఒకప్పుడు మాతృదేవిని సందర్శింపవచ్చిన శిష్యుఁడును యువకుఁడునగు నొకసన్న్యాసి యేదియో పనినిమిత్తము బయటికి వెడలెను. ఆతఁడు వచ్చుసరి కించుమించుగా సాయంకాలమయ్యెను. కాని యాతఁడు వచ్చువఱకును మాతృదేవి భుజింపదయ్యెను. పుత్త్రుఁడు భుజింపనిదే తల్లి యెట్లు భుజించుట? ఆ సన్న్యాసి యామె ప్రేమానురాగములను గాంచి నిశ్చేష్టుఁడయ్యెను.

మున నెవ్వరు వచ్చినను భుజింపనిదే వెడలనీయకుండు టామె స్వభావము. కలకత్తాలో మాతృదేవి గృహకృత్యములను నిర్వహించుచుండిన గోలాప్‌మాయి యీ కారణముననే మొఱలిడుచుండెడిది. ఏలన, ఆగంతుకముగా వచ్చువారికై యామె సర్వదా అన్నపానీయములను సిద్ధమొనర్చుకొని యుండవలసివచ్చెడిది. "'అమ్మా!' యనుచు, మీవద్దకెవ్వరు వచ్చినను మీరు వారి కిచట ఆతిథ్యమొసఁగుదురు" అని యామె మొఱలిడును. భోజనేతరసమయములలో వచ్చు వారికి మాతృదేవి మిఠాయిలను, పండ్లను, పానీయములను, అథమము రెండుమూఁడు తములపాకుల చిలుకలను అఖండాదరముతో నొసఁగి వారలను సంతోషసాగరమునఁ దేల్చును. భక్తులు సమర్పించు వస్తువులను — అత్యల్పమగువానిని సైతము — హృదయపూర్వకమగు నానందముతో నామె స్వీకరించును. ఏ దివ్యమధురాహారమునైనను దన కెవ్వరేని సమర్పించినచో, దా నిసుమంతయుఁ దినక, శిష్యుల కోసమును భక్తులకోసమును దాచియుంచు టామెయలవాటు. ఇట్లు తనకు సమర్పింపఁబడు కానుకలలో నొకభాగము సింహవాహినీదేవి మున్నగు దేవతలకును మఱియొకభాగము ఇరుగుపొరుగువారికిని బంధుగులకును మిగిలినది భక్తులకును శిష్యులకును వినియోగించు టామెయాచారము. సదా ఒరుల కిచ్చుటయేకాని తాను మిగుల్చుకొను టెట్టిదో ఆ తల్లి యెఱుఁగదయ్యె.

శిష్యులును భక్తులును జయరాంబాటికి వచ్చినచో, రెండుమూఁడుదినములైనను, అట నుండి విశ్రాంతినొందుఁడని

యామె పట్టుపట్టును. "ఇచటికి వచ్చుటనిన, జను లెంతో శ్రమపడవలయును. కాశీని, గయను దర్శించు టింతకంటె సులభము" అని యామె వచించును. శిష్యు లెవ్వారైనను తనయొద్ద సెలవుగైకొని వెడలఁబోవునపు డామెబిడ్డల నెడఁ బాయు తల్లివలె చింతించును. అత్తఱి నామె వారినిఁ గొంత దూర మనుగమించును; కన్నీరు విడుచుచు, చూపుమేర మీఱు పర్యంతము వారిని అవలోకించును, ఇటు లవలోకించుచు నామె వానలోఁ దడిసిన సమయములు కలవు.

ఇట్టి మాతృదేవి ప్రేమానురాగములను గాంచిన శిష్యులకు "ఇహపరశ్రేయము మనకు కరతలామలకము" అనిపించు టబ్బురము కానేరదు. ఆమె యాత్మప్రతిభను గూర్చి కాని, యాధ్యాత్మికశక్తులనుగూర్చి కాని తెలిసికొనుటకై వా రారాటపడలేదు. పాదతలమును దాఁకినంతనే ధన్యులమైతిమని సంతసించిరేకాని యా హిమాలయశిఖర మెంత యున్నతమైనదో తెలియుటకు వా రాందోళన మొందలేదు. ఆమె స్వభావవర్తనములు పతితులకుసైతము ధైర్యమును బురికొల్పెను.

మలినాత్ముల స్పర్శవలన మాతృదేవి యెట్లు దుర్భర శరీరబాధల నందెడిదో గమనించియున్నాముగదా? ఇది యట్లుండ, సెలవుదినములందును పర్వదినములందును వందల కొలఁదిజను లామెచరణోపాంతమున కుసుమవసనాదులను సమర్పించునెడ గంటలతరబడిని ఆలయమందలి ప్రతిమవలె నామె కూరుచుండవలసి వచ్చెడిది. కలకత్తాలో ముఖ్యముగా స్త్రీబృందము ఏ పుత్త్రప్రాప్తినిమిత్తమో, ఏ వ్యాధినివార

ణార్థమో, మఱి యే కుటుంబాదాయవృద్ధినిమిత్తమో మాతృదేవిని సందర్శింప నామె వారికష్టకథలనన్నిటిని అనంతసహనముతో నాలకించెడిది. వారిలో ననేకుల కామె యనుగ్రహమున నీప్సితార్థము సిద్ధించుచుండెననియుఁ దెలియవచ్చెడిని.

కాని, పారమార్థికావేశమున వివేక మడుగంటిన భక్తిమూర్తులు కొందఱు మాతృదేవికి శ్రమకలిగించినవారిలో ప్రధానగణ్యులని చెప్పవలసియున్నది. ఈ లోకాతీతులచర్యల కొకటి రెండు నిదర్శనములను దెలుపుట యప్రస్తుతము గానేరదు. ఉద్బోధనకార్యాలయమున మాతృదేవి యొకనాఁడు తననిత్యపూజను సరిగా ముగించుసరికి, ఒక భక్తుఁడు పుష్పాంజలియై యామెను దర్శింపవచ్చెను. ఆ నూతనపురుషునిఁ గని యామె యొకపచ్చడమును గప్పుకొని, పాదములను నేలనుమోపి, శయ్యపై గూరుచుండెను. భక్తుఁ డామెపాద సన్నిధినిఁ బూవులను సమర్పించి యనంతర మామెయెదుటఁ గూర్చుండి ప్రాణాయామము మొదలిడెను. ఆతఁడు తన గొడవయేకాని మాతృదేవి కచట తన యునికివలన నెంత యిబ్బందిగా నుండెనో గమనింపఁడయ్యె. ఇంతలో గోలాప్ మాయి యచటికి వచ్చుట తటస్థించెను. క్షణములో పరిస్థితులను గ్రహించి వాని నామె పూరకరేచకపు టట్టహాసము నుండి లేవఁగొట్టి తీవ్రముగా నిట్లు మందలించెను: ''కట్టబొమ్మ యెదుటఁ గూర్చుంటివనియా నీ యభిప్రాయము? నీ ప్రాణాయామ సాధనలచే ఆ బొమ్మకు చైతన్యముగలిగింతమనియా నీ ఉద్దేశము? మతి లేదా నీకు? అమ్మకు ఉక్కపెట్టుచున్న దనియైనా ఆలోచింప నక్కఱలేదా?''

మఱియొకనాఁ డొకభక్తుఁడు మాతృదేవికి ప్రణామ మొనర్చుచు, తనతలతో నామెబొట్టనవ్రేలిపై దిబ్బునఁగొట్టెను. దుర్భరబాధచే నామె కుయ్యిడెను. అపు డామెసన్నిధి నున్నవా రాతని నెందుల కట్లు చేసితివని యడుగ, బాధమూలమున నామె తన్ను జ్ఞప్తి నుంచుకొనుటకై బుద్ధిపూర్వకముగనే యట్లు బాధించితి నని చెప్పినాఁ డా బుద్ధిమంతుఁడు!

భక్తులనఁబడువారి యీ యున్మత్తచేష్టల కన్నిటికినిఁ దాళుచు, గురుత్వమను మహాకార్యభారమును మాతృదేవి చిరకాలము వహించెనన్నచో, ఆమె కెట్టి యలౌకికసహనము ఉండియుండవలయునో, ఆమె యెట్టి ప్రేమస్వరూపిణియై యొప్పెనో ఊహింపనగును.

మాతృదేవి యుపదేశవిధానమునుగూర్చి ముచ్చటింపవలసియున్నది. ఔదార్యమే యిందును ఆమె ప్రధానలక్షణమై దీపించెను. శిష్యునకు ఉపదేశించుటకు ముందు వానికుటుంబ సంప్రదాయము శైవమో, వైష్ణవమో, శాక్తేయమో, వానియభీష్ట మెట్టిదో — మున్నగువిషయములనుగూర్చి పర్యాలోచించు టామె యాచారము. శిష్యుఁడు తన మార్గమును, ఇష్టదైవమును ఇట్టివని చెప్పినను, ఆమె తఱచు ధ్యానమొనర్చి యవి యెంతవఱకు వానికి యోగ్యమో దివ్యదృష్టిచేఁ గనుఁగొనుచుండెడిది. ఆమె వినిర్మలమానసమున నయ్యెడ శిష్యునకు శ్రేయోదాయకమగు మంత్రము భాసించును. శిష్యుఁడు పవిత్రుఁడై నిజమగు ముముక్షువై యుండెనేని మంత్రము వెనువెంటనే గోచరించును. ఇతరులవిషయమునఁ గొంచెముసేపు పట్టును.

ఈ యంతరవలోకనసమయమున మాతృదేవి శిష్యుల భావిపారమార్థికస్థితినిఁ గాంచుచుండెడిదనియుఁ దెలియనగును. శ్రీరామకృష్ణమఠమున ప్రసిద్ధుఁడగు నొక యతివర్యుని జీవితమునుండి యిందుల కొకనిదర్శనము: ఆతఁడు విద్యార్థియైయుండఁగా మాతృదేవియొద్ద మంత్రోపదేశము నొందెను. సన్న్యాసస్వీకరణమునుగూర్చి యా సమయమున నాతనికిఁ దలఁపే లేదు. గురుదక్షిణరూపమున ఉపదేశానంతర మాతఁడు మాతృదేవికిఁ గొన్ని పూలను పండ్లను ఒక రూప్యమును సమర్పించెను. సన్న్యాసులయొద్ద ధనము గైకొనఁజాలనని మాతృదేవి పలికెను. తాను లౌకిక జీవనము చేయుచున్న విద్యార్థిననియు, సన్న్యాసిని గాననియు ఆతఁడు నొక్కి చెప్పినను, మాతృదేవి ముందు తెల్పిన కారణముననే ధనమును స్వీకరింప నిరాకరించెను. శిష్యుఁడు ముమ్మాఱివ్విషయమై జ్ఞప్తికిఁ దేఁ బ్రయత్నించినను ముమ్మాఱును అదియే యామెసమాధానము. కొలఁదిసంవత్సరములైనంతనే ఆతఁడు నిక్కముగా శ్రీరామకృష్ణాశ్రమమున యతివరేణ్యుఁడై వఱలెను. ఆతనిభావిదశను ఉపదేశసమయముననే యామె కనుఁగొనియుండుట తెల్లముకదా!

గురుధర్మనిర్వహణమున మాతృదేవి సామర్థ్యము ఆశ్చర్యకరము. ఒకశిష్యుఁ డున్నట్టుండి నెలలపర్యంతము దినమునకుఁ బదునాలుగుగంటలవంతున జపధ్యానములను జేయనారంభించెను. ఈ యాకస్మికవిజృంభణముచేఁ గలిగిన నాడీకంపముచే నాతనికి క్రమముగా జపధ్యానములందు కేవలము అరుచి జనించెను; అంతయు శూన్యముగాఁ దోఁప

సాగెను. అంతటఁ గొందఱు సాధుపుంగవుల యుపదేశము ననుసరించి యాతఁడు పుష్టికరమైన యాహారము దినుచు సుప్రసిద్ధుఁడైన యొక ఆయుర్వేదవైద్యునియొద్ద చికిత్స నొంద నారంభించెను. కాని గుణము కనఁబడదయ్యె. తనగురువగు మాతృదేవికిఁ దెలుపుట మంచిదని తుద కాతనికిఁ దట్టెను. అంత నాతఁడు జయరాంబాటికి వెడలి, తనస్థితిగతులను మాతృదేవికి నివేదింప, నామె క్షణములో నాతని లోపములను గుర్తించి, యొడలెఱుఁగని సివము కూడదని మందలించి, ధ్యానమునకై అత్యంతసరళములగు కొన్నినియమములను బోధించెను. వాని నవలంబించుటచే నాతఁడు శీఘ్రకాలము ననే స్వస్థచిత్తుఁడై యాత్మవికాసము నొందసాగెను.

స్వీయసంకల్పప్రభావముచే మాతృదేవి కొందఱి దుష్ప్రవృత్తులను దొలఁగించెననియుఁ దెలియవచ్చుచున్నది. త్రాగుడు కలవడిన యొకని దురభ్యాసము నామె మాన్పెను; ఒకయువకునిఁ జెఱుప యత్నించుచుండిన యొకయువతి దుర్బుద్ధిని మఱల్చెను; తనయిచ్ఛకు వ్యతిరిక్తముగా భర్త భగవచ్చింతలో మునిఁగి తేలుచుండెనని పాతివ్రత్యము వీడిన యొకయబలకు పారమార్థికదృష్టి నలవరిచెను. కాని యిట్టిపరివర్తనముల నామె యరుదుగాఁగాని కల్గించినట్లు కానరాదు. అత్యద్భుతమగు నిట్టిపరివర్తనముల ననేకము గల్గించిన శ్రీరామకృష్ణునితో మాతృదేవినిఁ బోల్చుచుఁ గొందఱు శిష్యు లిందులకై కారణ మరయఁగోరి యామెను ప్రశ్నించిరి. దీర్ఘకాలము గురుత్వమును నిర్వహింపవలసి యున్న తా నటు లొనర్చుట సాధ్యముకాదని యామె

సమాధానించెను. మఱియు నట్టిపరివర్తనములను గలిగించుచో, బహుజనహితార్థమగు నాత్మశక్తిని గొందఱినిమిత్తమే వినియోగింపవలసివచ్చునని యామె తెలిపెను. మహాపాతకులగువారి నుద్ధరించుటకై యపారమగు నాత్మశక్తిని వ్యయించుటచేతనే గురుదేవుఁడు చిరకాలము జీవింపలేదని యామె సూచించెను.

అత్యద్భుతముగా నామెయనుగ్రహమును బడసిన భక్తులనేకులు కలరు. ఆమెపటమునైనను అంతకుమునుపు దర్శింప నవకాశము లేకున్నను స్వప్నమునఁ గొందరామెను మానవాకృతినిఁ దాల్చిన దేవతగా దర్శించియున్నారు. పూర్తిగాఁగాని, కొంతగాని మంత్రమును, ఉపాసనావిధానమును స్వప్నమున నామెవలనఁ బొందియుండి, పిమ్మట నుపదేశ సమయమున (జాగ్రదవస్థలో) తాము వడసిన మంత్రమును, స్వప్నలబ్ధమైన మంత్రము నొక్కటియే యగుటకు ఆశ్చర్యచకితులైనవారు మఱికొందఱు. జాగ్రదవస్థలోఁగాని, స్వప్నావస్థలోఁగాని మాతృదేవి తమ కొనర్చిన సాయమువలన మహాపదలనుండి తరించితిమని కొందఱు తెలిపియున్నారు.

ఐనను పైని దెల్పఁబడిన యనుభవములలో అనేకములు కేవలము స్వసంవేద్యములనియు వీనిని బడసినవారు సుప్రసిద్ధులుగారనియుఁ జదువరు లెంచవచ్చును. అగుచో, జగద్విఖ్యాతనాటకకర్తయు శ్రీరామకృష్ణునిగృహస్థశిష్యులలో ప్రధానగణ్యుఁడునగు గిరీశచంద్రఘోషు వడసిన యిట్టి దివ్యానుభవ మెంతయు గమనింపఁదగియున్నది. గిరీశకవి

చంద్రుఁడు మొట్టమొదట మాతృదేవి యాత్మప్రతిభను అంతగా పరిగణించినవాఁడుకాఁడు. శ్రీ పరమహంస నిర్యాణానంతరము కొన్నిదినముల కాతఁ డొకనాఁడు కొందఱు సోదర శిష్యులతోఁగూడి మాతృదేవిదర్శనార్థమై జయరాంబాటికి వెడలెను. మాతృదేవిని సందర్శించుట కాతనికిదియే తొలిసారి. ప్రణామ మాచరించి, యాతఁ డామెను క్షణ మవలోకించి, వెంటనే యీవలకు వచ్చి, యరుగుపై గంభీరవదనుఁడై కూరుచుండెను. ఆతనియం దాకస్మికముగాఁ గలిగిన యీ మార్పును గని తోడివార లాశ్చర్యచకితులైరి. తుదకు నిరంజనానందస్వామియను సోదరశిష్యుఁ డాతని సమీపించి, కారణమరయ నాతఁ డిట్లు పలికెను: "'గిరీశునకుఁ బందొమ్మిదవయేఁట సాక్షాత్కరించినది మీరే కాదా?' యని యామె నడుగుఁడు." నిరంజనానందుఁడడుగ, మాతృదేవి మందహాసమొనర్చి, 'ఔను' అనియెను. అది విని గిరీశచంద్రుఁడు తనకథను సోదరశిష్యుల కిట్లు వెల్లడించెను: "నాకుఁ బందొమ్మిదవయేఁట చాల జబ్బుచేసినది, ప్రాణముమీఁదికి వచ్చినది. వైద్యులు నిరాశచేసికొనిరి. ఆ స్థితిలో ఒకనాఁడు రాత్రి నేనొక కల గంటిని. ఆకాశమంతయు దివ్యతేజోవిరాజమానమై యుండెను. ఆ తేజము క్రమముగా నన్ను సమీపించి దేవతారూపమును దాల్చెను. (గిరీశుఁ డా దినములలో శుద్ధనాస్తికుఁడని గమనింపవలసియున్నది.) ఆ దేవత నన్ను సమీపించి యిట్లు పలికెను: 'నీకు అమితబాధగా నున్నది, కాదా?' ఇట్లని యామె నా నోట జగన్నాథప్రసాదమును కాఁబోలును, ఉంచి యంత

ర్ధానమయ్యెను. పిమ్మట క్రమముగా స్వస్థత కలుగసాగెను. ఆ దేవతామూర్తి యెవరో గ్రహించుటకై నే నెంతో ప్రయత్నించినాను, కాని నా కేమియు ఆనుపానులు గోచరింప లేదు. నా కతిబాల్యముననే గతించిన మా అమ్మయే ఆ రూప మున గోచరించియుండవచ్చునని నే నూహించినాను. కాని నేను మాతృదేవినిఁ జూడఁగనే పూర్వము గనిన యా దేవతా మూర్తి యామెయందు భాసింప నిశ్చేష్టుఁడ నైనాను.''

అంతటినుండియు మాతృదేవియనిన గిరీశకవిచంద్రు నకు అఖండపూజ్యభావము. ''నిరంజనుని (అనఁగా నిరంజ నానందస్వామి) యనుగ్రహమున మా అమ్మను మఱలఁ గనుఁగొనఁగలిగినాను'' అని యాతఁడు వచించువాఁడు.

మాతృదేవి పారమార్థిక వైభవమును ఈ యలౌకి కానుభవము లిట్లు చాటుచుండ, దైనందినజీవితమున నిస్తుల నిరాడంబరమూర్తియై యామె యెటు లొప్పెనో గమనించి యున్నాము. నిజముగా విజ్ఞానవిలసితమగు సరళతయే యామె శీలసౌందర్యము.

దివ్యదర్శనాదులకై — అద్భుతసంఘటనలకై — ఆరాట పడక, జ్ఞానభక్తివైరాగ్యములను లక్షింపుఁడని శిష్యుల నామె హెచ్చరించును. దివ్యదర్శనాదులు వానియంత నవి కలిగిన మంచిదే, కాని బ్రహ్మమార్గమున వానిని ప్రధాన ముగా గణించుట పొరపాటని యామె బోధించును. ఆత్మ శ్రేయమును సాక్షాత్కారమును గూర్చి సహజసరళరీతి నామె యొకప్పు డిట్లు తెల్పెను: ''బ్రహ్మసాక్షాత్కారము నొందుటచే, ఏమైన విడ్డూరము గలుగునా? అట్టివ్యక్తి

కేమైన రెండుకొమ్ములు మొలుచునా? మరేమియుఁగాదు. మనస్సు నిర్మలమగును, నిర్మలమానసమున జ్ఞానోదయమగును.''

మాతృదేవి యుపదేశవిధానము అత్యంతసరళము; కర్మకలాపాడంబరము అందుఁ గానరాదు. సాధారణముగా నామె ప్రాతఃకాలపూజానంతరము మంత్రోపదేశ మొనర్చును. కాని యీ యాచారమునకు భిన్నముగా నెట్టి దేశకాలపరిస్థితులందైనను ఆమె యుపదేశించిన సందర్భము లనేకములు కలవు. జాతీయోద్యమమునఁ బాల్గొనెనని పోలీసు వారిచే నపరాధిగాఁ బరిగణింపఁబడిన యొకయువకుని కామె జయరాంబాటిలోఁ దనయింట వసతినొసఁగఁజాలమి, పొలములో నొకగడ్డిపరక నాసనముగా గ్రహించి, కూరుచుండి, మంత్రదీక్ష నొసఁగెను. వేఱొకప్పు డామె యొక రైల్వేస్టేషను లోనియావరణమున గోష్పాదమున లభించిన వాననీటిని మార్జనాదులకై వినియోగించుచు నొకభక్తునకు మంత్రోపదేశ మొనర్చెను. స్పర్శమాత్రమున, లేదా, సంకల్పమాత్రమునఁ దనశిష్యులను మాతృదేవి భగవదర్పితమానసుల నొనర్పఁ గలిగెడిదని శ్రీ శారదానందస్వామి వచించియున్నాఁడు.

ముముక్షువులకు మంత్రోపదేశము నొనర్చుటయే గాక, శ్రీరామకృష్ణమఠసేవాశ్రమవాసులకు మాతృదేవి బ్రహ్మచర్యదీక్షను సన్న్యాసదీక్షను ఒసఁగుచుండినట్లు కానవగును. అయ్యెడ వారలకు దీక్షామాహాత్త్వమును దెలిపి, బ్రహ్మచారులకు విహితవస్త్రయజ్ఞోపవీతములను సన్న్యాసులకు కాషాయాంబరములను వ్రతచిహ్నముగా నొసఁగు టామె

యాచారము. పిదప వేదోక్తహోమాదుల నొనరించుటకై యామె వారలను బ్రహ్మానందస్వామికడ కంపును.

మాతృదేవి కివ్విధమున శిష్యవర్గము విస్తారమై యుండెను. వారిలో ననేకులు సంసారయాతనలను భరింప వలసియుందురను కారణమున ముఖ్యముగా గృహస్థశిష్యుల యెడ నామె ప్రత్యేకాదరమును జూపుచుండెడిది. వారల కామె యిట్లు తెల్పును: "కావివలువలను దాల్చినచో, కైలాసము ఒడిలోఁ బడునని తలఁపకుఁడు. ఇదంతయు లేకయే మోక్షమును మీరు సాధింపవచ్చును. కాషాయాంబర ములను దాల్పనక్కఱలేదు." గృహస్థుల తెల్లనియుడుపులను దాల్చియు, ఆచరణమునఁ దనవలె సన్న్యాసతత్త్వము నవ లంబించుట మేలని కొందఱితో నామె వచించెను. "పెండ్లి పారమార్థిక జీవనమునకు ఆటంకము కానేరదు. మనస్సే సర్వము.* ఠాకూరు నన్నుఁ బెండ్లియాడలేదా?" అని యామె యవివాహితులగు కొందఱు యువకులను గృహస్థులు కండని ప్రోత్సహించెను.

దీనినిబట్టి మాతృదేవి సన్న్యాసాశ్రమముకంటె గృహస్థాశ్రమమునే విశేషాదర్శప్రాయముగా గణించెనని కొంద ఱెంచియున్నారు. కాని యది సరికాదు. ఏలన, శ్రీశారదా శ్రీరామకృష్ణులు తమ సర్వతోముఖజీవితమువలన సర్వాశ్రమములందలి జనులకును ఆదర్శప్రాయులై వెలసిరి.

---

* "మన ఏవ జగత్సర్వం మన ఏవ మహారిపుః,
మన ఏవ హి సంసారో మన ఏవ జగత్త్రయమ్."
—ఋభుగీత.

మఱియు బంధవిముక్తయై బాంధవసమాజమున మసలిన మాతృదేవిజీవితమున శ్రీరామకృష్ణుని జీవితమునకంటెను అంతరంగికసన్న్యాసాదర్శము విశేషదీప్తిమంతమై విరాజిల్లె నను టతిశయోక్తి కానేరదు. ఐనను సన్న్యాసులయెడలను సన్న్యాసాదర్శమునెడలను ఆమె విశేషగౌరవభావమును జూపుట గమనింపవలసియున్నది. తీర్థాటనములందామె సన్న్యాసుల నెట్లు సందర్శించెనో చూచియున్నాము గదా? ఆమె కామారిపుష్కరమున నుండఁగా నచటికి వచ్చిన యొకసన్న్యాసికై ప్రత్యేకముగా నొకకుటీరమును గట్టించి, భోజనాదిసదుపాయములను సమకూర్చుటయేగాక, ప్రత్యుదయమునను సందర్శించి యాతనికి నమస్కరించుచుండెడిది. కాలాంతరమున శ్రీరామకృష్ణాశ్రమసన్న్యాసులు తన్ను సందర్శింపవచ్చునెడ నామె రాధును ఇతరాప్తులను వారలకు ప్రణామమాచరింపఁ బనుపును. సన్న్యాసులను పూజింపుఁడని గృహస్థశిష్యుల నామె హెచ్చరించెను. శిష్యబృందముతోఁ దఱచుగా నామె యిట్లు పలుకును: "ఆహా! సర్వసంగములను విడనాడిన సన్న్యాసులదాపునఁ గానిచో, మఱెవ్వరితో నేను నివసింతును?"

సన్న్యాసాదర్శమునెడ మాతృదేవి సమధికగౌరవభావమునకు మఱియొక నిదర్శనము: ఒకయువకుఁడు సన్న్యాసము స్వీకరింప నుద్యుక్తుఁడై యామెను సమీపించి యనుజ్ఞ వేఁడెను. ఆతని మనోనిశ్చయమును బరీక్షించుటకై మొదట నామె యనేకప్రశ్నలు వేసి యాతని నిరుత్సాహపఱుపఁ జూచెను; కాని యాతనివాంఛ హృదయపూర్వకమని కనుఁ

గాని యామె యిట్లు పలికెను : "సంసారమున నేమున్నది? లోకులకు సంసారమనిన నెంత వ్యామోహమో! కోటి కొకరుగదా, అందుండి వెలువడువారు! నరుని శక్తిసామర్థ్యము లెట్లు దుర్వినియోగమగుచున్నవో చూడుు. ఇట్టి పరిస్థితులలో శ్రేయస్సు నందుటనిన మాటలా? పీతలను జూడలేదా నీవు? తల్లిపీత కన్నమునుండి పదేపదే తొంగి చూచును గాని మఱల లోపలికిఁ బోవును. వెలువడుటకు విశ్వప్రయత్నము చేయునుగాని లాభములేదు. ఎందుచేత? కన్నములో నివసించుచున్న తన బహుళసంతానమునందలి వ్యామోహముచేత, అది యెంత ప్రయత్నించినను, ఈ వ్యామోహము దానిని లోపలికి లాగుచున్నది. సంసార సాగరనిమగ్నులైనవారిగతియు సంగతియు నిట్టిదే."

తనపుత్త్రుఁడు సన్న్యసించెనని కుందుచుండిన యొక తల్లితో మాతృదేవి మఱియొకప్పు డిట్లు పలికెను : "సన్న్యాసికిఁ దల్లివై యుండుట నీ మహాదృష్టము, గొప్పసుకృతము. ఇత్తడిముంతయందలి మమకారమునైనను జనులు విడిచి పెట్టఁజాలరు. సంసారపరిత్యాగము చేయుటనిన మాటలా? నీ వాతని తల్లివి. ఎందుకు నీకీ తాపత్రయము?..."

నిజముగా గృహస్థసన్న్యాసాదర్శములను రెంటినిగూడ మాతృదేవి పూజించెను, కాని యాడంబరము నామె నిరసించెను. కాషాయసంయుక్తమైనను, కాకున్నను, వివేకవైరాగ్యములే ప్రధానములని యామె వక్కాణించెను. ఏయాశ్రమముననున్నను, అవియున్నచో, మోక్షము ముంజేతికంకణమని యామె ఘోషించెను. కాని, పురుషులైనను స్త్రీలైనను

అర్హులగువారల నామె యఖండబ్రహ్మచర్యము నవలంబింపఁ బ్రోత్సహించెను. పెండ్లి చేసికొనుమని తనకూఁతును హెచ్చరింపుఁడని యొకభక్తురాలొకనాఁడు మాతృదేవినిఁ గోరెను. కాని యామె యిట్లు సమాధానమొసఁగెను: "జీవితకాలమంతయు నొకరికి దాస్యముచేయుచు, వారి యాటలకును పాటలకును తాళమువేయుచుండుట ఘోరదుఃఖము కాదా? బ్రహ్మచర్య మవలంబించుట దుస్సాధ్యమైనను, వివాహము దెస దృష్టిమఱల్పనివారికి బలవంతముగాఁ బెండ్లి చేసి సంసార కూపమున వారిని గూలఁద్రోయుట మంచిదికాదు. అది దారుణహింస." *

కాని యెవ్వరివిషయమున గృహస్థధర్మము ఆత్మ వికాసమునకు సముచితమైయున్నటు లామె కనుఁగొనునో, అట్టివారికిమాత్రము గృహస్థమార్గమునే యుపదేశించెడిది.† వారల కామె యిట్లు తెలిపెడిది:

---

* బ్రహ్మచర్యమహత్త్వమునుగూర్చి యామె యొకప్పు డిట్లు వక్కాణించెను: "అకలంకజీవితమును గడపుచు, అవివాహితులై యుండువారు భగవంతుని ప్రార్థించినను, ప్రార్థింపకున్నను, అతిశీఘ్రముగా ఆత్మవికాసమును పొందుదురు. సంసారబంధముచేఁ గాలుసేతులు కట్టివేయఁబడిన యితరులో, భగవద్విచారముచేయుట కెంతప్రయత్నించినను, అందుండి వెలువడుట దుస్సాధ్యము."

† ఒక భక్తురాలు మాతృదేవితో నిట్లు పలికెను: "అమ్మా, మీ బిడ్డలందఱును మీకు సమానులై యుండవలయునుకదా? కాని తన పెండ్లివిషయమై మీ యభిప్రాయము నరయఁగోరి మీకు వ్రాయువానిని పెండ్లిచేసికొనుమందురు; మఱియొకఁడు సంసారత్యాగము చేయఁగోరెనా, సన్న్యాసాశ్రమమును స్తుతించుచు, వానికి మీరు వేఱువిధమైన బోధ చేయుదురు. కాని ప్రతివ్యక్తిని ఉత్తమమార్గమున నడపుట మీ ధర్మము

"రెండు కన్నులు, రెండు చెవులు, రెండు చేతులు— ఈ విధముగా లోకములో అన్నియు ద్వంద్వములైయుంట గోచరించుట లేదా? ఇట్టివే ప్రకృతిపురుషతత్త్వములును;" లేదా, "సర్వము మనోగతము. ఠాకూరు నన్నుఁ బెండ్లి యాడ లేదా?"

---

కదా?" మాతృదేవి యిట్లు సమాధానించెను: "సరి, ఒకనికి తీవ్రమైన భోగవాంఛ ఉన్నదనుకో. దానిని దీర్చుకోవద్దని నేను జెప్పినపక్షమున నామాట నాతఁడు వినునా? మఱియొకఁడు అనేకపూర్వజన్మలలోఁ జేసికొనిన సుకృతముచే, ఈ భోగములన్నియు మాయామాత్రములని గ్రహించి, భగవంతుఁ డొక్కఁడే సత్యమని తెలిసికొన్నాఁడనుకో. అట్టి వానికి నేను గొంచెము సాయము చేయవలదా? ఈ సంసారతాప త్రయమున కేమైన అంతు అనునది కలదా?"

* * * *

ఒకశిష్యురాలికుమారుఁడు తాను బెండ్లిచేసికొననని చెప్పుచుం డెను; వానితల్లితో మాతృదేవి యిట్లు వచించెను: "ఓహో! ఈ రోజు లలో యువకులందఱును తాము పెండ్లిచేసికొనమనిచెప్పుట పరిపాటి యైనది. మహోత్తమమైన మనఃపరిపాకము గలవారుమాత్రమే సన్న్య సించి సమస్త సంసారబంధములను విడిపించుకోఁగలరు. కాని యీ సంసారసుఖము కొంచెము రుచిచూచునిమిత్తము జన్మించువారు కొంద ఱుందురు. నరుఁడు భోగానుభవము పొందవలయుననియే నేను జెప్పు దును. కాని గురుదేవుని శిష్యులవిషయమును అనుచరులవిషయమును వేఱు."

## పదునైదవ ప్రకరణము

## వ్యక్తిత్వమూర్తిమత్త్వములందలి విశేషములు

చక్కనివ్యక్తిత్వమున స్వరూపసంపద సరోవరమున రాయంచపగిది దీపించును. మాతృదేవి మనోజ్ఞగుణముల కామె స్వరూపసంపద సైదోడై యొప్పుచుండెడిది. "యౌవనకాలమున మీ రూప మెటు లుండెడిది?" అని యొకరు ప్రశ్నింప, "చాల చక్కఁగా నుండెడి"దని యామె సమాధాన మొసఁగెను. ఇంచుమించుగా ముప్పదివర్షముల ప్రాయమున నుండ నామె స్వరూపవైభవమును గాంచి, ముగ్ధురాలై ప్రేమానందునితల్లి యిట్లు ప్రశ్నించెనఁట: "అమ్మా! మీ కింత లోకాతీతసౌందర్యము ఎందుండి లభించెను?" మాతృదేవి పిచ్చిమఱఁదలగు సురబాల యామె స్ఫురద్రూపమునుగూర్చి యిట్లు వచించెడిది: "అప్పుడే వదినె మా యింటికి వచ్చుట: ధ్యానమునకుఁ గూరుచుండునప్పుడామెను జూతునుగదా, మిలమిల వెలిఁగిపోయెడిది ఆమె రూపము!" అంత పొడవును పొట్టియుఁ గాక, శరీరము సముచితౌన్నత్యము గలిగి శోభించుచుండ, నామె సుప్రసన్న వదనము సకలభూత ప్రేమానురాగములను జిలుకుచుండును. ఆమె యోగినీనేత్రములలో ఆత్మానందము ప్రశాంత తేజముతో వెల్గొందుచుండును.

ఐనను శిష్యబృందమున ననేకులు మాతృదేవిని సందర్శించిన సమయమున నామె ప్రాయము గడచియుండుటయు, తఱచు మన్నెపుజ్వరపీడితురా లగుచుండుటయు

నామెశరీరచ్ఛాయారూపసంపదలు చాలవఱకు క్షీణించెను. అపు డామె మేనిచాయ కొంతవఱకు నల్లఁబడియుండెడిది. అటులయ్యును కోమలము, సాత్త్వికమునగు లావణ్యమామెరూపమున భాసించుచునేయుండెను. నలుబదియేండ్ల వయస్సున నామెను సందర్శించిన యొక యతివరేణ్యుఁడామెనుగూర్చి బాలికాకోమలత యామెముఖాకృతియందు దీపించుచుండెననియు, ప్రేమసానుభూతులను జిలుకుమాటలనే యామె పలుకుచుండెననియు, అనిర్వచనీయ దివ్యతేజమామెచూడ్కుల వెల్గొందుచుండెననియు, ఆమెను గాంచినంతనే "ఈమె మనతల్లి" యనుభావము ఎల్లరియుల్లములందును పల్లవించుననియు వర్ణించియున్నాఁడు. దిగ్భ్రమనొందించు నేయసాధారణ శరీరసౌందర్యముగాని, రూపగాంభీర్యముకాని లేకుండినను మధురమంజులమగు సౌమ్యతయే యామెరూపమునకు విలక్షణమై యొప్పెనని చెప్పనగును. కాని యామెసరళాతిసరళములగు చూడ్కులవలనను అత్యంత నిరాడంబరమగు వర్తనమువలనను ఇయ్యది ప్రత్యేక పరిశీలనమునమాత్రమే చూపఱకు గోచరించెడిది. స్థూలదృష్టితో మాతృదేవినిఁ గాంచు నూతనవ్యక్తు లామె నితర స్త్రీ బృందమునుండి ప్రత్యేకముగా గ్రహింపఁజాలకుండెడివారు. మాతృదేవి కాశీనగరమున నుండఁగా నొకప్పు డొక మార్వాడీమహిళ యామెను సందర్శింపవచ్చెను. మాతృదేవి సన్నిధి నపుడు కొంతవఱకు గంభీరాకృతి గల్గిన గోలాప్ మాయి గూర్చుండియుండెను. ఆ మార్వాడీస్త్రీ గోలాప్ మాయినే మాతృదేవిగా భావించి ప్రణామమొనర్ప నామె

కడకు వెడలెను. ఆమె మాతృదేవిని సూచించెను. కాని, దేవి పరిహాసదృష్టితో నామెకుఁ దాను దర్శింపవచ్చిన మహనీయురా లామెయేయని గోలాప్‌మాయినిఁ జూపెను. గోలాప్ మాయి మఱల నామెకు మాతృదేవినిఁ గనఁబఱచినను, మాతృదేవి యామెను భ్రమింపఁజేయుట మానదయ్యె. ఇట్లు కొన్నిసారులు జరిగినంతనే గోలాప్‌మాయి ఉద్రేకమున నెలుఁగెత్తి యామె కిట్లు పలికెను: "కేవలమానవముఖమునకును దివ్యకళ లుట్టిపడు దేవతామూర్తిముఖమండలమునకును భేదమును గుర్తింపఁజాలవా?" తత్‌క్షణమే ఈమాట లామెకన్నులను దెఱవ, నామె మాతృదేవివదనారవిందమున నెల్గొందు నలౌకిక మనోజ్ఞతచే—దేవతారూప మాధురీ సాత్త్విక తేజోవిలాసములచే—ఆకర్షింపఁబడియెను. ఆజన్మాంత మెవ్వారు తమహృత్పీఠమున పవిత్రత నుపాసించుచుందురో, అనవరతావలంబనమున సహన నైర్మల్య పరహితాచరణము లెవ్వారలకు స్వాభావికములై వఱలునో అట్టి మహనీయుల ముఖాకృతులందు నెల్గొందు శాంత్యానంద మనోజ్ఞతావిలాసములు వర్ణనాతీతములుగదా!

మార్దవము, మాధుర్యము, మహత్త్వము నివ్విధమున నామెరూపమున దీపింప, నామెను దర్శించిన వారలకామె మాతృస్వరూపము మఱవరానిదై భాసించెడిది. అయ్యది వారల కామెయాప్తతను స్ఫురింపఁజేయుచు, తోడ్తోడనే పూజ్యభావమును బురికొల్పెడిది. ఆమెసాన్నిధ్యమునఁ జనవును స్వాతంత్ర్యమునేగాక, హృదయోత్తేజకమగు మహితభావములు అప్రయత్నముగా మానసము నాక్రమిం

చును. ప్రశ్నలజాబితాలను సిద్ధమొనర్చుకొని సమీపించిన జను లనేకులు నిజముగా నామెసన్నిధిని నిలిచినంత నే ప్రశ్నింత మను బుద్ధియే వారికిఁ బుట్టకుండెడిది. తత్ సాన్నిధ్యమున దీపించు మనఃప్రశాంతి తేజమున వారల సంశయతిమిరము మటుమాయమయ్యెడిది. ఆమె దివ్యమూర్తిమత్త్వము సంశయాందోళితుల చిత్తములందు శ్రద్ధాభక్తులను నెలకొల్పును, దుర్బల మానసులకు ఆత్మవిశ్వాసమును బురికొల్పును, దుఃఖితులకు చిత్తశాంతినిఁ జేకూర్చును. మాతృదేవికిఁ దా నాప్తుఁడ ననియు, తనపై నామె కఖండవాత్సల్యమనియు శిష్యులలో పతితునకైనను దోఁచును; తనహృదయసంతాపము నామెకుఁ దెలిపినచో, ఆతల్లి యనంత కారుణ్యమున దోషములను సైచి, తనయార్తినిఁ బాపునని యాతఁడు విశ్వసించును. ఒక శిష్యుఁడు చెడునడత నడిచెనను కారణమున నాతనిని సన్నిధికి రానీయ వలదని కొంద ఱామెను గోర నామె యిట్లు తెల్పెను: ''నాబిడ్డ ధూళిలోఁ బొరలాడుచుండినపక్షమున వానిని శుభ్ర మొనర్చి యెత్తుకొనుట నా ధర్మము కాదా?'' వేఱొకప్పు డొకవనిత తానొనర్చిన పాపములనుగూర్చి పశ్చాత్తాపముఁ జెందుచు, తన దోషముల నన్నిటినిఁ దెలుప, మాతృదేవి యామెను ప్రేమమీఱఁ గౌఁగిలించుకొని యిట్లభయప్రదాన మొనర్చెను: ''అమ్మా! నిరాశ చెందకు. నీపాపప్రవృత్తు లన్నిటినుండియు విముక్తి నొందఁగలవు.'' మఱియు మాతృ దేవి యామెకు మంత్రోపదేశ మొనర్చెను.

విశ్వమానవ ప్రేమానురాగము లిటు లామె వినిర్మల హృదయమున దీపింప, పరులదోషములను గమనింపకుండు

టామె స్వభావమునకు విలక్షణమై యొప్పెను. పరుల దోసఁగులను బాటించు చిత్తవృత్తిని దనయందుండి నిర్మూలింపుమని బృందావనమున భగవాను నామె ప్రార్థించుట కని యున్నాముగదా? అక్షరముల నామె ప్రార్థనఫలించెననుట కొక తార్కాణము: గోలాప్‌మాయి యొకనాఁడొక పరిచారికను గూఁకలిడుచుండెను. ఎందులకని మాతృదేవియడుగ, చలమున నామె యిట్లు పలికెను: "అమ్మా! మీతోఁ జెప్పి యేమి ప్రయోజనము? పరులదోషములను మీరుకనలేరైతిరి." అందులకు మాతృదేవి మృదుమధురస్వరమున నిట్లు ప్రత్యుత్తర మొసఁగెను: "నిజమే, వానిని గనునట్టి వారు లోకమునఁ గావలసినంతమంది కలరు. నేనిందులకు భిన్నముగానున్న, ప్రపంచము ఆఁగిపోదు." అనంతకళ్యాణ గుణసంశోభితమగు పరంజ్యోతి ననవరత మనుసంధానించుచు, తన్మయత్వము నందువారలకు సమస్తప్రపంచమును తన్మయముగనే కానవచ్చునుగాని దోసపుఁజీకటి వారల కెట్లు గోచరించును? ప్రపంచమంతయుఁ జుట్టివచ్చినను, ధర్మజునకు దుర్జనుఁడును దుర్యోధనునకు సజ్జనుఁడును గానరాలేదనుట యితిహాస ప్రసిద్ధముగదా!

పరులదోసఁగులను బాటింపని మాతృదేవి వారల బాధలనినచో, పరితపించెడిది. దీనులను, ఆర్తులను గాంచినచో, తనగుండె నీరగునని యామెయే వచించియున్నది. వారల నామె శక్తికొలఁదియు అన్నవస్త్రాదుల నొసఁగి రక్షించును, సంరక్షించును.

ముసలితనమున వ్యాధిగ్రస్తురాలై దిక్కులేక బాధ పడుచుండిన 'భావినితల్లి' యనునామెను మాతృదేవి ఆమరణము సంరక్షించెను. జయరాంబాటిలో వంద్యోపాధ్యాయ కుటుంబమున మఱియొకస్త్రీ, చెవిలోఁ గురుపువేయ దుర్భరమగు బాధపడుచుండెను. బంధువులందఱును ఆమెను విడనాడిరి. మాతృదేవి యామెదుఃస్థితిని గూర్చి విని కోల్‌పర యను గ్రామమందలి శ్రీరామకృష్ణాశ్రమమున నామె చికిత్సకును సంరక్షణమునకును సమస్తసదుపాయములను గల్పించెను. అయ్యెడ నొక శిష్యుఁడా వృద్ధురాలిని బండిలోఁ గూర్చుండఁబెట్టి యాశ్రమమునకుఁ దోడ్కొని వెడలుచుండ, మాతృదేవివదనమున భాసించిన పరమానందము—అవ్యాజానురాగసంజనిత చిద్విలాసము—మఱియే మానవ వదనమందును దాను గనియుండలేదని వచించియున్నాఁడు.

మాతృదేవి దీనజనసానుభూతినిఁ బ్రకటించు నిట్టిసంఘటనములనేకములు గలవు. ఉద్బోధన కార్యాలయమున నామె యొకనాఁడు ధ్యానస్థితురాలై యుండ, పొరుగున నొకఁడు తనభార్యను జావఁగొట్ట నారంభించెను. బిడ్డ నెత్తుకొనియున్న యామె నాతఁడు దూరమునఁ దూలిపడునట్లు బలముకొలఁదియుఁ దన్నెను. ఆమె లేచుట గాంచి, మఱలఁ దన్న నారంభించెను. మాతృదేవి సహజముగా అమితలజ్జావంతురాలయ్యు, ఆ యబలదీనాలాపములు చెవినిఁబడినంతనే తటాలున లేచి, పరుగిడి మేడకంచెగోడయొద్దకు వెడలి, ఎలుఁగెత్తి యిట్లు పలికెను: "ఓరీ, మూర్ఖుఁడా! ఆ పిల్లను జంపివేసెదవా యేమి? అయ్యో! ఆమెప్రాణము

ఈవలకే పోయినదేమో!'' మాతృదేవివైపు చూచినంతనే మంత్రముగ్ధమగు పామువోలె శాంతుఁడై యాతఁ డూరకుండెను. సకాలమున ఆ యిల్లాలు వంటచేయలేదఁట—ఆమె మహాపరాధ మిది యని మాతృదేవికిఁ దెలియవచ్చెను.

ఇట్లే యవసరమగుచో, మాతృదేవి యాగ్రహము చూపెడిది. కులీనలగు గర్భిణీస్త్రీ లిరువురను జాతీయోద్యమమునఁ బాల్గొనిన దోషురాండ్రని యనుమానించి, పోలీసువారు వారిని బంధించి, దూరముననున్న స్టేషనుకు నడిపించి తీసికొనిపోవుచుండిరని మాతృదేవి వినుట తటస్థించెను. ఆగ్రహముచెంది యామె యిట్లు పలికెను: ''ఈ దుండగము ప్రభుత్వమువారి యాజ్ఞవలననేనా, లేక పోలీసులదౌర్జన్యము చేతనా?...పాపము, ఆ పిల్లలను రక్షించుటకు పురుషులెవ్వరును దగ్గఱలేకపోయిరా?'' అనంతరము వారు విడుదల చేయఁబడిరని విని మాతృదేవి సంతసించెను.

మఱియొక నిదర్శనము. జీవించియుండగనే యావుల చర్మము నొలిచివేయుచుండిన కొందఱ కసాయివాండ్ర క్రౌర్యము నిరోధింపఁదలఁచి సురేంద్రుఁడనుభక్తుఁడు మాతృదేవికిఁ దెలియఁబఱిచెను. ''దేవుఁడనువాఁడు నిజముగా ఉన్నయెడల, ఇట్టి దారుణకృత్యమును తప్పక నివారించును'' అని తెలుపుచు, మాతృదేవి యట్టిహింస జరుగనీయకుండుటకై సర్వవిధములను శ్రద్ధ వహింపవలయునని హెచ్చరించుచు శిష్యులచే నాతనికి లేఖ వ్రాయించెను. అచిరకాలముననే యా కసాయివాండ్రపై దావా చేయఁబడుటయు, ఆ విధమైన హింస నిరోధింపఁబడియెను.

వఱదలు, కాటకము మొదలగు నుపద్రవములవలన జనులకుఁ గలుగు బాధలను నివారించుటకై శక్తికొలఁదియు యత్నింపవలయునని శ్రీరామకృష్ణాశ్రమవాసులను తనశిష్య బృందమును మాతృదేవి ప్రేమపూర్వకముగా హెచ్చరించును.

తనమహోన్నతిని గణింపక పరుల కెట్టిసేవ లొనర్చుట కైనను మాతృదేవి సర్వదా సంసిద్ధురాలై యొప్పెను. శిష్యులను దీనులగు బంధువులను సేవించుటయం దామె యెట్లు తన్మయత నొందెడిదో గమనించియున్నాము. శ్రీరామకృష్ణచరిత్రను పద్యకావ్యమున రచించిన యక్షయ కుమారసేనను మాతృదేవిశిష్యుఁడొకనాఁడు కొన్ని కూరగాయల నొకకూలియామెచేతికిచ్చి జయరాంబాటి కంపెను. వచ్చుసరికి సాయంకాలమగుటచే నామె యారాత్రి మాతృదేవిగృహమున నుండఁగోరెను; మాతృదేవి వెంటనే సమ్మతించెను. ఆ కూలియామె రాత్రి జ్వరగ్రస్తురాలై వాంతిచేసికొన నారంభించెను. ఇతరులు లేచుటకు ముందు గనే మాతృదేవి యామెగదిలోనికి వెడలి, నేలపై వ్యాపించి యున్న వాంతులను గని, తత్క్షణమే వాని నెత్తి, నీటితో గదిని శుభ్ర మొనర్చెను. ఈ పను లొనర్ప నింటిలో నితరులు లేకపోలేదు; కాని వారా స్త్రీనిఁ గూఁకలిడవచ్చునని యనుమానించి, తనసహజకారుణ్య మొప్ప మాతృదేవి యామె నివ్విధమునఁ గాపాడెను.

పాపులు మాతృదేవి కెట్లు ప్రేమాస్పదులగుచుండిరో కనియున్నాము. ఆతతాయులుసైత మామె యనురాగ

మునకు వెలికాఱైరి. జయరాంబాటిలో నామెయింటినిఁ గట్టుటకై సమీపగ్రామమందలి కొందఱు మహమ్మదీయులు నియోగింపఁబడిరి. పూర్వము వారు పట్టుపురుగులను బెంచువారు, కాని విదేశీయుల పోటీవలన ఆ వృత్తిని వదలుకొనవలసి వచ్చుటచే వారు జీవనోపాధికై దొంగతనమును దోపిడులను అవలంబింపసాగిరి. కావున వారు మాతృదేవిగృహనిర్మాణమునకై నియోగింపఁబడినంతనే, ఊరిలోఁ బెద్దగందరగోళము పుట్టెను. కాని మాతృదేవియనుగ్రహమున ఈ దొంగలు దైవభక్తులైరని గ్రామస్థులే యనంతరము చెప్పుకొనసాగిరి. నిజముగా నొకనాఁ డీమహమ్మదీయులలో నొకఁడు మాతృదేవి యొద్ద కరఁటిపండ్లను గైకొనివచ్చి, "అమ్మా! ఠాకూరికి (అనఁగా గురుదేవుని నివేదనకు) ఈ పండ్లు దీసికొనివచ్చినాను, పుచ్చుకొనుఁడు" అని వేఁడెను. మాతృదేవి ప్రీతిపూర్వకముగాఁ బండ్లను స్వీకరించెను. ఆ సమయమున నచట నుండిన యొక భక్తురాలు మాతృదేవితో నిట్లు పలికెను: "వీరు దొంగలని నే నెఱుఁగుదును. వీరు తెచ్చినవస్తువుల నెందుకు స్వీకరింతురు?" అందులకు మాతృదేవి గంభీరముగా నిట్లు పలికెను: "ఎవరు యోగ్యులో, ఎవరు అయోగ్యులో నే నెఱుఁగుదును లెమ్ము!"

ఆ మహమ్మదీయులలో అమ్‌జద్ అను నొకనిని మాతృదేవి భోజనమిడుటకై యింటిలోనికిఁ దీసికొని వెళ్లెను. వసారాలోఁ గూర్చుండఁబెట్టి మాతృదేవిసన్నిహితురాలగు నళిని యాతనికి వడ్డించుచుండెను. సమీపించిన నెక్కడ మైలపోఁకునో యని యామె దూరమున నిలుచుండి భోజనపదార్థ

ములను విస్తరిలో నెత్తియెత్తి వేయుచుండెను. అది గని మాతృదేవి యిట్లు పలికెను: "చోద్యముగా నున్నది! ఈ విధముగా వడ్డించిన, ఎవ్వరికైనను అన్నపానములు సహించునా? వానిని నాచేతి కిమ్ము. నేనే వడ్డింతును లెమ్ము." భోజనము ముగిసినంతనే మాతృదేవి యాతఁడు తినిన తావును స్వయముగా శుభ్రమొనర్చెను. ఘోరకృత్యము జరిగినట్లు నళిని భయకంపితగాత్రమున నిట్లనెను: "ఓ అత్తా! నీవు జాతిభ్రష్టురాల వైపోదువు." మాతృదేవి యామె నిట్లు గట్టిగా మందలించెను: "నోరు మూసికో. శరత్ (శారదానందస్వామి) వలెనే ఈ అమ్‌జద్ కూడ నా బిడ్డఁడేసుమా!"

మాతృదేవి ప్రేమానురాగములు సర్వజగద్వ్యాప్తములు. పశ్చిమఖండమున శ్రీ వివేకానందస్వామి విజయదుందుభిని మ్రోఁగించినపిమ్మట ననేకులు శ్రీరామకృష్ణ బోధనలను శిరసావహించుచుండిరని శిష్యులు మాతృదేవితోఁ బలుకునెడ నామె యిట్లు తెలుపును: "మీ యుద్దేశమేమి? వారుమాత్రము నా బిడ్డలు కారా?" నివేదిత, దేవమాత, క్రిస్టిన్, ఓలిబుల్ మున్నగు పాశ్చాత్యసోదరీమణులు కాలక్రమమునఁ దఱచు భారతదేశమున కరుదెంచునెడ మాతృదేవి, స్వయముగా పూర్వాచారములలోఁ బుట్టి పెరిఁగినదయ్యు, అఖండ ప్రేమానురాగములతో వారితోఁ గలసి మెలసి వర్తించుచుండెడిది. ప్రేమప్రపూర్ణమగు హృదయమున జాతిభేదాదులకుఁ దావెక్కడిది? సోదరి నివేదిత భారతదేశమునకు విచ్చేయ, నామెకు హిందూసంఘమున నుచిత స్థానము నొసఁగు విషయమున శ్రీ వివేకానందస్వామి కొంత

యాందోళన మొందసాగెను. కాని మాతృదేవి తనయౌదార్యమును ధైర్యసాహసములను బ్రకటించుచు స్వయముగాఁ దనగదియందే యామెకు బస నొసఁగెను.

మాతృదేవి సత్యకాలపుస్త్రీయయ్యు, నవీనదృక్పథ మామె మానసమున నద్భుతముగా దీపించుట సోదరి నివేదిత గాంచి, భావగర్భితముగా నిట్లు పలికియున్నది: "పురాణయుగమున కామె భరతవాక్యమా? లేక నవీన యుగమునకు నాందియా?" విదేశీయులు, విజాతీయులు నామె సన్నిధికి వెడలి, అరమరయనునది లేక, ఎంతయో చనవుతో మసలఁగలిగెడువారు. ఆమె యాచారవ్యవహారములును పరిజ్ఞానమును అంతటి యుదారములై యొప్పెను. నూతనమతతత్త్వమునుగాని, నూతనాశయమునుగాని యవలీలగా నామె గ్రహింపఁగలిగెడిదని సోదరి నివేదిత పలికియున్నది. ఆమెసమక్షమున నివేదిత మఱియొక భక్తురాలితోఁ గలిసి, యేసు పునరుత్థానగీతములను బాడ నామె యందలిభావములను అద్భుతరీతి నాకళించి, సముచితహావభావములచేఁ దన ప్రేమ సానుభూతులను బ్రకటించెను. మఱియొకప్పుడు వారే పాశ్చాత్యవివాహవిధానము నామె ముందల (ఆంగ్లమున) వర్ణింప, "మేలుకలిగినను కీడుకలిగినను, సిరిసంపద లబ్బినను దారిద్ర్యము సంభవించినను, ఆరోగ్యము లభించినను అనారోగ్యము కలిగినను—ఆ మరణము మనము వియోగము నొందకుందుముగాత" * మని వధూవరు లుచ్చరించు (వివాహ) దీక్షా

* "For better, for worse, for richer, for poorer, in sickness and in health,—till death us do part."

మంత్రమును విని మాతృదేవి బ్రహ్మానందభరితురాలై, "అవి ధార్మికవాక్కులు" అని పలికెను.

భక్తినే ప్రధానముగా గణించి, మాతృదేవి బ్రాహ్మణేతరులగు శిష్యులు వండిన యాహారమును గురుదేవునకు నివేదించి స్వయముగా భుజించిన సమయములు కలవు. అంటరానివారనియుఁ జెప్పరానివారనియు నిరసింపఁబడుచుండిన హరిజనులుసైతము నామెకు ప్రేమపాత్రులై యుండిరి. జయరాంబాటిలో నొకప్పు డొకహరిజనుఁడు మాతృదేవి కొక చుట్టకుదురును దెచ్చెను. ఆమె దానిని వసారాలో నుంచుమనెను. కాని యామెమఱఁదలు తమయింటిలోని వస్తువుల నాతఁడు తాఁకెనని పెద్దగందరగోళముచేయుచు నాతనిఁ దిట్ట నారంభించెను. మాతృదేవి యామెను వారించి యాతని నోదార్చుటయేగాక, యేమైనఁ గొని తినుమని యాతనికిఁ గొన్నిడబ్బుల నిచ్చెను.

ప్రేమామృతవాహిని పొంగిపొరలు హృదయమున న్యూనతాధిక్యము లదృశ్యమైపోవును. దైవత్వమును మానవత్వమును అం దపూర్వసమ్మేళనము నొందును. భగవన్మాతృత్వము ప్రత్యక్షమై వెలుఁగొందును. దివ్యప్రేమవిలసితములగు సేవా క్షమా స్వార్థరాహిత్యములు పరమావధినందిన మాతృదేవిజీవితమే యిందులకు నిదర్శనము. "లోకమునకు భగవన్మాతృభావమును బ్రకటించు నిమిత్తము శ్రీగురుదేవుఁడు న న్నీ యిలలో నుంచివెడలె" నని మాతృదేవియే వచించియున్నది. "అమ్మా! మిమ్ముఁ జూచిన నిఁక దేవతలను పూజింపవలయునని యెవ్వరికిని

బుద్ధిపుట్టదు'' అని యొక యతిశిష్యుఁడు వచింప, భావగర్భితముగా నామె యిట్లు సమాధానమొసఁగెను: ''ఏల పూజింపరాదు? వారందఱును నా యంశములేకదా?''

అపరోక్షానుభూతి కరతలామలకమయ్యు, మాతృదేవి శ్రీరామకృష్ణు నఖండభక్తితో నారాధించును. ఆమె పూజావిధానము కర్మకలాపమువలెఁ దోఁపక, ప్రత్యక్షానుసంధానమై దీపించెడిది. ప్రేమమూర్తియై యామె గంధపుష్పాదులను గురుమూర్తిముందల నిడి యొకింతసేపు ధ్యానమొనర్చును. ఇదియే యామెపూజావిధానము. ఇందులకామె కరగంట చాలును.

అన్నిటికంటెను మహానైవేద్య మొనర్చునపు డామె దివ్యసందర్శనము ప్రత్యక్షమై దీపించెడిది. గురుదేవునకు నైవేద్యమును సమర్పించి ప్రత్యక్షవ్యక్తిని సంబోధించునటులామె యిట్లు పలుకును: ''దయచేయుఁడు, భోజనము చేయుఁడు.'' జయరాంబాటిలో జగద్ధాత్రీపూజాదినములలో నైవేద్యసమయమున నామె యిట్లు పలుకుచుండుట తఱచు వినవచ్చెడిది: ''దేవా! ఈ దినము కొంచెము శీఘ్రముగా భోజనము చేయుఁడు,—నేను జగద్ధాత్రీపూజకు వెళ్లవలయును.'' గురుదేవుఁడు భుజించుచుండు టామెకు ప్రత్యక్ష గోచరమని గ్రహించిననేకదా, ఈ వచనము లర్థవంతములగును? గురుదేవుఁడు నైవేద్యమును ముత్త్రివిధముల స్వీకరించువాఁడని యామె తెలుపును. ఒకప్పుడు సాక్షాత్తుగా నాతఁడు నివేదితపదార్థముల నారగించును; వేఱొకప్పు డాతని ఫాలభాగమునుండి యొక కిరణము వెలువడి యాహారమును

స్పృశించును, లేదా, నైవేద్యమును స్వీకరించినట్లు సూచించును. గురుదేవుఁడు నైవేద్యమును స్వీకరించు టామెకాంచిననే సంతృప్తయగును; ఆతఁడు స్వీకరింపని యాహారము నామె భుజింపకుండెడిది.

ఇందుల కొక ప్రబలనిదర్శనము కలకత్తాలో శ్రీరామకృష్ణుని యనుచరులందు ప్రసిద్ధమగు నొకకుటుంబము మాతృదేవి నాహ్వానించినతఱి తటస్థించెను. కాని యాకుటుంబము వారు కొంత యపకీర్తికిఁ బాల్పడియుండిరి. మాతృదేవి తమ గృహమునకు విచ్చేయ, వారు తమపూజామందిరమున గురుదేవునకు నైవేద్యమొనర్పుఁడని కోరిరి. వా రెంతయో బతిమాలుటచే మాతృదేవి యంగీకరించెను. ఐనను, పరిశుద్ధాత్ములచే సిద్ధమొనర్పఁబడిన యాహారమునేకాని గురుదేవుఁడు స్వీకరింపఁజాలమి, అచటి నైవేద్యము నాతఁడు గ్రహింపఁడయ్యె. తా నెంతయో ప్రార్థింప, నాతఁ డెట్టకేలకు పాయసమును లేశము గ్రహించి, నాలుకను దాఁకెనని యామె తెలిపియున్నది. అపురూపమగు నానావిధ మధురాహారములతో విందొనర్పఁబడినను, మాతృదేవి యందేమియు భుజింపకుండుటను గాంచి వారందఱును నిర్విణ్ణులైరి. గురుదేవుఁ డారగింపని యాహారము నామె స్వీకరింపఁజాలదు కదా? ఎట్టులో కొంత శ్రమతో నామె యొకించుక పాయసమును మాత్రము భుజింపఁగలిగెను. *

* దూరదేశయాత్రలో సైతము గురుదేవునకు నివేదన మొనర్పనిదే మాతృదేవి యే యాహారమును భుజింపకుండెడిది. గురుదేవునియెడ నామె రాగానుగభక్తిని, అతని సన్నిహితత్వమును దెలుపు నొకసంఘటనము :

మాతృదేవి గురుదేవునకు సంపూర్ణాత్మనివేదన మొనర్చుకొని నిరహంకారమూర్తియై వఱలెను. మహనీయులు తమ యఖండశక్తి నెఱింగియు వినయమూర్తులై శోభించుచుందురు. ఐనను ఉత్తమమానసికస్థితులందు మాతృదేవి తనదివ్యత్వమునుగూర్చి ప్రియశిష్యులకుఁ దెలిపినసమయములు లేకపోలేదు. అట్టిముహూర్తములం దామె తనకు శ్రీమహాలక్ష్మితోఁ గల సాదృశ్యమును దెలుపును; తాను సర్వజగన్మాతనని వచించును; గురుదేవుఁడును తానును ఒక్కరే యని తెలుపును; ఎవ్వరికైనను మోక్షము నొసఁగఁ దనశక్తిసామర్థ్యముల నంగీక

---

ఆమె యొకప్పుడు కొందఱనుచరులతో జయరాంబాటికి వెడలుచుండెను. దారిలో నొకతావున వారు కుండతో నన్నము వండి దానిని దింపుచుండ, కుండ పగులుటచే, అన్నము క్రిందఁబడి నలువైపులను జెదరుట సంభవించెను. నివేదననుగూర్చి యందఱును ఆందోళన మొందుచుండ, మాతృదేవి పైభాగమునుండి యన్నమును ప్రోగుచేసి, "దేవా! నేఁడు దీనితోడనే మీరు తృప్తిపడవలయును" అని పలుకుచు, గురుమూర్తికి నివేదన మొనర్చెను. తనయిష్టదైవ మామెకు సదా ప్రత్యక్షదైవమై యొప్పెను.

మఱియొకనిదర్శనము: పూజాసమయమున గురుదేవునకు సమర్పితమగు కుసుమములలో మేలైనవాని నెంచి, వానితో నాతనిరూపపటము నలంకరించి, పిమ్మట నాతనిఁ బవళింపఁజేయుట యుద్బోధన పూజా మందిరమందలి యాచారము. మాతృదేవి యొకనాఁడు మధ్యాహ్నము విశ్రాంతినందుచుండ, గురుదేవుఁడు పాన్పునుండి దిగివచ్చి నేలపైనుండెనని యామె కలగనెను. ఆశ్చర్యమున నామె మేల్కాంచి, గురుదేవుని పాన్పుకడ కేఁగి చూచునుగదా, పటము చీమలతోఁ గప్పఁబడియుండెను. పూవులనుండి చీమలు వచ్చి గురుదేవునకు విశ్రాంతి భంగ మొనర్చెనని యామె గ్రహించి, యాయలంకార మొనర్చుచుండిన సన్యాసికి నాఁటినుండియుఁ దత్కార్యమును విరమింపుమని తెలిపెను.

రించును. కాని యట్టివాక్కులు తనవదనమునుండి వెలువడి నంతనే సర్వసాధారణముగా నామె ప్రసంగము మార్చి, యవి పొరపాటున వెలువడిన మాటలని తెలుపఁజూచును. గుణసంపదలను గోరంతలు కొండంతలు చేసి నలువురిలోఁ జాటుకొనఁజూతురు సామాన్యులు ; మాతృదేవివంటి మహనీయమూర్తులో, ఆత్మగుణైశ్వర్యములను మఱుఁగుపఱుచుకొనఁ బ్రయత్నింతురు. తనసమక్షమున నెవ్వరైనను తన్నుఁ గూర్చి దేవతామూర్తియని పలికినచో, అట్టిస్తోత్రములు చాలింపుఁడనియు, అఖండకారుణ్యముచే గురుదేవుఁడు తన పాదసన్నిధిని దన కాశ్రయ మొసఁగెననియు బాలనైర్మల్యము మోమునఁ జిందులాడ నామె పలుకును. మాతృదేవి దాల్చుచుండెడి ముఖాచ్ఛాదనము నిజముగా నామె తన పారమార్థిక ప్రతిభాతిశయమును మఱుఁగుచేసికొనఁదలఁచి ధరించుచుండెడి లజ్జాపటాచ్ఛాదనమని భావింపనగును. ఇందువలననే కావలయు, "నిజవర్ణమును బూడిదచేఁ గప్పికొనఁజూచు పిల్లి" యని శ్రీరామకృష్ణుఁ డామెనుగూర్చి పరిహాసపూర్వకముగాఁ బలికియున్నాఁడు.

ఆమె యాధ్యాత్మికోన్నతికి లౌకికజ్ఞానమును, కుశాగ్రబుద్ధియు నైదోడులై యొప్పెను. 1914-వ సంవత్సరపు ప్రపంచ మహాసంగ్రామమును గూర్చి మాతృదేవితో ముచ్చటించుచు నొకశిష్యుఁడు నానాజాతిసమితికి అధ్యక్షుఁడు (President of the League of Nations) అగు విల్సన్ దొర యశేషప్రపంచశాంతిని నెలకొల్పి భావియుద్ధముల నెట్లు వారింపఁబోవుచుండెనో వర్ణింపసాగెను. మాతృదేవి

మెల్లఁగా నిట్లు సమాధానించెను : "నాయనా! ఆమాటలన్నియు వారినాలుక చివరిమాటలు కాని మనఃపూర్వకమైనవి కావు." మఱియొకప్పు డొకశిష్యుఁడు, 'బ్రిటిష్ ప్రభుత్వము భారతదేశమునకు చేసిన మహోపకారములను గూర్చియు సదుపాయములనుగూర్చియు' నేకరువుపెట్టుచుండ, మాతృదేవి విని విని యిట్లు పలికెను : "కాని, నాయనా! జనుల పేదఱికము నానాఁటికి హెచ్చుచుండుట లేదా?"

ఎట్టిపరిస్థితులనైనను మాతృదేవి క్షణములో గ్రహించి సమంజసమగు నిర్ణయమునకు వచ్చును. లక్ష్మీనారాయణుఁడనుభక్తుఁడు గురుదేవునకుఁ బదివేలరూపాయలను సమర్పింపఁ బోవ, పరీక్షార్థముకావలయును, గురుదేవుఁ డాధనమును మాతృదేవి స్వీకరింపవచ్చునని తెలుప, నామె తన వివేకవైరాగ్యముల నెట్లు ప్రకటించెనో గమనించియున్నాము గదా? మఱియొక నిదర్శనము : దక్షిణేశ్వరమునకుఁ గొలఁది మైళ్లదూరమున ఫణిహాటీయను గ్రామమున దేవతోత్సవమును దర్శించుటకై శ్రీరామకృష్ణుఁ డొకనాఁడు కొందఱు భక్తులతో వెడలఁబోవుచు, యోగేన్‌మాయితో నిట్లు పలికెను : "ఆమె (అనఁగా శారదాదేవి) కూడ వచ్చునేమో కనుఁగొనుఁడు, ఇష్టమున్న, రావచ్చు." యోగేన్‌మాయి వచనములమూలమున గురుదేవునిమానసమునఁగల సంకోచమును మాతృదేవి వెంటనే గ్రహించి వెడల సమ్మతింపలేదు. తన మనోభావమును గనుఁగొని వర్తించినందులకై గురుదేవుఁడు పిమ్మట మాతృదేవి ధీవివేకముల నెంతయో కొనియాడెను : ఏలన, లోకు లుత్సవప్రదేశమునఁ దమ్మిరువురను గాంచి,

"అదిగో చూడుఁడు, హంసయు హంసియు"—అని యపహ సింపవచ్చునని శ్రీరామకృష్ణుఁడు శంకించెను.

ఆశ్రమమున ధర్మవైద్యశాలను నిర్వహించుచుండిన యొకశిష్యుఁ డొకప్పుడు మాతృదేవితో నిట్లు మొఱలిడెను: "ఉన్నవారుకూడ పేదలకై ఉద్దేశింపఁబడిన మనవైద్యశాలకు మందులకోసము వచ్చుచున్నారు. స్థితిపరులకుఁగూడ మనము మందీయవలసినదేనా?" క్షణ మాలోచించి మాతృదేవి యిట్లుపలికెను: "నాయనా! దేశములో ఈవైపున అందఱును పేదలే. మీ వైద్యశాలయొక్క ఉద్దేశములను గ్రహించియు జనులు మందులనిమిత్త మర్థించుచున్న పక్షమున, ఉన్నంత వఱకీయవలసినదే. యాచించువాఁ డెవ్వఁడైనను పేదయే."

దీననారాయణసేవయే ప్రధానధర్మముగాఁ గల శ్రీరామకృష్ణమఠసేవాసంఘము లభివృద్ధి గాంచుటకు మాతృదేవి ప్రేమానురాగములు సాధనభూతములై విలసిల్లెను. కోల్ పరయందలి శ్రీరామకృష్ణమఠాధ్యక్షుఁడు మాతృదేవితో నొకప్పు డిట్లు మొఱలిడెను: "ఆశ్రమవాసు లదు పాజ్ఞలను బాటింపరైరి. అన్నిటిలోను వారికి స్వాతంత్ర్యాలో చనయే. మీఁదు మిక్కిలి శారదానందస్వామిజీవద్దకో, మీ వద్దకో వచ్చినంతనే వారికి ప్రత్యుత్థానములును, పిండివంట లతో భోజనములును. దయయుంచి వారికిఁ దగిన బుద్ధి చెప్పి మఱల నావద్దకుఁ బంపివేయుచుండుఁడు." మాతృదేవి యిట్లు సమాధానించెను: "ఎంత తెలివితక్కువగా మాటలాడు చున్నావు! మన ముఖ్యవిషయము ప్రేమ. ప్రేమమూలముననే ఠాకూరు పారమార్థికకుటుంబ మింతవఱకు అభివృద్ధిపొందినది,

పొందుచున్నది. అదిగాక, నేను వారికిఁ దల్లిని. వారి కన్నవస్త్రము లిచ్చి యాదరించుటనుగుఱించి నీ వాక్షేపించుటా? ఆహా! నా బిడ్డలనుగూర్చి నే నెంతగా విలపించి గురుదేవుని బ్రార్థించితినో కదా! ఆ హేతువుచే ఆయన యనుగ్రహమున సర్వత్ర మఠములును ఆశ్రమములును వెలయుచున్నవి. ఠాకూరునిర్యాణానంతరము ఆయనశిష్యులు సంసారమును త్యజించి తాత్కాలికముగా నొక యాశ్రమమును నిర్మించుకొని కొన్నిదినములపా టేకముగా నుండిరి. అంత నొకరివెనుక నొకరు స్వతంత్రముగా బయలుదేఱి యందందుఁ దిరుగాడసాగిరి. అంత నే నెంతో దుఃఖించినాను, గురుదేవు నిట్లు ప్రార్థించినాను: 'ఓ దేవా! మానవరూపమున అవతరించి కొలఁదిమందిశిష్యులతో మీరు కాలము గడపితిరి. మీ నిర్యాణముతో అంతయుఁ జెల్లిపోయెనా? ఐన, అంతటి బాధల కాలవాలమై మీ రవతరించియుండ నేల? బృందావనమందును కాశీనగరమందును ఎందఱో సాధువులు చెట్లక్రింద వాసముచేయుచు, భిక్షాటనముచేయుట కనియున్నాను. మీ నిమిత్తమై సమస్తము త్యజించిన నా బిడ్డలు పట్టెఁడన్నమునకుఁ గాను ఇందందుఁ దిరుగాడుచుండుటచూచి నే సహింపఁజాలను. గురునాథా! 'మిమ్మునమ్మి సంసారత్యాగులగువారికి అత్యంత సామాన్యమైన యన్నవస్త్రములకు లోటులేకుండుఁగాక 'యని నా ప్రార్థన. మిమ్ములను మీ బోధలను ఆశ్రయించుకొని నా బిడ్డలు కలసిమెలసి నివసింపవలయుననియు సంసారపీడితులగు జనులు వారివద్దకు వచ్చి, వారివలన మీ వాక్కుల నాలకించి, ఆత్మశాంతి నందవలయుననియు నా ప్రార్థన. ఇందు

నిమిత్తమేకదా, మానవరూపమున మీరు అవతరించినది? నా బిడ్డ లిందందుఁ దిరుగాడుచుండుట చూడ నాకెంతో పరితాపముగా నున్నది.'' శ్రీరామకృష్ణసేవాసంఘపరిపాలనాకీలకము మాతృదేవికెట్లు హృదయంగమమై యొప్పెనో పరు లెఱుంగకున్నను, తత్సంఘనిర్మాణ వికాసముల కామె యెట్లు హేతుభూతురాలై విలసిల్లెనో ఈ పలుకులు తెలుపుచున్నవి గదా!

లజ్జావంతురాలయ్యు, మాతృదేవి ధైర్యస్థైర్యములకును సమయస్ఫూర్తికిని ఎన్నఁడును గొఱవడియుండలేదు. ఆమె 'దొంగతండ్రి' యుపాఖ్యానమున ఈ సుగుణమణులామె శీలమున నెట్లు ప్రకాశించెనో కనియున్నాముగదా? మఱి యొకటిరెండు తార్కాణములు: శ్రీవివేకానందస్వామి తన పరివ్రాజకయాత్రాసమయమున అసూయాగ్రస్తుఁడగు నొక పకీరుచే శపింపఁబడి శారీరకమానసికబాధల నంది, గురుదేవుఁడు (శ్రీరామకృష్ణుఁడు) తన్ను రక్షింపఁజాలకపోయెనని కుపితుఁడై, పిదప మాతృదేవియొద్దకు వచ్చి, తన చలమును వెలిపుచ్చెను. మాతృదేవి యిసుమంతయు స్థైర్యమును వీడక, ప్రశాంతవచనముల స్వామి నిట్లూరడించెను: ''నాయనా! ఇటువంటి శాపమునకు శ్రీశంకరాచార్యులును గుఱియై బాధపడిరని వినుచున్నాము. బాధ నీ శరీరమునకు సంభవించుటొకటియు గురుదేవునిశరీరమునకు సంభవించుట వేఱొకటియుఁ గాదు. అదిగాక, గురుదేవుఁ డన్నిటిని సఫలము చేయుటకేగాని, విఫలముచేయుటకు అవతరింపలేదు. సమస్త

మైన విజ్ఞానమును శక్తిసామర్థ్యములను ఆయన గారవించిరి, శకునములనుగూడ ఆయన నమ్మిరి.''

మాతృదేవి ధైర్యస్థైర్యముల కుత్కృష్టమైన నిదర్శన మామె కామారిపుష్కరమున నుండఁగా హరీశుఁడను నొకయున్మత్తుఁ డామె నెదుర్కొనినపుడు తటస్థించెను. ఈ సంఘటనమునుగూర్చి యామెయే యిట్లు తెలిపియున్నది: ''హరీశుఁడు * అపుడు కొలఁదిదినములుగా కామారిపుష్కరమున నుండెను. ఒకనాఁడు నేను బొరుగింటినుండి వచ్చి యింటఁ బ్రవేశించుచుండఁగా, ఆతఁడు నన్నుఁ దఱుమనారంభించెను. అపు డాతనికి మతి లేదు, — భార్యమూలమున మతి పోయినది. ఇంటిలో అపుడు నేనుదప్ప మఱెవ్వరును లేరు. ఎక్కడకు వెళ్లుటకును దోఁచక, గాదెవెనుకకుఁ బరుగెత్తినాను, కాని నన్నాతఁడు విడువఁడే! అలసిపోవు పర్యంతము గాదెచుట్టును ఏడుసార్లు పరుగెత్తినాను. అంత నా వాస్తవప్రకృతి వెలువడినది. నేనాతనిఁ బట్టి క్రిందఁబడవేసి, గుండెలపై మోఁకాలు నాని, నాలుకను లాగి, నా వేళ్లు ఎఱ్ఱఁబాఱుపర్యంతము లెంపలు వాయఁగొట్టినాను. ఆతఁడు ఎగయూపిరి విడువనారంభించినాఁడు.''

''సంపత్సు మహతాంచిత్తం భవే దుత్పలకోమలమ్,
ఆపత్సు చ మహాశైలశిలాసఙ్ఘాతకర్కశమ్.'' †

* ఈతఁడు శ్రీరామకృష్ణుని శిష్యకోటిలో నొకఁడు.

† భర్తృహరిసుభాషితము, నీతిశతకము, 55.

"సంపదలు గల్గుతఱి మహాజనుల హృదయ
మభినవోత్పలకోమలం బగుచు వెలయు
నాపదలు వొందునపుడు మహామహీధ
రాశ్మసంఘాతకర్కశంబై తనర్చు."

అనికదా సుభాషితవచనము!

కొందఱిచే ఈ సంఘటనము మాతృదేవి దివ్యత్వమున కొకనిదర్శనముగా నెన్నఁబడియున్నది. ఏమైనను మహావిపత్సమయమున నామె యెట్లాత్మసంరక్షణమును మానసంరక్షణము నొనర్చుకొనఁగల్గెనో ఇయ్యది ప్రకటించుచున్నది గదా? ఆమె మాతృభావమునను లజ్జాశీలమునను ఆత్మసంరక్షణశక్తియు సమయస్ఫూర్తియుఁ గాంతిలుచున్నవని సోదరీమణులు గుర్తింతురుగాక! 'అబల' లిందలి గుణపాఠమును గ్రహించి సబలలై, వీరవనితలై వెలయుదురుగాక! *

ప్రేమానురాగములకే కాక, ధైర్యస్థైర్యములకును నిలయమగు గభీరహృదయమును, సమయోచితవర్తనమునకుఁ

* దుండగీండ్ర బారిఁబడకుండ స్త్రీలను గాపాడుటకై వారికి రాణివాసాదుల నేర్పఱచి, తరతరములనుండి వారికిఁ గేవల పరాధీనతయందు శిక్షణ గఱపియుండుటచే వారు బలహీనలై ఆత్మరక్షణోపాయముల నవలంబింపఁజాలకున్నారు. ఈ దుఃస్థితినిఁ గాంచియే శ్రీ వివేకానంద స్వామి యిట్లు ఘోషించియున్నాఁడు: "ఎంతసేపు నిస్సహాయత్వమున, నీచ నిందిత పరాశ్రయత్వమున, శిక్షణ గఱపఁబడియుండుటచే, కాసంత ప్రమాదముగాని, విపత్తుగాని సమీపించిన దన్నంతనే కండ్లు వాఁచిపోవునట్లు గోలుగోలున ఏడ్చుటను మాత్రము వారు నేర్చుకొనియున్నారు."

దావలమగుఁధీశక్తియు మాతృదేవివ్యక్తిత్వమున నిర్విధమున సంపూర్ణవికాసము నొంద, నామెనిస్తుల నిరాడంబరస్వభావము వానికి సౌరభము నొసఁగి మించెను. సాక్షాద్దేవతా మూర్తి యని జను లామెను పూజింపసాగిరి. సుప్రసిద్ధ సన్న్యాసులును గృహస్థులును ఆమెమాటను శిరమునఁ దాల్చుచుండిరి. యతివరేణ్యులగు శ్రీరామకృష్ణశిష్యులు మాతృదేవియనినచో, అఖండగౌరవమును బ్రకటించువారు. స్వయముగా ధీనిధులయ్యు, ఆధ్యాత్మికమహిమాన్వితు లయ్యు, ప్రధానకార్యనిర్వహణమునఁ దప్పక వా రామెయభి ప్రాయము నరయువారు; అరసి శిరసావహించువారు. మాతృదేవిసమ్మతినిఁ బడసియే, ఆమె యాశీర్వాదము నందియే, శ్రీవివేకానందస్వామి పశ్చిమఖండమునఁ దన దిగ్విజయయాత్రకై బయల్వెడలెను. ఆమె వచనమును దైవాజ్ఞగా నెంచి ప్రేమానందస్వామి శ్రద్ధాభక్తులతోఁ బరిపాలించును. బ్రహ్మానందస్వామి యామెను సమీపించుచో, భావావేశమున నాతని శరీరము కంపించుటను శిష్యులు గాంచియున్నారు.

తత్త్వజ్ఞశిఖామణులగు యతివరేణ్యు లనేకు లామెను సందర్శింపవచ్చువారు. షడ్దర్శనపండితుఁడగు నొక యతీశ్వరుఁ డొకప్పుడు మాతృదేవిని సందర్శించి, యఖండభక్తితోఁ బ్రణమిల్లి, దేవీమాహాత్మ్యశ్లోకములచే నామెను స్తుతించి యనుగ్రహము నర్థించెను. మాతృదేవి యాతని కేవేని ఫలముల నొసఁగుమని శిష్యునకుఁ దెలుప, నాతఁడు మూఁడు మామిడిపండ్ల నొసఁగెను. ఆతనికి విశేషముగా నీయవల

యునని మఱల వెదకించి, శిష్యునిమూలమున నామె మఱి యొకఫలమును బ్రసాదించెను. ఆ యతివరేణ్యుం డద్దానిని గ్రహించుచు నిట్లు నుడివెను: "ధన్యోస్మి! అమ్మ మొదట మూఁడుమామిడిపండ్లను బ్రసాదించినపుడు ధర్మార్థకామము లనెడు త్రివర్గమునుమాత్రమే ప్రసాదించె ననుకొంటిని. ఆహా! ఇపుడు మోక్షఫలమునుగూడ ననుగ్రహించెఁ గదా!"

లోక మెంత స్తుతించినను, పూజించినను మాతృదేవి సర్వదా నిరహంకారమూర్తియై వఱలెను. ప్రకృతి సౌందర్యములీల మాతృదేవిసరళతయు సర్వసుగుణములును అత్యంతసహజముగా, సర్వజనానందకరముగా, ఆత్మ ప్రకాశమును గాంచెను. 'ప్రాతఃకాలమారుతమువోలె స్వేచ్ఛామయమై, నవవికసిత కుసుమములీల సుకోమలమై, మంచుబిందువుపోల్కి స్వచ్ఛమై తనరారు బాల్యము'* ఆజన్మాంత మామె మూర్తిమత్త్వమున శోభిల్లెను.

వేయేల, మాతృభావము, గురుదేవునియం దాత్మ నిమగ్నత, మనోహర వినిర్మలవర్తనము—ఇవియే యామె వ్యక్తిత్వమును మూర్తిని తేజోమయ మొనరించెను.

మాతృదేవి నిద్రాహారములు అత్యల్పములు. పదు నొకండుగంటల కామె పండుకొని బ్రాహ్మముహూర్తము నకుఁ జాలముందుగనే మేల్కాంచును. వెన్నెలరాత్రులలో నొక్కొక్కప్పు డామె పరుండిన రెండుమూఁడుగంటలకే తన మెప్పటివేళ యయ్యెనని తలఁచి మేల్కొనుచుండెడిది. పేరు

---

* శ్రీరామకృష్ణ బోధామృతము.

నకు మూఁడుమాఱులయ్యె, ఉదయమునను రాత్రియు నామె గైకొను నాహారము అత్యల్పము. *

మాతృదేవి వస్త్రధారణమో, అత్యంతసరళము, నిరాడంబరము. పూర్వకాలపు వంగదేశీయస్త్రీ లందఱి రీతినే యామె పొడుగాటి యొకచీరను ధరించుచుండెడిది. రవికగాని, కుట్టిన బట్టలుగాని, పాదరక్షలుగాని యామె దాల్చియెఱుఁగదు. ఒకప్పుడొక భక్తురా లామె కొక చక్కని రవికను సమర్పింప, నామె యొకటి రెండుసారులు ధరించి యావలఁ బెట్టెను.

ఆహారవిహార వస్త్రధారణాది సమస్తవిషయము లందును మహాత్ముల సరళవినిర్మలస్వభావము భాసించు చుండును గదా!

---

* ఉదయ మించుమించుగాఁ బదిగంటల కామె పటిక బెల్లపుఁ బానకమును, భక్తులందఱకుఁ బంచిపెట్టఁగా నేమైన మిగిలినచో, ఫలాదికమగు నించుక ప్రసాదమును గైకొనును. చాలవఱకు స్వయముగా వండి గురుదేవునకు నివేదించిన యన్నాదుల నామె పండ్రెండున్నర గంటలకు భుజించును. లూచీలనఁబడు నొకవిధమైన రెండుమూఁడు చిన్నచిన్న పూరీలను, కొంచెము కూరను పాలను రాత్రి తొమ్మిదిన్నర గంటలకు గైకొనును. కీళ్లనొప్పులవలన నామె చల్లని వస్తువులను—పెరుఁగు మున్నగువానిని—మిక్కిలి యల్పముగాఁ గైకొనుచుండెడిది. పలుచని మినుపపప్పును వేయించిన గసగసాలును ఆమెకు ప్రీతికరమగు సంబారములు. కొన్ని వేఁపుడుకూరలు, మృదువైన యాకుగూరలు, కొంచెము గట్టిగానున్న 'సందేశ్' అనఁబడు నొకవిధమైన పాలపిండి వంట, 'రసగుల్లలు' అనఁబడు మఱియొకవిధమైన పాలపిండివంట—ఇవి యామె కిష్టమగువానిలో ముఖ్యమైనవి. పండ్లన్నిటిలో మామిడి పండ్లు—అందు ముఖ్యముగాఁ గొంచెము పుల్లనివి—ఆమె కెంతో రుచించెడివి.

## పదునాఱవ ప్రకరణము

## కాశీరామేశ్వరాది తీర్థయాత్రలు

మాతృదేవి యుత్తర చరిత్ర నవలోకించుటకు ముందు బృందావనయాత్రాసమయమునుండియు నామె గావించిన వివిధతీర్థయాత్రలనుగూర్చి యిట సంగ్రహముగాఁ దెలిపెదము. వివిధసమయములలో నొనర్పఁబడిన యీ తీర్థయాత్రల కాలపరిమితి యిరువదియైదు సంవత్సరములు.

క్రీ. శ. 1888-వ సంవత్సరమున (ఇంచుమించుగా చైత్రమాసమున) మాతృదేవి, యద్వైతానందస్వామి (పెద్ద గోపాలుఁడను శ్రీరామకృష్ణశిష్యుఁడు) తన్ననుగమింప, గయాక్షేత్రయాత్ర నొనర్చెను. శ్రీరామకృష్ణుఁడు తనతల్లి చంద్రాదేవి పరమపదించిన వెనుక గయకు వెడలి యామెకు పిండప్రదాన మొనర్చుట శ్రేయస్కరమని మాతృదేవికిఁ దెలిపియుండెను. ఆమె యీ తరుణమున గురుదేవుని సంకల్పమును నెఱవేర్చెను. గయకుఁ గొలఁదిమైళ్ల దూరముననున్న బుద్ధగయనుసైత మామె సందర్శించి యచటి సుప్రసిద్ధమగు మఠమును గాంచెను; ఆమెహృదయమున దివ్యప్రేమతరంగములు పొంగిపొరలెను. ఇవ్విషయమై యామెయే యిట్లు తెలిపెను: "బుద్ధగయలోని మఠమును జూచుటకై వెళ్లినాను. నానావిధవస్తువులతో మఠము కలకలలాడుచుండెను. జీవనోపాధి కచటి సన్న్యాసులకు లోటు లేకుండెను. అనంతరము అనేక పర్యాయములు విలపించుచు గురుదేవుని నిట్లు ప్రార్థించినాను: 'దేవా! నా బిడ్డలకుఁ దల దాఁచుకొనుటకుఁ దావు లేదయ్యె!

అన్న పానములకైనను వారికిఁ గొఱంతయేగదా! పట్టెఁడన్న ముకోస మింటింటికి వారు తిరుగాడుచున్నారు. వారి కీవిధమైన స్థలము సంప్రాప్తించుఁగాక!' అనంతరము గురుదేవుని యనుగ్రహమున బేలూరుమఠము (శ్రీరామకృష్ణమఠసంస్థ కంతకును కలకత్తాయందలి ప్రధాన కేంద్రము) వెలసినది."

ఈ సంవత్సరాంతముననే (డిసెంబరు, 1888 లో) మాతృదేవి జగన్నాథమునకు యాత్రగావించెను. యోగేన్ మాయియు, బ్రహ్మానంద యోగానంద శారదానందస్వాము లును ఇతరులు మఱికొందఱును ఆమె ననుగమించిరి. వా రొక భక్తునింట బసచేయ, జగన్నాథాలయార్చకుఁడు గోవింద సింగరి యనునాతఁడు మాతృదేవియందలి పూజ్యభావముచే, పాలకి నెక్కించి యామెను ఆలయమునకుఁ దోడ్కొనివెడల నుద్యమించెను. కాని మాతృదేవి యిట్లు పలికెను: "వద్దు, నాయనా, గోవిందా! ఆలయమునకు నీవు నాకుఁ ద్రోవఁ జూపు, చాలును. జగన్నాథుని సందర్శించునిమిత్తము నీ వెనుక నేను బికారివలె నడిచి వచ్చెదను."

శ్రీరామకృష్ణుఁడు తనజీవితకాలమున జగన్నాథాలయ మును సందర్శింపమి, మాతృదేవి యాతనిపటమును గైకొని వెడలి జగన్నాథమూర్తినిఁ జూపెను. ఉదయసాయంసమ యములందు ఆలయమున కేఁగి సేవలను సందర్శించుచు, లక్ష్మీమందిరమున విశేషకాలము ధ్యానానందమున నోల లాడుచు నామె యచట నాలుగునెలలు గడపెను.

జగన్నాథాలయమునఁ దనదివ్యానుభవమునుగూర్చి కాలాంతరమున నామె యిట్లు పలికెను: "తనదివ్యసింహా

సనమున సింహగంభీరమూర్తియై జగన్నాథుఁడు ఆసీనుఁడై యున్నట్లును, నేనాతనికిఁ బరిచర్య చేయుచున్నట్లును నాకు అనుభూతమైనది.'' మఱియు లక్షసాలగ్రామనిర్మితపీఠమున నొప్పుచుండిన యీ జగన్నాథవిగ్రహము నిజముగా శివ విగ్రహమైయుండినటు లామె స్వప్నము గాంచెను. *

1894-వ సంవత్సరమున మాతృదేవి తల్లితోడను సోదరులతోడను పయనమై రెండవసారి కాశీబృందావన యాత్రలు గావించెను. 1901-వ సంవత్సరమున నామె సన్నిహితులును గురుదేవునిశిష్యులు గొందఱును తన్ననుగ మింప మఱల జగన్నాథపుణ్యక్షేత్రమును దర్శించెను. ఆ సమయమున నామె కాలిపైఁ గురుపువలన అమితబాధనందు చుండ, వైద్యుఁడగు నొక శిష్యుఁడు ప్రణామమాచరించు నెపమున వచ్చి, ప్రణమిల్లి, త్రుటిలో శస్త్రచికిత్స గావించి, యామెకృప కేగాక, కృతజ్ఞతకును బాత్రుఁడయ్యెను.

కామారిపుష్కరమున కించుమించు ముప్పదిమైళ్ల దూరముననున్న విష్ణుపురమున కామె యొకసారి యాత్ర

---

* మాతృదేవి దివ్యానుభవము పెక్కువిషయములలో చారిత్రక పరిశోధనలకు సరివచ్చుచున్నదని గుర్తింపనగును. ప్రస్తుతము జగన్నాథుని విగ్రహమును జనులు విష్ణువిగ్రహముగా నెంచుచున్నను, ఆదిని ఈ యాలయము బౌద్ధాలయమనియు, పిమ్మట నిది శైవుల కైవసమగుటయు విగ్రహము శివవిగ్రహముగా మార్పఁబడెననియు, మఱికొంతకాలము నకుఁ బిమ్మట వైష్ణవాధీనమై విష్ణుమూర్తిగా మార్పఁబడెననియు చారిత్రక పరిశోధకులు దెలుపుచున్నారు.

గావించెను. "విష్ణుపురము * గుప్తబృందావనము. కావున నెప్పుడో యొకప్పుడు నీవా పుణ్యక్షేత్రమును దర్శింపవలయును" అని గురుదేవుఁడు మాతృదేవితోఁ బలికియుండెనఁట.

1909–వ సంవత్సరము తుదిని మాతృదేవి దక్షిణ భారతదేశమందలి పుణ్యక్షేత్రరాజమగు రామేశ్వరమునకు బయల్వెడలి, మార్గమధ్యమున ఒరిస్సాయందలి కొఠారను గ్రామమున రెండునెలలుండెను. దేవేంద్రనాథచట్టోపాధ్యాయుఁడను నచటి పోస్టుమాస్టరు కొంతకాలము క్రైస్తవమతావలంబకుఁడై యుండి, యిపుడు తనయవివేకమునకు వగచి, మాతృదేవియనుజ్ఞ గొని, మఱల స్వధర్మమగు సనాతనధర్మమవలంబింప సమకట్టెను. ప్రాయశ్చిత్తాదికర్మము లైనవెనుక మాతృదేవి సన్న్యాసిశిష్యులలో నొక రాతనికి గాయత్రీ మంత్రమును యజ్ఞోపవీతము నొసఁగిరి; మఱునాఁడు మాతృదేవి స్వయముగా నాతనికి మంత్రోపదేశ మొనర్చెను.

అచిరకాలముననే మాతృదేవి తనయనుచరులతో నటనుండి పయనమై చెన్ననగరము చేరెను. శ్రీరామకృష్ణ శిష్యుఁడును దక్షిణదేశమున శ్రీరామకృష్ణమఠ ప్రతిష్ఠాపకుఁడును నగు శ్రీ రామకృష్ణానందస్వామి మాతృదేవికి అఖండ భక్తిపూర్వకమగు స్వాగత మొసఁగెను. ఆమె యచట నించుమించుగా నొకమాసము గడపి యనేకులకు మంత్రోపదేశ

* ఇచటి సర్వమంగళాదేవి విగ్రహముఖమున దివ్యకళ లుట్టిపడుచుండును. మఱియు నిందుఁగల యసంఖ్యాకమైన వైష్ణవదేవాలయములును ఏకశిలానిర్మితరథమును ప్రాచీనభారతీయశిల్పచాతుర్యమును వేనోళ్లఁ జాటుచున్నవి.

మొనరించెను. చెన్నపట్నమునఁ దనయునికిని స్మరించుచు, కాలాంతరమున నొకశిష్యున కిట్లు తెలిపెను: ''అనేకులు అచట నన్నుఁ జూడవచ్చినారు. ఆ ప్రాంతపుస్త్రీలు విశేష విద్యావతులు. నన్ను వా రొకయుపన్యాసము చేయుమని కోరిరి: నే నిట్లంటిని: 'నేను ఉపన్యాసములు చేయలేను. గౌరీదాసి (గౌరీమాయి) వచ్చియుండినపక్షమున మీ కోరికను నెఱవేర్చియుండెడిది.' ''

రామకృష్ణానందునితోడను తనయనుచరులతోడను మాతృదేవి చెన్నపురినుండి మధుర కేఁగి, యట నొకదినము గడపి, మఱునాఁటిరాత్రికి రామేశ్వరము చేరెను. ఈ దివ్య క్షేత్రమున నామె మూఁడుదినము లుండెను. అచట రామనాథరాజు ఆమెను విశేషముగా గౌరవించెను. ఆతనియాజ్ఞ వలన నామె యెంతటివారికైనను ఒసఁగఁబడని పూజాసౌకర్యములను బడసెను. రామేశ్వరమున నుత్తరహిందూదేశమందలి ఆలయములలోవలెఁగాక, అర్చకులుదక్క నితరులెవ్వరును గర్భాలయమునఁ బ్రవేశించుటగాని, విగ్రహమును దాఁకి పూజించుటకాని యంగీకరింపఁబడకుండుట ప్రసిద్ధము. దేవుఁడు వరమిచ్చినను పూజారి వరమీయఁడుకదా! కాని శ్రీ వివేకానందస్వామిభక్తుఁడగు రామనాథరాజుమూలమున మాతృదేవియేగాక, యామెయనుచరులందఱును అచట నున్నంతకాలము గర్భాలయమున కేఁగి రామలింగేశ్వరునిఁ బూజింపఁగలిగిరి.

రామేశ్వరమునందలి తనయనుభవములను స్మరించుచు, అనంతరము మాతృదేవి యిట్లు వచించెను: ''రామ

లింగేశ్వరునిఁ బూజించుటకుఁగాను శశి (రామకృష్ణానంద స్వామి) నాకు నూటయెనిమిది బంగారు బిల్వపత్రములను సమకూర్చెను. నా రాకనుగూర్చి విని రామనాథరాజు తనభవనములను ఐశ్వర్యమును నాకుఁ జూపింపఁ దనయుద్యోగి కాజ్ఞాపించెను. అంతేగాక, నేను దేనినైనను ప్రీతితోఁ జూచిన, దానిని నాకు అర్పింపవలయునని రాజు ఆతనికిఁ దెలియఁబఱిచెను. కాని యక్కడివస్తువులు నాకేమి కావలయును? ఏమియుఁ జాలుపోక అతనితో నేనిట్లంటిని: 'నాకుఁ గావలసినవాని నన్నిటిని శశి చేకూర్చినాఁడు.' కాని యతని (ఉద్యోగి) మనస్సు నొచ్చునేమోయని మఱల నిట్లంటిని: 'రాధు (మాతృదేవిసోదరునికుమార్తె) కేమైనఁ గావలసినపక్షమున ఆమె యడుగును లెండు.' ఆ సమయమున 'నీ కేమి కావలసినను, తీసికోవచ్చును' అని రాధుతోఁ జెప్పినాను. అపుడు వజ్రవైడూర్యాదిరత్నములను వారు చూపుచుండ నా గుండె దడదడమెత్తసాగినది. ఆత్రముతో గురుదేవు నిట్లు ప్రార్థించినాను: 'దేవా! రాధు వీనిలో దేనియందును ఆశపడకుండునట్లు కటాక్షింపుఁడు.' తుదకు రాధు ఇట్లనినది: 'ఏమి తీసికొందును? వీనిలో నాకేమియు అక్కఱలేదు. నా పెన్సిలు పోయినది. నాకొక పెన్సిలు కొనిపెట్టు.' నా ప్రాణము లేచి వచ్చినది. బయటికి వచ్చినపిమ్మట అరణా యిచ్చి వీధిలోని యంగడినుండి యామె కొక పెన్సిలు కొని యిచ్చినాను.''

రామేశ్వరమునుండి బయలుదేఱి మాతృదేవి బెంగుళూరున కేఁగెను. అచట శ్రీరామకృష్ణాశ్రమము స్థాపితమై యుండెను. మాతృదేవి వచ్చుచున్నసంగతి ముందుగా నెవ్వారి

కిని దెలియకున్నను, గుంపులుగుంపులుగా వచ్చి జనులామెను సందర్శింపసాగిరి. ఈ విషయమునుగూర్చి కాలాంతరమున నామె యిట్లు పలికెను: "బెంగుళూరులో ఏమి జనసమూహము నన్నుఁ జూడవచ్చెను! రైలుబండి నేను దిగుచుండఁగా జనులు పూలవాన గురియింప నారంభించినారు. బాటపైఁ బూవు లొత్తుగాఁ బడియుండెను. గురుదేవునిసందేశము సర్వత్ర వ్యాపించినది, అందుచేతనే అంతమందిజనులు వచ్చిరి."

కలకత్తాకు మఱలుచు, మాతృదేవి యొకదినము రాజమహేంద్రవరమున నాఁగి, గోదావరీనదిలో స్నాన మొనర్చెను. అనంతరము జగన్నాథమువిూఁదుగా (1911-వ సంవత్సరము చైత్రమాసమున) కలకత్తా చేరెను.

1912-వ సంవత్సరముతుదిని మాతృదేవి మూఁడవ సారి కాశీయాత్ర గావించెను. ఇదియే యామె యొనరించిన కడపటి తీర్థయాత్ర. పలువురు భక్తులును బంధుగులును శ్రీరామకృష్ణమఠసన్న్యాసులలోఁ గొందఱు పెద్దలును మాతృదేవి ననుగమించిరి. వారణాసియందలి శ్రీరామ కృష్ణాద్వైతాశ్రమమున కనతిదూరమున నొకభక్తునిచే నూతనముగా నిర్మింపఁబడిన లక్ష్మీనివాస మను దివ్య భవనమున మాతృదేవికి బస నేర్పఱిచిరి.

మాతృదేవి యీ పుణ్యక్షేత్రరాజమున రెండునెలలకు అదనముగా నుండెను. అచటి ప్రధానదేవతలగు విశ్వనాథుని, అన్నపూర్ణను పూజించినపిమ్మట నామె యచటి శ్రీరామ కృష్ణసేవాశ్రమమును దర్శించెను. ఈ సేవాశ్రమము కాశీ

నగరముననేగాక, యావద్భారతదేశమునను వైద్యసేవకుఁ బేరుగాంచియున్నది. ఆశ్రమవాసుల సేవలను బ్రశంసించుచు మాతృదేవి యిట్లు పలికెను: "ఠాకూరు స్వయముగా నిచట వెలసియున్నారు; శ్రీమహాలక్ష్మియుఁ దనయఖండవైభవముతో నిచట వెలుఁగొందుచున్నది... అహా! ఈ ప్రదేశము ఎంత చక్కఁగా నున్నది! శాశ్వతముగా నాకిచటనే యుండవలయునని యున్నది." బసకు వెళ్లినపిమ్మటఁ బది రూపాయిల నామె యా సంస్థకుఁ గానుకగాఁ బంపెను.

కాశీనగరమున మాతృదేవి ప్రధానదేవాలయముల నన్నిటిని, దర్శనీయములగు తావులనన్నిటిని సందర్శించెను. అచటి కేదారనాథునివిగ్రహమునుగూర్చి యామె యిట్లు వచించెను: "ఈ కేదారనాథుఁడును హిమాలయములోని కేదారనాథుఁడును పరమాప్తులు. ఈతని సందర్శించినఁ జాలును, ఆతని సందర్శించినట్లే. కేదారనాథుఁడు ప్రత్యక్ష దైవము."

పూర్వకాలమున బౌద్ధవిజ్ఞానమునకును తత్త్వజ్ఞానమునకును పేరుపొంది యిపుడు శిథిలావస్థయందున్న సారనాథమును మాతృదేవి యొకనాఁడు సందర్శింపవెడలెను. అచట బౌద్ధవిజ్ఞానస్మారకచిహ్నములను బరిశీలించుచు, నిశ్చేష్టులైయుండిన కొందఱు పాశ్చాత్యులను గని దివ్యదృష్టితో నామె యిట్లు పలికెను: "వీరే ఒకానొక పూర్వజన్మమున వీనిని నిర్మించినవారు, తమకార్యములను గని తామే యిపు డాశ్చర్యచకితు లగుచున్నారు!"

వారణాసిలో మాతృదేవి యిరువురు మహాత్ములను సందర్శించెను. అందొకఁడు నానకసంప్రదాయమునకుఁ జెందిన యతివరేణ్యుఁడు. రెండవవ్యక్తి శ్రీరామకృష్ణగురు వరేణ్యుఁడగు శ్రీతోతాపురికి సమకాలికుఁడును సహవాసియు నగు చామేలిపురియను యతీంద్రుఁడు. 'మీకు భోజనము సమకూర్చుచున్నవా రెవరు?' అని గోలాప్‌మాయి యాతని నడుగ, భావపరవశుఁడై యాతఁ డిట్లు వచించెనఁట: ''అన్నపూర్ణాదేవియే నాకు అన్నమిడుచున్నది. వెఱ్ఱితల్లీ! లోకమున మఱెవ్వరు అన్నదాతలు?'' ఈ సమాధానమును విని మాతృదేవి బ్రహ్మానందము నందెను. బసకు వెళ్లినపిమ్మట శిష్యబృందముతో నామె యిట్లు పలికెను: ''ఆ వృద్ధుని మోము మఱవఁజాలను. ఆహా! పసిబాలునిమోముగదా ఆ మహనీయునిమోము!'' మఱునాఁడామె యాతనికిఁ గొన్ని ఫలములను, మధురాహారములను, ఒక కంబళమును బంపెను. ''ఈ పుణ్యక్షేత్రములోని యితరసాధువులను దర్శింపరా?'' యని శిష్యు లడుగ నామె యిట్లు సమాధానించెను: ''ఆ మహాత్ముని (చామేలిపురిని) సందర్శించినానుగదా? ఇఁక నితరులను జూచు టెందులకు? ఆతనికంటె నిచట నున్న సాధుసత్తముఁడు మఱెవ్వఁడు?''

## పదునేడవ ప్రకరణము

## ఉత్తర చరిత్ర

మహాత్ముల చరిత్రములు ఉదాత్తభావగర్భితములు, అశ్రాంతరమణీయములు, జగత్కల్యాణహేతుభూతములు. వారల మనోవాక్కర్మములు అద్భుత సామరస్యమున దీపింప సర్వదా పరార్థజీవులై వారు మనుచుందురు.

మాతృదేవి కలకత్తాలో భక్తబృందమునడుమ జీవింపసాగిననాఁటినుండియు నామె దివ్యచరిత్రమునందలి ముఖ్య సంఘటనములను క్రమమున నవలోకింతము.

పశ్చిమఖండదిగ్విజయయాత్రానంతరము శ్రీవివేకానందస్వామి భారతదేశమునకు విచ్చేసి, కలకత్తానగరమున బేలూరున శ్రీరామకృష్ణమఠమును ప్రతిష్ఠించిన పిమ్మట మాతృదేవి 1898-వ సంవత్సరము నవంబరు 13-వ తేదీని మొదటిసారి మఠమును సందర్శించెను. తన యతిపుత్త్రుల యోగక్షేమములకై మాతృదేవి యెట్లు పరితపించెనో—మఠనిర్మాణమునకై గురుదేవు నెట్లు ప్రార్థించెనో—కని యున్నాముగదా? ఆమె మాతృహృదయ మిపు డీ మఠమును గాంచి యెంతటి బ్రహ్మానందము నందెనో యెవరు వర్ణింపఁగలరు? మఠమునకు విచ్చేసిననాఁ డామె పూజామందిరమును స్వయముగా శుభ్ర మొనర్చి పూజ గావించెను.

1899-వ సంవత్సరము మాతృదేవికి అమితసంతాపహేతువయ్యెను. ఏలన, ఆ సంవత్సరముననే ఆమెయనుంగు తమ్ముఁడు అభయచరణుఁడును ప్రియశిష్యుఁడు యోగానంద

స్వామియు పరమపదించిరి. యోగానందుఁడు మాతృదేవికిఁ బండ్రెండుసంవత్సరము లేకరీతిని నిరుపమానసేవల నొనర్చిన యతిపుత్త్రరత్నము. ఆతని మరణమునుగూర్చి దుఃఖించుచు నామె యిట్లు పలికెను: "ఆహా! ఇంటినుండి యిపు డొక యిటుక కూలిపోయినది; మిగిలినవియుఁ గూలిపోవుట కిది సూచన."

యోగానందస్వామినిఁగూర్చి యామె యిట్లు వచించెడిది: "యోగేన్ వలె న న్నెవ్వరును ప్రేమింపలేదు. ఆతని కెవ్వరైనను అరరూపాయి ఇచ్చినపక్షమున, 'అమ్మకు యాత్రార్థ మిది కావలసివచ్చును' అని దానిని దాఁచి యుంచువాఁడుగదా! అహర్నిశము నా కాతఁడు పరిచర్య నొనర్చెను...."

1907–వ సంవత్సరమున మాతృదేవి గురుదేవుని గృహస్థశిష్యులలో ప్రధానగణ్యుఁడును జగద్విఖ్యాత నాటక కర్తయు నగు గిరీశచంద్రఘోషునింట దుర్గాపూజామహోత్సవమును దర్శించెను. మాతృదేవి కపుడు తఱచు మన్నెపుజ్వరము వచ్చుచుండినకతన, మొట్టమొదట నుత్సవమును దర్శింప నంగీకరింపలేదు. "అమ్మ రాలే" దని కుందుచు, గిరీశచంద్రుడు పూజామందిరమునకైనను వెడలకుండెను. ఆ మహాభక్తుని పరితాపమును గనుఁగొనికావలయు నాతని యభీష్టమును నెఱవేర్ప మాతృదేవి పాదచారిణియై యకస్మాత్తుగా నాతని యింటికి విచ్చేసెను. గిరీశుఁడును భక్తబృందమును బ్రహ్మానందభరితులైరి. దుర్గాదేవీనవరాత్ర

మున ముఖ్యదినము లన్నిటియందును మాతృదేవి వెడలి పూజలను గాంచెను.

కలకత్తాయందలి యుద్బోధనకార్యాలయమున మాతృదేవి నివసించుచుండ నామెకుఁ దోడునీడలై సేవల నొనర్చిన శిష్యులు యోగానందునకుఁబిమ్మట త్రిగుణాతీతానందుఁడు, శారదానందుఁడు * నను మహనీయులు. త్రిగుణాతీతానందస్వామి కొలఁదికాలముమాత్రమే యామెను సేవింపఁగల్గెను. శ్రీవివేకానందస్వామియనంతరము అమెరికా, ఇంగ్లాండు దేశములందు మూఁడు సంవత్సరములు (1895—1898) వేదాంతదీపమును బ్రజ్వలింపఁజేసి, పిమ్మట శ్రీరామకృష్ణమఠసేవాసంఘములకు కార్యదర్శియై మహాకార్యభారమును వహించుచుండియు మాతృదేవికి ఆమరణము అఖండసేవలను సల్పిన మహనీయుఁడు, అన్వర్థనామధేయుడు, శ్రీ శారదానందస్వామి. ఈతని శ్రద్ధాభక్తులను గాంచి పరమపరితోషమున మాతృదేవి యిట్లు పలికెను: "శరత్ (శారదానందుఁడు) జీవించియున్నంతవఱకు నాకే యిబ్బందియు నుండదు. ఆతనివలె నా భారమును వహింపఁగలవారెవ్వరు?" అస్థిరచిత్తులును దీనులునగు మాతృదేవి బంధువులను – రాధు మున్నగువారిని – సంరక్షించుటనిన విశేషవ్యయప్రయాసలుగదా? శారదానందునిఁ గూర్చి యతఁడు తన వాసుకి యని యామె పలుకును. అంత్యదశలో నామె యిట్లు వచించుచుండుట శిష్యబృందమున నొకరికి వినవచ్చెను: "అబ్బా! ఈ మనుగడ యిఁకఁజాలును. ఎచటికి

* వీరిరువురును శ్రీరామకృష్ణుని శిష్యులు.

వెడలిన, అచటికి శరత్‌ను నా ఒడిలో ఎత్తుకొనిపోవుదును.''
ఈ వచనములను విని స్వామి చంటిబిడ్డవలె విలపించెనఁట.

మాతృదేవి నివాసమునకై శారదానందస్వామి నిర్మించిన యుద్బోధనకార్యాలయమునను, ఆమెయనంతరము జయరాంబాటిలో నాతఁడు నెలకొల్పిన మాతృదేవీపూజామందిరమునను ఆతని భక్తిప్రపత్తులు రూపుదాల్చెను. స్వామి రచించిన భారతదేశమున మాతృపూజ (Mother Worship in India) అను గ్రంథరాజ మాతని శారదామాతృభక్తిని వేనోళ్లఁ జాటుచున్నది. భావబంధురములగు నీక్రిందివచనముల నాతఁ డీగ్రంథరాజమును మాతృదేవి చరణకమలములకు అంకితమొనరించెను :

ఎవ్వారికరుణాకటాక్షమున ఈ రచయిత సమస్తస్త్రీల యందును జగన్మాతృస్వరూపమును దర్శింపఁగలిగెనో అట్టి శారదామాతచరణసరోజములకు ఈ గ్రంథము భక్తిపూర్వకముగా సమర్పితము.

మాతృదేవికి యావజ్జీవము ననుచరురాండ్రై మెలఁగిన నారీమతల్లులను-శ్రీరామకృష్ణుని శిష్యురాండ్రను-గూర్చి యియ్యెడ నొకించుక చెప్పవలసియున్నది. గోలాప్‌మాయి, యోగేన్‌మాయి, లక్ష్మీదేవి, గౌరీమాయి * యనువా రిందు ప్రధానగణ్యులు. పరమేశ్వరధ్యానానందము, నిరాడంబరమగు త్యాగసేవలును వీరలజీవితములందు విలసిల్లినవి.

గోలాప్‌మాయి (గోలాప్‌మా) వీరందఱిలో మాతృదేవికి అత్యంతము తోడునీడయై మసలెను. ఈమెనుగూర్చి

* గౌరీమాయిదక్క వీరందఱును వితంతువులు.

శ్రీరామకృష్ణుఁడు మాతృదేవితో నిట్లు పలికియుండెను: "ఈ బ్రాహ్మణినిగూర్చి శ్రద్ధవహింపుము. ఈమె సర్వదా నీతో మెలఁగును." గురుదేవునివచనము లమోఘములు గదా! ముప్పదియాఱు సంవత్సరములపర్యంత మామె మాతృదేవికి సర్వవిధములను దోడ్పడుచు—గృహకృత్యముల నొనర్చుచు—సహచరురాలై మెలఁగెను. ఎచటికైనను—ఏ భక్తురాలియింటికైనను—మాతృదేవి వెడలు నపుడు గోలాప్‌మాయి యామెచెంత నుండితీరును. "ఆమె నాతో రానిదే నే నెట్లు వెళ్లుట? ఆమె నా చెంతనున్నదనిన, నాకు ఎంతో ధైర్యము" అని మాతృదేవి పలుకును. ఈమె మనోనైర్మల్యమును గొనియాడుచు మాతృదేవి యొకప్పు డిట్లు వచించెను: "గోలాప్ పరిశుద్ధమనస్కురాలు. ఆమె యెంత మహనీయురాలో! అందుచేతనే శుద్ధమనియు అశుద్ధమనియు ఆమె లేనిపోని యాచారము చేయదు, 'చాదస్తము' లేదామెకు. అట్టి చిత్తశుద్ధి సంపాదించుటకు మీకు మఱియొకవిధమైన శరీరము కావలయును...ఎంతో తపస్సుచేసిననేకాని, అటువంటి చిత్తశుద్ధి కలుగదు..." జపమున నామె సిద్ధిగాంచెనని మాతృదేవి మఱియొకప్పుడు తెలిపియున్నది. ఈమె మాతృదేవియనంతర మించుమించుగా నాలుగుసంవత్సరములు జీవించెను.

యోగేంద్రమోహినీ మాయి (యోగేన్ మా అనఁబడు యోగేంద్రమోహినీ విశ్వాస్) మాతృదేవికి ఆప్తురాలనఁదగు మఱియొక సహచరురాలు. గోలాప్‌మాయి వలెనే ఈమెయుఁ జాలకాలము తనతో మసలినకతన

మాతృదేవి యిట్లు పలికెడిది: "గోలాప్ యోగేనులకు నా మనుగడనుగూర్చి తెలియనివిషయము లేదు." శ్రీరామకృష్ణుఁడీమెనుగూర్చి యిట్లు వచించువాఁడు: "స్త్రీలలో యోగేన్ జ్ఞానయోగిని...ఈ సహస్రదళకమలము సకాలమున సంపూర్ణ వికాసము గాంచును."

మాతృదేవికిని యోగేన్‌మాయికిని గల పరస్పర ప్రేమానురాగములనుగూర్చి రామకృష్ణుని శిష్యులు(Disciples of Ramakrishna) అనుగ్రంథ మిట్లు తెలుపుచున్నది: "...ఒకప్పుడు యోగేన్‌మాయి యిట్లు వచించెను: 'నేనెప్పు డచటికి వెళ్లినను, అమ్మ మనసార మాటలాడుచు, తనరహస్యములన్నిటిని నాకుఁ దెలుపుచు, నా హితవచనములను వినఁగోరుచుండెడిది...ఏడెనిమిదిరోజులకొకసారి నేను దక్షిణేశ్వరము వెళ్లి, యొక్కొక్కప్పుడు రాత్రి యచట గడపుచుండెడిదానను. అపుడు అమ్మ నన్ను మఱెచటను బండుకొననీయక, పట్టుపట్టి తనతో నహబత్తునఁ బరుండఁ జేయుచుండెడిది. తొలిసారి అమ్మను నేను సందర్శించిన కొంత కాలమునకుఁ బిమ్మట నామె తనపుట్టినింటికి వెళ్లవలసివచ్చెను. గంగానదియొడ్డున నిలుచుండి, నేనామె యెక్కిన నావ యదృశ్యమగువఱకును అవలోకించినాను. అనంతరము నహబత్తునకు వెళ్లి, ఆమెయెడబాటును సహింపఁజాలక యెంతయో విలపించినాను. పంచవటికి వెడలుచు, గురుదేవుఁ డిదియంతయుఁ గాంచి, తనగదికి వచ్చి, నన్నుఁ బిలిపించి యిట్లు వచించెను: 'ఆమె యెడబాటు నీ కెంతో పరితాపమును గలిగించుచున్నది.' ఇట్లని ఆయన తమ తాంత్రికసాధనాను

భవములను దెలుపుచు నన్నోదార్పసాగిరి. ఇంచుమించు ఒకటిన్నరసంవత్సరములకు అమ్మ వచ్చినపిమ్మట నామెతో ఆయన యిట్లనిరి: 'చక్కని పెద్దపెద్దకన్నులు గల యా అమ్మాయికి—ఇక్కడ కప్పుడప్పుడు వచ్చుచుండు నామెకు —నీయందెంతో మక్కువ. నీవు వెడలిననాఁడు సహాబత్తున ఆమె యెంతో విలపించినది.' అమ్మ యిట్లు సమాధా నించెను: 'ఔను, నేనామెను బాగుగా ఎఱుఁగుదును, ఆమెపేరు యోగేన్.'"

బృందావనమున నీమె మాతృదేవితో నుండినపుడు తఱచు సమాధిస్థితి నొందుచుండెడిదని తెలియవచ్చుచున్నది. "సమస్తవస్తువులందును ఇష్టదైవసాక్షాత్కారము నొంది నాను" అని యామెయే యొకప్పుడు తెలిపెను.

మాతృదేవితో యోగేన్‌మాయి యనేక తీర్థ యాత్రల నొనర్చెను. మాతృదేవి కలకత్తాలో నివసింప సాగిననాఁటినుండియు యోగేన్‌మాయి యామెగృహనిర్వ హణమునఁ బాల్గొనుచుండెడిది. విరజాహోమమును తాంత్రిక పూర్ణాభిషేకమును సల్పి యీామె సర్వసంగపరిత్యాగ మొనర్చి, జపధ్యానములందును మాతృదేవిని సేవించుట యందును రమించుచుండెడిది. మాతృదేవి యీామెను తన నెచ్చెలిగా భావించెను. గీత, భాగవతము, చైతన్యచరితా మృతము, శ్రీరామకృష్ణవిషయకగ్రంథములను ఈమె పారాయణమొనర్చుచుండెడిది. డెబ్బదిమూఁడేండ్లవయస్సున (1924-వ సంవత్సరమున, గోలాప్‌మాయి గతించినయేఁటనే) ఈమె పరమపదించెను.

మాతృదేవిసాంగత్యమున మెలఁగిన మఱియొకధన్యురాలు గౌరీ మాయి (గౌరీ మా). ఈమెపారమార్థికసంపదకు వ్యవహారదక్షతయు చక్కనివైదుష్యమును వన్నె దెచ్చెను. వివాహమును రోసి చిన్ననాఁటనే యామెసర్వసంగపరిత్యాగ మొనర్చి, హిమాలయమున కేఁగి యఖండతప మొనర్చెనని తెలియవచ్చుచున్నది. 1882-వ సంవత్సరమునుండియు నీమె చాలవఱకు మాతృదేవితో సహజీవనము నివసించుచు, ఆమెను, గురుదేవుని విశేషశ్రద్ధాభక్తులతో సేవింపసాగెను. మాతృదేవియెడఁ దనయఖండగౌరవభావమును బ్రకటించుచు శ్రీ శారదేశ్వర్యాశ్రమము అను నొకవిద్యాసంస్థను బాలికలకై యీమె నెలకొల్పెను. కలకత్తానగరమున నేఁడు మహారాణీ హేమంతకుమారీవీథిని ఈ విద్యాలయము వెలయుచు, స్త్రీ విద్యాసంస్థలయందుఁ బేరుగాంచియున్నది. బాలికలకు ఆవశ్యకమగు కళలను విద్యలను గఱపుటయేగాక, త్యాగము, భక్తి, పావిత్ర్యము మున్నగు భారతజాతీయాదర్శములను వెల్లొందఁజేయు గృహశిక్షణమును ఈ విద్యానిలయమున తపస్వినీమణులు గఱపుచుందురు.

గౌరీమాయియు మాతృదేవియు నొండొరులయెడ విశేషప్రేమగౌరవములతో మెలఁగువారు. మాతృదేవియెడఁ దన యఖండపూజ్యభావమును గౌరీమాయి యొకప్పు డీక్రింది వాక్కులలోఁ బ్రకటించియున్నది :

'శ్రీ శారదాదేవి గురుదేవునకు సహధర్మచారిణియై యొప్పుటయేగాక, ఆయనచే (షోడశీపూజయందు) సాక్షాత్ పరమేశ్వరిగా ఆరాధింపఁబడియెను. భార్య పరమేశ్వరిగా

పూజింపఁబడుట అపూర్వసంఘటనముగదా? ... మాతృదేవి యెంతటి మహనీయవ్యక్తియో లోక మింకను గుర్తింపఁజాల కున్నది. ఆమె జీవితౌన్నత్య ప్రాముఖ్యములను బాగుగా గ్రహించుట లోకమున కంతకును ఉదారదృష్టి నలవడఁజేయఁ గలదనుట నిస్సంశయము.

మాతృదేవియెడ గౌరీమాయికిఁగల యఖండపూజ్య భావము దుర్గాపూజాసమయమున నొకప్పుడు సుప్రకాశితమై యొప్పెను. పాడ్యమి మొదలుకొని నవమివఱకునుగల పూజాదినములన్నిటను ఆమె మాతృదేవి సన్నిధానమున దేవీమాహాత్మ్యపారాయణ మొనరించెను. తుదిని విజయ దశమినాఁ డామె నూటయెనిమిది పద్మములచే మాతృదేవిని సమంత్రకముగా పూజించి యిట్లు పలికెను: "అమ్మా! దేవీమాహాత్మ్యమును సాక్షాద్దేవీసన్నిధిని పఠించుటచే నా పారాయణవ్రతము నేఁడు పరిసమాప్తి నొందినది. ఇంతటి నుండి దుర్గాపూజాదినములలో ఈ పారాయణము నాకు విధ్యుక్తముగాక, కేవలము మీ యిచ్ఛవలన నిర్ణయింపఁ బడుఁగాక!"

మాతృదేవి గౌరీమాయినిఁ గన్నకుమార్తెవలెఁ బ్రేమించును: ఆదరపూర్వకముగా నామెను 'గౌర్దాసి' (గౌరీదాసి) యని పిలుచును; ఆమెపాండితిని సర్వతోముఖ ప్రతిభను గొనియాడును. మాతృదేవి యొకప్పు డిట్లు వచించెను: "మహనీయులు దుర్లభులు, ఇతరులు వారికి సాటిరారు. గౌర్దాసి యటువంటి మహనీయురాలు."

ప్రజాసేవకై గౌరీమాయి యొనర్చిన కార్యములన్నియు మనఃపూర్వకమగు మాతృదేవిసమ్మతిని ప్రోత్సాహమును బడసెను. మాతృదేవి యాశీస్సుల నందియే యామె తన బాలికావిద్యానిలయమును నెలకొల్పెను. ఆ సంస్థను మాతృదేవి యెన్నియోసారులు దర్శించి తదీయాశయములును అందలి విద్యావిధానమును దనకు ఆనందదాయకములని తెలిపెను. గౌరీమాయి తఱచు తనవిద్యార్థినులను ఉపదేశార్థము మాతృదేవిసన్నిధికిఁ దోడ్కొని వచ్చుచుండెడిది. *

* మాతృదేవితోఁ గలిసిమెలసి మెలఁగిన మహిళామతల్లు లింకను నెందఱో గలరు. వీరిలో లక్ష్మీదేవి, గోపాలునితల్లి (గోపాలేర్ మా) యనువారు గణుతింపఁదగినవారు. శ్రీరామకృష్ణుని యన్నకుమార్తెయగు లక్ష్మీదేవి మాతృదేవికి గృహకృత్యములలోఁ దోడ్పడుచు, ఆమెతో సాధనల నొనర్చుచు, దక్షిణేశ్వరమున నహబత్తునఁ జాలకాలము నివసించెను. ఈమెనుగూర్చి మాతృదేవి యిట్లు పలికియున్నది: "లక్ష్మీమణి మహాభక్తురాలు. ఇతరభక్తులతో ఆమె నృత్యసంకీర్తనములు చేయును; జాతిభేదములను బాటింపక, వారితో భుజించును...'' సంభాషణమునను నృత్యగీతాదులందును లక్ష్మీదేవి కడునిపుణురాలు. హరికథాకాలక్షేపములను జేయుచు, ఈమె తన్మయతను సమాధిస్థితులను బొందుచుండెడిది. అంత్యదశలో నీమె యనేకులకు మంత్రోపదేశ మొనర్చెను.

గోపాలునితల్లి యనునామె మహాభక్తురాలు. వాత్సల్యభావమున గోపాలునిఁ బూజించి యామె నిరంతర సాక్షాత్కారము నందెను. శ్రీరామకృష్ణు నీమె తనగోపాలునిగను మాతృదేవినిఁ దన కోడలిగను పరిగణించుచుండెడిది. దక్షిణేశ్వరమున కేతెంచినపుడెల్ల, ఈమె మాతృదేవితోఁ గొలఁదిదినములు నివసించుచుండెడిది. అంత్యదశలో నీమెను సోదరి నివేదిత సంరక్షించెను.

# పదునెనిమిదవ ప్రకరణము

## స్త్రీసముద్ధరణసమస్య : మాతృదేవి

స్త్రీసముద్ధరణమునుగూర్చియు నారీమణుల యాదర్శములను గూర్చియు మాతృదేవి యభిప్రాయమేమని మన మిప్పట్టున విచారింపనగును. "భారతనారీత్వాదర్శమునుగూర్చి శ్రీరామకృష్ణుని పరమసిద్ధాంతమే శారదా మాత" యని భారతమాతృనివేదితహృదయ యగు సోదరి నివేదిత వచించి యున్నది. అగుచో నామె భావ మేమి?

స్త్రీకి ప్రత్యేకవ్యక్తిత్వము గలదు. అయ్యది మాతృత్వమున, లేక మాతృభావమున సువ్యక్తమగుచున్నదని చెప్పనొప్పును. ఏనిర్మల ప్రేమనిలయము, సర్వభూత ప్రేమాస్పదము నగు మాతృత్వము స్త్రీధర్మమగు టామె సౌభాగ్యముగదా!

ఐనను స్త్రీధర్మమును మాతృత్వమని యేల చెప్పవలె ననియు, తన్మూలమగు సతీత్వమని యేల తెలుపరాదనియు శంకింపవచ్చును. స్త్రీ తనస్వభావమున మాతృత్వమును బ్రకాశిత మొనర్పఁజాలనిచో, సతీత్వమును బ్రకటింపఁజాల దనియు మాతృత్వపారిజాతముననే సతీత్వసౌరభము శోభిల్లు ననియు మా సమాధానము. సతీత్వమందలిసారము కామోపభోగము కాదు, సంతానము గాంచుటయుఁ గాదు. మాతృదేవియే తనసన్నిహితురాలి కిట్లు తెలిపియున్నది: "ఇన్ని దినములుగా నావలన నీవు నేర్చిన దేమి?...పవిత్రజీవనము—కామకళంక మణుమాత్రమును లేని జీవనము—

ఎట్టిదో కలనైనను తలంపఁజాలవా? ఇఁకనైనను * భర్తతో నీవు సోదరీసోదరులవలె జీవింపరాదా?...'' దాంపత్యజీవనము కామవినిర్ముక్తమైనపుడే పరమపవిత్రమై బ్రహ్మానందదాయకమై దీపించుననియేకదా ఇందలి భావము? నిజమగు సతీత్వము క్రమముగా సాంసారికవాసనల నతిక్రమించి ప్రేమాంబుధియగు మాతృభావమున సంగమించును. కుటుంబజీవన మపుడు జగత్కుటుంబజీవనమై విరాజిల్లును.

గృహస్థజీవనమునకు సౌభాగ్యదేవత గృహిణి. ఆమె వినిర్మల ప్రేమవీక్షణముననే గృహము ఆనందధామమై యొప్పారును. ఆమె సహనశీలమే కుటుంబమున సంఘీభావమును నెలకొల్పును. ఆమె స్వార్థరహిత సేవలే గృహమును స్వర్గతుల్య మొనర్చును. ఈ కళ్యాణగుణ జ్యోతులను తనుపు తైలము మాతృభావమేకదా! స్త్రీలిట్టి మాతృభావమునకుఁ గొఱవడిన సంఘములందలి గృహములు విచ్ఛిన్నములగుటయు కుటుంబజీవనము అసాధ్యమై పోవుటయు నేఁడు కనుచున్నాము. ఒకవేళ నయ్యవి యొకింత నిలిచినను, అందలి పటుత్వమును పవిత్రతయుఁ దొలఁగిపోవ, గృహమున వికసింపవలయు జాతీయ సుగుణములు అంతర్ధానమగుచున్నవి, సభ్యత చితి నెక్కుచున్నది.

ఇవ్విషయమున శ్రీ వివేకానందస్వామి యిట్లు వచించియున్నాఁడు : ''ఏజాతియైనను పరిపూర్ణమైన సంయమమును బ్రహ్మచర్యవ్రతాదర్శమును ప్రాపింపఁగలుగుటకు

* ఒకరిద్దఱు బిడ్డలను గనియుంటివిగదా యని భావము.

ముందు వివాహము పావన సంస్కారమనియు తన్నియమ ములు అనుల్లంఘనీయములనియు గ్రహించి, మాతృత్వము నెడ మహాగౌరవభావము నలవఱచుకొనవలయునని నా యభిప్రాయము.'' *

స్వధర్మచోదితము, గృహధర్మపరిపోషకము నగు విద్యను నేర్చి, మహిళామతల్లులు కుటుంబమునకే కాక, లోకమునకును సేవల నొనర్చుట మాతృదేవికి అభీష్టమని గ్రహింపనగును. ఒకప్పు డొక భక్తురాలు మాతృదేవిని సమీపించి యిట్లు తెల్పెను: ''అమ్మా! మా యింటి బాధలు నాకు దుర్భరముగా నున్నవి. నాకు ఐదుగురు కూఁతులు. కాని వారికిఁ బెండ్లియగు తెరువు కానరా కున్నది. ఏమి చేయుదును?'' మాతృదేవి క్షణ మూరకుండి యిట్లు విమర్శించి పల్కెను: ''వారి వివాహమునుగూర్చి నీకింత తాపత్రయ మెందుకు? తగిన వరులు దొరకకున్న యెడల, సోదరి నివేదిత బాలికా పాఠశాలకు † వారి నేల పంపరాదు? అనాయాసముగా వారచట విద్య నేర్వవచ్చునే! అపుడు వారును సుఖవంతురాండ్రై పరహితార్థము పాటు

* శ్రీ వివేకానంద లేఖావళి, రెండవభాగము.

† ఈ బాలికాపాఠశాలకు బాలీ (Bally), కోమిల్లా (Comilla) అనుతావులందు రెండుశాఖలు గలవు. భారతనారీత్వాదర్శమున కనుగుణ మగు శిక్షణ గఱపఁబడుచు, సంస్కృతము, ఆంగ్లము, దేశీయభాషయు నిందు విద్యార్థినులకు బోధింపఁబడుచున్నవి. బోధకురాండ్రకు వలయు శిక్షణ గఱపు 'శ్రీ శారదామందిరము' అను మహిళావిద్యానిలయమును ఈ బాలికాపాఠశాలకుఁ జేర్పఁబడియున్నది. కలకత్తాలో నేఁ డివి ప్రసిద్ధిగాంచిన స్త్రీవిద్యాసంస్థలు.

పడఁగలరు.'' మఱియొకప్పుడు గోలాప్‌మాయి రాధను (మాతృదేవి పెంచిన బాలిక) ప్రాయమువచ్చిన బాలిక యను కారణమున పాఠశాలకు వెళ్లవద్దని నిరోధింప, మాతృదేవి యిట్లు పలికెను : "ఆమె కేమంత ప్రాయమువచ్చినది? ఆమె కద్దుతగులక బడికి వెళ్లనీ. ఉపయోగకరములగు చేతి పనులను తగిన విద్యను నేర్చుకొనిన పక్షమున పరుల కా బాలిక యెంతో తోడ్పడవచ్చునుగదా? ప్రాజ్ఞతలేని గ్రామములో ఆమెకుఁ బెండ్లియైనది. విద్య నేర్చుకొనుటవలనఁ దాను బాగుపడుటయేగాక, ఆమె తన బంధుగులకును స్వగ్రామములోని యజ్ఞానులకును ఎంతో ఉపకరింపఁ గలదు.'' వేఱొకప్పుడు మాతృదేవి యిట్లు వచించెను : "బాలబాలికలు సదా పనిపాటులు గలిగియుండవలయును. లేనిచో, దుష్టచింతలు వారి తల కెక్కును. కావున వారికి పనిపాటులు గల్పించుట తల్లిదండ్రులకును ఉపాధ్యాయులకును పరమవిధియై యున్నది. ఇవి నేను స్వానుభవముతోఁ జెప్పుచున్న మాటలు. జయరాంబాటిలో నా చిన్నతనమున ఏదోయొక పనిలో అహర్నిశము నిమగ్నురాలనై యుండుదానను. పనిలేనిదే ఎక్కడకును వెళ్లుదాననుగాను. ఉబుసుపోని సుద్దులతో — లోకాభిరామాయణముతో — కాలక్షేపము చేయుటనిన నాకు పరమాసహ్యము. పనిలేని పక్షమున, ఏదోయొక పనిఁ గల్పించుకొనవలయునుగాని వ్యర్థ సంభాషణలతో శక్తిసామర్థ్యములను దుర్వినియోగము చేసికోరాదు. సోమరితనము చెడుగునకుఁ బుట్టినిల్లు. కాలము అమూల్యము, పోయిన కాలము తిరిగిరాదు.''

స్వజాతీయములును గృహధర్మ విహితములు నగు పనులను—ఇంటియందనుఁడు, బయటననుఁడు—నారీమణులు నిర్వహించుట మాతృదేవికి అభిమతము. స్త్రీవిద్యార్థమై, స్త్రీసముద్ధరణనిమిత్తమై గౌరీమాయియు సోదరి నివేదితయు నెలకొల్పినసంస్థలపై ఆమె యెట్లు శుభాశీతలను జల్లెనో చూచియున్నాముగదా? నివేదితయనంతర మామెయుద్యమమును గొనసాగింప సోదరి సుధీరను మాతృదేవి ప్రోత్సహించెను; స్త్రీవసతిగృహనిర్వహణార్థము కుటుంబములలోఁ బిల్లలకు పాఠములు చెప్పి ద్రవ్యార్జనమొనర్ప నామెకుఁ దన యంగీకారము నొసఁగెను. ఒకప్పు డొకశిష్యురాలు ఆసుపత్రిలో మంత్రసానిపనిని నేర్చుకొనుటకు మాతృదేవి సమ్మతినిఁ గోర, గోలాప్‌మాయి మున్నగువారు, 'అగ్రజాతి స్త్రీయేమి, ఆసుపత్రిలో మంత్రసానిపనియేమి?' అని యధిక్షేపించినను మాతృదేవి యామె తన్మూలమునఁ బలువురు దీనులకు సేవచేయఁగలుగునని తెలుపుచుఁ దన యంగీకారము నొసఁగెను.

అర్హులగువారలను మాతృదేవి యఖండబ్రహ్మచర్యము నవలంబింపఁ బ్రోత్సహించెను. పెండ్లి చేసికొనుమని తనకూఁతును హెచ్చరింపుఁడని యొకభక్తురాలొకనాఁడు మాతృదేవినిఁ గోరెను. కాని యామె యిట్లు సమాధానించెను: "జీవితకాలమంతయు నొకరికి దాస్యము చేయుచు వారి యాటలకును బాటలకును తాళమువేయుచుండుట ఘోరదుఃఖము కాదా? బ్రహ్మచర్య మవలంబించుట దుస్సాధమేయైనను వివాహముదెస దృష్టి మఱల్పనివారికి

బలవంతముగాఁ బెండ్లి చేసి సంసారకూపమునఁ గూలఁ ద్రోయుట మంచిదికాదు. అది దారుణహింస.''

స్వీయధర్మమగు మాతృత్వమును బరిపాలించుచు, స్వజాతీయసంస్కృతిని బోషించుచు, మహిళామతల్లులు తమ యాశయములందును వర్తనమందును ఆత్మవ్యక్తిత్వమును ప్రతిభను ప్రకాశితమొనర్పవలయునని మాతృదేవి కాంక్షించెను. స్వమర్యాదను స్త్రీలు కాపాడుకోవలెనని యామె కోరెను. అంధప్రాయముగా పురుషుల ననుకరింపరాదనియు స్త్రీలు నిక్కముగా గృహలక్ష్ములై వెలయవలయుననియు నామె యభిలషించెను.* స్త్రీసంస్కృతియందలి విశిష్టతను

* ప్రాచ్యపాశ్చాత్య మహిళల శీలవర్తనముల నొండొంటితోఁ బోల్చుచు, శ్రీ వివేకానందస్వామి నుడివిన యీ క్రింది వాక్కులు ఈ సందర్భమున గమనింపఁదగియున్నవి:

''ఈ పవిత్ర భారతభూమియందు—సీతా సావిత్రు లుద్భవించిన యీ పుణ్యభూమియందు—ఇంకను స్త్రీలలో ప్రపంచమున మఱియెచ్చటను నాకుఁ గానరాని యట్టి దివ్యశీలము, అట్టి సేవాతత్త్వము, అట్టి ప్రేమభావము, అట్టి సానుభూతి, అట్టి సంతృప్తి గౌరవములు కానవగును. పాశ్చాత్యదేశములలో స్త్రీలు తఱచు స్త్రీలుగ నున్నట్లే కనఁబడలేదు, వారు కేవలము పురుషులకు నకళ్లుగాఁ గాన్పించిరి! వాహనములను దోలుచు, కార్యాలయములలో గులాములవలెఁ బని చేయుచు, పాఠశాలల నాశ్రయించుచు, ఎంతసేపు ఉద్యోగపు గొడవయే,—వారికి! స్త్రీ గౌరవమర్యాదలు, స్త్రీ లజ్జాశీలము—ఇవి భారతదేశమునందు మాత్రమే మన కంటఁబడి కన్నులకు ఉపశాంతి దాయకమై యొప్పుచుండును.''

త్రద్రక్షణమార్గములను ఉపదేశమూలమునకంటె సౌశీల్య వర్తనములమూలముననే విశేషముగా లోకమున కామె చాటియున్నది కదా?

---

ప్రేమామృత నిలయమగు గృహమే స్త్రీలకు విధ్యుక్తకార్య రంగమని మహిళామతల్లులును పెక్కురు వక్కాణించియున్నారు. స్త్రీసముద్ధరణోద్యమమున పేరు గాంచిన శ్రీ ముతులక్ష్మిగారు (ఆర్యనారీమణుల ధర్మములన్నియు మాతృదేవియందు మూర్తీభవించెనని తెలుపుచు నామె జీవితమును ఆంగ్లమున సంగ్రహముగ నయ్యాను, అతిరమ్యముగా రచించిన విదుషీమణి) 1934-వ సంవత్సరమున తిరువాన్కూరు మహిళా సభకు అధ్యక్షతవహించిన సందర్భమున నిట్లు పలికిరి: "అన్ని నాగరికతలును గృహమునఁ బుట్టినవి. భావిజనులును జాతులును గృహమందే పెరిఁగి, గృహమందే పెంపొందవలెను. ప్రధానమైన ఈ జీవనధర్మము వైపు మనవిద్య పెడమొగము పెట్టకుండుఁగాక! పాకకళ మున్నగు నింటిపనులన్నియు గౌరవప్రదమైనవి. వీనియందు మనబిడ్డలకు మనము శిక్షణ గఱపవలెను."

కొన్నేండ్లకుమున్ను ఆంధ్రరాష్ట్రీయ మహిళాసభకు అధ్యక్షత వహించిన శ్రీ పొణకా కనకమ్మగా రిట్లు పలికిరి: "స్త్రీస్థానము ఒకప్పుడు మేరుశిఖరాన్ని అధిష్ఠించినది... నేఁడు ఒకజాతీయస్మృతి గాని, ఆదర్శం గాని లక్ష్యం అగుటలేదు. అనుకరణం నాగరికతగా పరిగణింపఁబడుతూ ఉన్నది. వేషభాషలలో సహితం ఇది మన స్వకీయ శక్తితేజస్సులు కోల్పోవడానికి కారణమవుతూ ఉన్నది... నిజంగా స్త్రీ గృహలక్ష్మి... పునరభివృద్ధి మనమీఁదనే ఆధారపడిఉన్నది. ఈ ఉద్యమానికి మనం సంపూర్ణంగా తోడ్పడాలి. నేఁడు దేశసేవకు నడుముగట్టిన సాధ్వీమతల్లులలో గార్గి సులభలు, సీతా ద్రౌపదీ సత్యలు, వీరమతీ సంయుక్తా రుద్రమదేవీ దుర్గావతీ ఝాన్సీరాణులు, మొల్ల మల్లమదేవులు ప్రజ్వలించాలి..."

(సాహిత్యభూషణ శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి 'విద్యార్థ ప్రకాశిక' నుండి ఉద్ధృతము.)

ఆదర్శసతి, ఆదర్శసన్న్యాసిని, ఆదర్శమాతయునగు శ్రీ శారదాదేవి, "భారతనారీత్వాదర్శమునుగూర్చి శ్రీరామకృష్ణుని పరమసిద్ధాంతము" అని ప్రకటింపఁబడు టతిశయోక్తి కానేరదు. భారతనారీత్వాదర్శమునుగూర్చి యననేల, ప్రపంచమందలి సమస్తనారీమణుల యాదర్శమునుగూర్చియు నిక్కముగా నామె యాతనిపరమసిద్ధాంతమని చెప్పనొప్పును. శారదామాతను గనిన భారతమాత ధన్యురాలు. "భగవన్మాతృభావమును లోకమునకుఁ బ్రకటించుటకై గురుదేవుఁడు (శ్రీరామకృష్ణుఁడు) నన్నీ యిలలో నుంచివెడలెను" అను మాతృదేవివాక్కులు భావబ్రహ్మాండగర్భితములు.

# పందొమ్మిదవ ప్రకరణము

## మాతృదేవి సందేశము

మాటలమూలమునకంటెఁ జేతలమూలముననే మహనీయులు లోకమునకు విశేషముగా బోధించుచుందురు. ఆచరణశూన్యమగు నుపదేశములు అసువులువాసిన కళేబరముల వంటివి. మాతృదేవి లోకమున కేమైన బోధించె నన్నచో, తా నట్లాచరించి చూపుటయే యామె బోధనలందలి మహత్త్వము.

మహోన్నతతత్త్వములను, ఆధ్యాత్మికసమస్యలను మాతృదేవి తనసహజసరళ వాక్కులందు అరఁటిపం డొలిచిన రీతిని విశదీకరించును. ఆమె సందర్శనము దివ్యావేశజనకమై యొప్పినచో, ఆమెసంభాషణము తత్త్వజ్ఞానదాయకమై దీపించెను.

భక్తులతోడను శిష్యులతోడను ఆమె యొనర్చిన సంభాషణలందును వారల కామె గావించిన యుపదేశములందును దీపించు నామెసందేశము నిట సంగ్రహముగాఁ దెలిపెదము.

"బ్రహ్మవిద్యను గ్రహింప నర్హులగువారు అరుదుగాఁ గాని కానరారు. నరుఁడు మొట్టమొదట అర్హతను సంపాదింపవలయును. లేనిచో వానికి చేసిన బోధలు నిష్ఫలము."

మానవుఁడు తనయజ్ఞానమువలన హృదయాంతర్జ్యోతి యగు భగవానునిఁ గనఁజాలకున్నాఁడను శ్రీరామకృష్ణుని వాక్కులను స్మరించుచు, మాతృదేవి యిట్లు పలుకను:

"కస్తూరీమృగమునకు నాభియందు కస్తూరి యేర్పడును. దాని పరిమళముచే ఆకర్షింపఁబడి అది యిందందుఁ దిరుగాడును. తన యందుండియే పరిమళము వెలువడుచున్నదనుసంగతి దానికిఁ దెలియదు. అదేవిధముగా భగవంతుఁడు తనయందే నెలకొని యున్నను, మానవుఁడు గ్రహింపఁజాలకున్నాఁడు. అందుచే ఆనందముకోసము ఆతఁ డెందెందో వెదకుచుండును. భగవంతుఁడే నిత్యుఁడు, మిగిలినదంతయు అనిత్యము, మిథ్య."

పరిపూర్ణమైన యాత్మానుభవము నొందునెడ సమస్త దృశ్యప్రపంచమును మాయామాత్రముగాఁ దోఁచుననియు భగవద్భావనసైత మతిక్రమింపఁబడుననియుఁ దెలుపుచు మాతృదేవి యొకప్పు డిట్లు పలికెను: "కాలక్రమమున, అనఁగా, పర్యవసానమున దేవునియునికిగూడ తోఁచదు. జ్ఞానము నొందిన వెనుక సమస్తదేవతలును—దేవుఁడుగూడ—మాయామాత్రముగాఁ దోఁచును. సర్వము కాలక్రమమున భాసించుచున్నది, కాలక్రమమున అదృశ్యమై పోవుచున్నది. ...దైవము మొదలగునవన్నియు నిజముగా అదృశ్యమై పోవును."

పరమార్థమున అద్వైతము నిట్లంగీకరించుచున్నను, పారమార్థికసాధనలందు భక్తిమార్గమే సర్వోత్కృష్టమని మాతృదేవి వక్కాణించును. మిట్టవేదాంతవైఖరి నొకప్పు డొకశిష్యుఁడు "సృష్టి, సృష్టికర్త—సర్వము మిథ్య" యని తనపాండితినిఁ బ్రకటింప నారంభింప, మాతృదేవి యాతని మందలించుచు నిట్లు పలికెను: "ఓయీ, వినుము. నరేన్ (వివేకానందస్వామి) నాతో నొకప్పు డిట్లన్నాఁడు:

'అమ్మా! గురుపాదపద్మములను మిథ్యాభూతములని త్రోసి పుచ్చు జ్ఞానము కేవలము అజ్ఞానము. గురువును ద్రోసి రాజను జ్ఞానము నిస్సారము, కుయుక్తి.' నాయనా! నీ మిట్టి వేదాంతము కట్టిపెట్టు. ఈ శుష్కవాదము నిరర్థకము. వాదించి, తర్కించి, భగవంతునిఁ దెలిసికొనిన దెవ్వరు? శ్రీ శుకుఁడు వ్యాసుఁడు మొదలగు మహనీయులు సైతము పెద్ద పంచదారకొండనుండి యొకటి రెండు నలుసుల నెత్తి కొని పోవ యత్నించు కండచీమలవంటివారు."

భక్తిమార్గమే మాతృదేవిబోధనలందలి ప్రధాన విషయమై యొప్పెను. ఆమె యిట్లు పల్కెను: "నీ యిష్ట దేవతను గూర్చి ధ్యానింపుము, జపింపుము, ప్రార్థింపుము. ధ్యానము హృదయమున ఆరంభమై శిరస్సున పరిసమాప్తి నొందును. మంత్రములందును శాస్త్రములందును ఏ మున్నది? భక్తిమూలముననే సమస్తము సాధ్యమగును." జపాది సాధనలనుగూర్చి యామె యొకప్పు డిట్లు వచించెను: "వీనిమూలమున కర్మబంధములు విచ్ఛిన్నమై పోవును. కాని ప్రేమభక్తి (అనఁగా ఉత్కృష్టమగు పరభక్తి) లేనిదే భగవంతుని సాక్షాత్కారము లభింపదు. జపతపము లెందుకో తెలియునా? వానిమూలమున ఇంద్రియముల మదము అణఁగును."

భగవానుని శరణుజొచ్చుటయే తరణోపాయమని తెలుపుచు నొకప్పు డామె యిట్లు పలికెను: "మానవుని తెలివి ఏపాటిది? తనకొకటి కావలసియుండ, దేవు నాతఁడు మఱియొకదాని కోసము అర్థించును. అయ్యవారినిఁ జేయఁ

బోయి కోఁతినిఁ జేసెనఁట! తఱచుగా ఇదియే మనపద్ధతి. అందుచే సమస్తవాంఛలను భగవత్పాదారవిందముల మ్రోల సమర్పించుటయే సర్వోత్తమము. మన కేది మేలో భగవంతుఁడే చేయును. కాని భక్తివైరాగ్యము లిమ్మని వానిని ప్రార్థింపవచ్చును. ఇవి కోరికలలోనివి కావు. దేవునికోసము సర్వము త్యజించినవ్యక్తి ప్రత్యక్షదైవము. భగవంతుని శరణుజొచ్చినవానికి విధికూడ తొలఁగిపోవును, అట్టివాని నుదుట బ్రహ్మ తాను వ్రాసిన వ్రాఁత తానే చెఱిపివేయును ...దివ్యదృష్టిచే అతఁడు భగవంతునిఁ గనును; దివ్యశ్రవణమున వానిపలుకుల నాలకించును; వానితో దివ్యసంబంధము నొందును.'' భగవానుని మన యాప్తునిగా భావింపవలయు నని తెలుపుచు మాతృదేవి గోపబాలకుల నుదాహరించి శ్రీకృష్ణునియెడ వారిప్రేమభక్తిని వర్ణించును. సాక్షాత్కారమునకుఁ దుదకు భగవదనుగ్రహమే కారణమనియు జపతప సాధనలన్నియు కేవల మనోనైర్మల్యమునకుఁ దోడ్పడు ననియు నామె వక్కాణించును. భగవత్కృప నిర్హేతుకమని తెలుపుచు నామె యిట్లు పలుకును: "జపతపము లనెడు ఖరీదు నిచ్చి కొనుటకు భగవంతుఁడు కూరగాయలవంటి వాఁడు కాఁడు." "భగవానుని నైజము పసిబాలుని నైజము వంటిది. పసివానిచేతిలో పటికిబెల్లము ఉన్న దనుకో. కొందఱు తమ కిమ్మని వానిని బతిమాలుదురు. కాని యతఁ డీయఁడు. ఐనను, తన యిచ్చవచ్చిన మఱియొకరికి సులభముగా నిచ్చివేయును. యావజ్జీవము నొకఁడు అఖండ తపస్సుచేయును, కాని భగవంతునిఁగనఁజాలక పోవును;

చెప్పఁదగిన ప్రయత్నమేమియు లేకయే మఱియొకఁడు వాని సాక్షాత్కారముపొందును. కారణము భగవదనుగ్రహము."

దీనినిబట్టి మానవప్రయత్నమును మాతృదేవి 'చిన్న చూపునఁ జూచెనని తలఁపరాదు. ఆమె యిట్లు పలుకును: "సర్వము ఈశ్వరసంకల్పముననుసరించియే జరుగును. ఐనను మానవుఁడు కృషిచేయవలయును. ఏలయన, మానవకార్యముల మూలముననే ఈశ్వరుఁడు తన సంకల్పమును ప్రకాశింపఁజేయును. మఱియు పూర్వకర్మముల ననుసరించియే మనకు అనుకూల పరిస్థితులు లభించుచుండును. అంతేగాక, ప్రస్తుతకర్మములచే పూర్వకర్మములుసైతము పరిహరింపఁబడును." * "విషయమిది: ఇంటిలో నానావిధపదార్థములును ఉండవచ్చును. కాని వానిని వండుకొనవలయును గదా? శీఘ్రముగా వండుకొనినవానికి శీఘ్రముగనే భోజనము లభించును...తీవ్రసాధన చేయువారికి త్వరితముగా భగవల్లాభము కలుగును."† అంతయు స్వప్రయత్నమేయనికాని, ప్రయత్నము నిష్ప్రయోజనమనికాని భావింపక, అహంకారవిరహితముగా — భగవదాయత్తబుద్ధితో — సాధన చేయవలయునని భక్తులకుఁ దెలుపుటయే మాతృదేవి యభిమతము. "భగవదనుగ్రహము - భగవత్ప్రాప్తి - కోమటి బేరపు టిచ్చిపుచ్చుకొనుట వంటిదిగాదు" అని యామె పలుకును. అనుగ్రహప్రభావమునువర్ణించుచు నొకప్పు డామె

* "ప్రతికూలం తథా దైవం పౌరుషేన విహన్యతే" — మత్స్య పురాణము.

† "తీవ్రసంవేగానామాసన్నః." — పాతంజలయోగసూత్రములు.

యిట్లు వచించెను : "పల్లమునకుపాఱుట నీటి స్వభావము. కాని సూర్యకిరణములు దానిని పైకెత్తి యాకసమునకుఁ గొనిపోవునుగదా! తుచ్ఛవిషయములకోసము ప్రాఁకులాడుట మనస్స్వభావము; కాని భగవదనుగ్రహము దానికి ఉత్తమగతిని గల్పించి ఉన్నతాశయములదెస మఱల్పఁ జాలును." అనుగ్రహమున కేమైన హేతువనునది యున్నచో, అయ్యది వినిర్మలభక్తియని యోమె పలుకును.

కాని యీ విధమైనభక్తి మహాదుర్లభము; లౌకిక వాసనాలేశము హృదయమున నున్నంతవఱకు 'ప్రేమభక్తి' సుగంధము అందుండి వెలువడదు. భగవదంశసంభూతమగు నీశ్వరకోటిమాత్రమే దానిని పుష్కలముగాఁ బడసి యుండును. మాతృదేవి యొకప్పు డిట్లు పలికెను : "ముక్తి నెవ్వరికైనను భగవంతుఁ డనుగ్రహింపవచ్చును; కాని భక్తి నంత సులభముగా ప్రసాదింపఁడు."

భగవంతుని నమ్మి, ఓరిమితో సాధనలను సాగించుచుండవలయునని మాతృదేవి శిష్యుల నిట్లు హెచ్చరించును : "భగవద్దర్శనము లభింపలేదని సాధనను విడువరాదు. ఎర వేసి గాలపుఁజువ్వను జేపట్టి పల్లెవాఁడు కూర్చున్నంతనే పెద్దచేఁప వానికిఁ జేచిక్కునా? అతఁ డెంతో ఓరిమితో వేచియుండవలయును : ఐనను అనేక పర్యాయములు నిరాశ పడుచుండును."

తీవ్రసాధన నొనరించిన పిమ్మట లభించు దివ్యానుభూతులకు మాతృదేవి విశేషప్రాముఖ్యము నొసఁగుచు నిట్లు వచించును : "భగవదనుగ్రహమున సాక్షాత్కార మెప్పు

డైనను లభ్యము కావచ్చును. కాని సకాలమునఁ బండు మామిడిపండ్లకును అంతకుముందుగనే జ్యేష్ఠమాసమునఁ బండువానికిని రుచిలో తారతమ్యముండునుగదా? ముందుగనే పండునవి యంత తియ్యగా నుండవు. సాక్షాత్కార విషయముగూడ నిట్టిదే.'' ఆత్మవికాసము క్రమసాధన ననుసరించియుండునని యామె యిట్లు వక్కాణించెను: ''బహుశః ఒకజన్మములో నొకఁడు జపతపసాధనలను జేసియుండవచ్చును; ఉత్తరజన్మమున వానిముముక్షుత్వము తీవ్రమగును; మఱిజన్మమున మఱింత తీవ్రమగును,—ఈవిధముగా నుండును.''

సాధనసంపదనుగూర్చి కళాశాలలోఁ జదువుచుండిన యొకశిష్యున కిట్లామె బోధించెను: ''మనోనిగ్రహమును నైర్మల్యమును అమూల్యమైన సంపదలు. హృదయ నైర్మల్యమున్నపక్షమున, పరంజ్యోతిని నీ హృదయముననే కాంచఁగలవు. అట్టి నీహృదయమున నేభావము తోఁచినను వెనువెంటనే ఫలించును. పండ్రెండేండ్లు అఖండబ్రహ్మచర్యము పరిపాలించితివా, నీమేధాశక్తి యొక్కవోకుండును. ఇది మన శాస్త్రవచనము. కాఁబట్టి యెన్నఁడును వ్యామోహితుఁడవుగాక, సదా మనోనిగ్రహమను కవచమును ధరింపుము.* అపుడు నీలో జ్ఞానజ్యోతి దేదీప్యమానమై వెలుఁ

---

* సన్న్యాసియగు నొక శిష్యుఁడొకప్పుడు మాతృదేవితో నిట్లు పలికెను: ''నేను సాధనలను దీక్షతోఁ జేయుచునే యున్నాను. కాని మనోమాలిన్యము తగ్గుచున్నట్లు కనఁబడుటలేదు.'' మాతృదేవి యిట్లు

గును, ప్రశాంతి నీయధీనమగును. మనఃస్థైర్య మున్నపక్ష మున, నీ వేపని తలపెట్టినను జీవితములో కఠినపరీక్షలన్నిటి యందును నిశ్చయముగా దిగ్విజయము నొందఁగలవు. నిరాశ కును దైన్యమునకును అగ్గముగాక, శ్రద్ధాభక్తులతోఁ బని చేయుము. అపుడు విజయము నిన్ను వరించును.''

పూనికయు నిష్ఠయు ఆవశ్యకమని తెలుపుచు నొకప్పు డామె యిట్లు వచించెను: ''మనస్సు సహజముగా దుష్కా ర్యములవైపు మొగ్గుచుండును, సత్కార్యములనిన సోమరి తనము. మునుపు నేను వేగుజామున మూఁడుగంటలకు లేచి ధ్యానమునకుఁ గూర్చుండుదానను. ఒకనాఁడు కొంచెము అస్వస్థతచే లేవబుద్ధి కాలేదు. ఈ యొక్కనాఁటి యక్రమము బహుదినములపర్యంతము నా నియమమును తలక్రిందు చేసి నది. కాఁబట్టి సమస్త సత్కార్యములయందును పూనికయు నిష్ఠయు ఆవశ్యకమని చెప్పుచున్నాను.''

---

వచించెను: ''నలుపు, తెలుపు, ఎఱుపు మొదలగు రంగులుగల దారము లను కదుకుపైఁ జుట్టిలివనుకో. వానిని విప్పునప్పుడు మఱల ఆ రంగుల నన్నిటిని అదేవిధముగాఁ జూతువుగదా?'' (అనఁగా మనసునకు వైరాగ్యమబ్బునపుడు పూర్వవాంఛలు మఱలఁ గానిపించినను, వానివలన బాధకలుగ నేరదని భావము.)

మఱియొక శిష్యుఁడు తనమనోదౌర్బల్యమునుగూర్చి మాతృదేవికిఁ దెలుప నామె యిట్లు పలికెను: ''కామమును సమూలముగా నశింపఁ జేయుట యెవరికి సాధ్యము? శరీరమున్నంతవఱకు ఏ లేశమో అది నిలి చియే యుండును: కాని మంత్రించిన భస్మముచే పామును వశపఱుచు కొనునట్లు దానిని వశపఱుచుకోవచ్చును.''

"కొందఱు నా కిట్లు వ్రాయుచుందురు : 'మే మెంతో జపము, ధ్యానము, ప్రార్థనయుఁ జేయుచున్నాము, కాని మా కేమియు సిద్ధించుట లేదు.' మఱికొందఱు తమ బాధలను, దుఃఖములను, సంసారతాపత్రయమునుగుఱించి వ్రాయుచుందురు. వీనినన్నిటిని ఇఁక వినఁజాలకున్నాను... కాని నిజముగా భగవంతునిఁ గనలేదని పరితపించువా రెందఱు? నిజమైన నిష్ఠయు, విరక్తియు ఏవి? ఎంతో భక్తిని, ఆవేదనను గలిగియున్నట్లు అనేకులు చెప్పుచుందురు, కాని రవంత సుఖమో, భోగమో, లభించినంతనే సంతుష్టు లగుచుందురు; 'ఆహా! భగవంతుఁ డెంత దయామయుఁడో!' అని మురియుచుందురు..."

సాధన లన్నిటిలో జపమునుగూర్చి యామె నొక్కి చెప్పెను. జపమూలముననే సిద్ధి కలుగునని యామె పలుకును. మంత్రోపదేశము మనస్సునేకాక, శరీరమును సైతము పవిత్ర మొనర్చుననియు, జప మొనరించి ధన్యము గావించుకొను నిమిత్తము వేళ్లను భగవంతుఁడు మనకొసఁగె ననియు నామె వచించును. "అమ్మా! మనోనిగ్రహము సాధ్యము కాకున్నది. ఏమి చేయుదును?' అని యొక శిష్యుఁడు మొఱలిడ, మాతృదేవి యిట్లు పలికెను: "నాయనా! మేఘములను వాయువు పాఱఁదోలునట్లు చిత్త చాంచల్యమును వ్యామోహమును భగవన్నామము పాఱఁ దోలును." మఱియొకనితో నిట్లు వచించెను: "సంసారము పెద్దరొంపి. దీనిలోఁ దిగఁబడినవాఁడు మఱలఁ బైకి వచ్చుట దుస్సాధము. బ్రహ్మవిష్ణుమహేశ్వరులుసైతము సంసార

మోహితులైరి. మానవులమాట యింకఁ జెప్పనేల? నాయనా! భగవన్నామము జపింపుము. జపించితివా, భగవంతుఁడు సకాలమున నీ సంసారబంధమును విచ్ఛిన్నము చేయును.'' "నామజపమువలన ప్రారబ్ధకర్మము నశించునా?'' యని యొక శిష్యుఁడు ప్రశ్నింప, మాతృదేవి యిట్లు పలికెను: "ప్రారబ్ధకర్మము ననుభవింపక తప్పదు. ఐనను దానితీవ్రత నామజపమువలన క్షీణించును. కాలు పోఁగొట్టుకోవలసిన విధియుండఁగా, పాదమున ముల్లు గుచ్చుకొనుట వంటి దిది.'' "ఒకమల్లుఁ డొకదూడను పుట్టిన నాఁటినుండియు ఎత్తుకొని మోయువాఁడఁట. ప్రతిదిన మాతఁ డట్లు చేయుచురాఁగా, అఖండబలాఢ్యుఁడై అది పెద్దగిత్తయైనపిమ్మటకూడ అవలీలగా దాని నెత్తుకొని మోయఁగల్లు వాఁడఁట. క్రమమగు జపానుష్ఠానముచే నిట్లే యాత్మవికాసము కరతలామలకమగు''నని యామె వచించును. దీక్షతో ప్రతిదినము వేలకొలఁదిపర్యాయములు మంత్రజప మొనర్చుటచే, మనస్సు అనాయాసముగా నిలుకడఁ జెంది ధ్యాననిమగ్నమగుననియు, కుండలినీప్రబోధము కలుగు ననియు నామె బోధించును.*

* అనఁగాఁ దుదకు ఆత్మసాక్షాత్కారము కలుగునని భావము. మాతృదేవి మఱియు నిట్లు తెలుపును: "వినిర్మల హృదయమున జపించు నపుడు మంత్రము అప్రయత్నముగా అంతరంగమునుండి (ప్రవాహము వలె) వెలువడుచున్నట్లు తోఁచును. మాంద్యమును పాఱఁదోలి మెలఁకువ గలిగి సకాలమున అనుదినము జపధ్యానములను చేయవలయును.'' "జప మొనర్చుచురాఁగా, భగవద్దర్శనము లభించునెడల జప మాఁగిపోవును.''

జపధ్యానములతోఁబాటు జగద్ధిత కార్యములనొనర్చుట శ్రేయస్కరమని మాతృదేవి యుపదేశించును. ఒక శిష్యునితో నామె యిట్లు పల్కెను: "నాయనా! దినమంతా జపధ్యానములు చేయఁగలవా రెందఱు? అనేకులు ఆరంభశూరులై సాధనచేయుదురు... కాని తుదకు గర్వభూయిష్ఠులగుదురు. బహువిషయములనుగూర్చి చింతించుటచే వారికి లేనిపోని తాపత్రయములు గలుగును. విచ్చలవిడిగా మనస్సును విడిచిపెట్టుటకంటె కర్మాచరణము చాల మేలు.

జపమొనరించుచున్నను, మనస్సు నిలుకడ చెందకుండుటకు కారణమేమని యొకశిష్యుఁడు ప్రశ్నింప, మాతృదేవి యిట్లు పలికెను: "క్రమముగాఁ గలుగును. మనస్సు నిలుకడచెందకున్నను, జపమును మానకు. నీ కర్తవ్యము నీవు చేయవలయును. జపించునప్పుడు గాలి వీచని తావున నిశ్చలముగా వెలుఁగు దీపకళికవలె మనస్సు సహజముగా ధ్యేయముపై నిలుచును. గాలియే దీపమును జలింపఁజేయుచున్నది. అటులనే మన భ్రమలును వాంఛలును మనస్సునకు చాంచల్యమును అశాంతినిఁ గలిగించుచున్నవి. అదిగాక, సరిగా మంత్రమును ఉచ్చరింపనిపక్షమున ఏకాగ్రత కలుగుటకు ఆలస్యమౌను. 'రుక్మిణీనాథాయ ...' అనుమంత్రము నుపదేశమునొందిన యొకతె యంత పెద్దమాట నుచ్చరింపలేక, 'రుకు, రుకు' అని జపించుచుండెడిది. అందుచేఁ గొన్ని దినములవఱకు ఆత్మవికాసమునకు ప్రతిబంధ మేర్పడినది. కాని భగవదనుగ్రహమున అనంతర మామె సరియగుమంత్రమును గనుఁగొనినది."

జపవిధానమునుగూర్చి మాతృదేవి యిట్లు వచించును: "జపమొనర్చుచు, ఇష్టదైవమును ధ్యానింపవలయును. ధ్యాత మొదట ఇష్టదైవముయొక్క ముఖమును దర్శించును, కాని పాదాదిశిరఃపర్యంతము ఇష్టదేవతాశరీరమునంతను ధ్యానింపవలెను..." "మనస్సు దేనిమీఁదనో

యథేష్టముగా మనస్సును సంచరింపనిచ్చినపక్షమున, ఎంత గందరగోళమైనఁ బుట్టించును. ఈ సంగతుల నన్నిటిని ఆలోచించియే మా 'నరేన్' (అనఁగా నరేంద్రుఁడు—వివేకానందస్వామికిది చిన్ననాఁటి ముద్దుపేరు) జనులు నిష్కామకర్మము చేయుటకుఁ దగిన సంస్థలను (శ్రీరామకృష్ణ సేవాశ్రమములను) స్థాపించుచున్నాఁడు."

ఆశ్రమమున విహితకర్మముల నొనర్చుచుండిన మఱి యొకశిష్యుఁడు తాను వానినన్నిటిని విడిచిపెట్టి తపోధ్యాన ముల నొనర్పఁదలఁతునని పలుక, మాతృదేవి యిట్లు సమాధా

---

పెట్టుకొని లక్షపర్యాయములు జపించుటకంటె, ఏకాగ్రచిత్తముతో కొలఁదిసారులైనను (మంత్రమును) జపించుట మేలు: తన్మూలమున భగవదనుగ్రహము లభించును."

ఒకశిష్యుఁడు మాతృదేవి నిట్లు ప్రశ్నించెను: "అమ్మా! మనస్సు నిలువకుండుటకు కారణ మేమి? నేను ధ్యానము చేయఁబోవునపుడు మనస్సు ఇతరవిషయములమీఁదికి లాగుచుండును." మాతృదేవి యిట్లు సమాధానించెను: "సాంసారిక విషయములచే మనస్సు ఆకర్షింపఁబడిన, అది తప్పే. సాంసారికవిషయములనఁగా కామినీకాంచనములు. కాని మనము చేయుచున్న పనిమీఁదికి మనసు పోవుట సహజము. ధ్యానము సాధ్యము కాకున్న, జపము చేయుము......బలవంతముగా మాత్రము ధ్యానము చేయరాదు."

నిష్ఠనుగూర్చి మఱియొక శిష్యునితో మాతృదేవి యిట్లు పలికెను: "వేళ తప్పక జపధ్యానములను చేయవలయును. ఏ శుభముహూర్తమున సాక్షాత్కారము గలుగునో ఎవరు చెప్పఁగలరు? మనము అనుకొనకయే అకస్మాత్తుగా ఆ సుముహూర్తము రావచ్చును. అందుచే ఎంత పని యొత్తిడి యున్నను, వేళతప్పక జపధ్యానములను జేయవలయును."

నించెను : "అది యేమి, నాయనా! నీవిపుడు నా కార్యములనేగదా, గురుదేవుని కార్యములనేగదా, ఆచరించుచున్నావు? తపోధ్యానములకంటె నివి తక్కువవా? వీనిని నీ వెందుకు విడనాడవలయును?..."

ఐనను ధ్యానప్రార్థనలు కర్మాచరణమను నౌకకు చుక్కానివంటివనియు, ఉదయసాయంసమయములయందు వానిని విధిగా నాచరింపవలయుననియు తన్మూలముననే తా నొనర్చు కర్మములందలి యోగ్యతాయోగ్యతలు సాధకున కెఱుకపడుననియు మాతృదేవి తెలుపును.

సాధకున కెంతవఱ కాహారనియమ మావశ్యకమను విషయమున నామె యిట్లుపదేశించును : "సాధకుఁడు శ్రాద్ధభోజనము చేయరాదు. సాధన కది హానికరము. ఠాకూరు (శ్రీ పరమహంస) దానిని నిషేధించువారు. నీవు తిను దానిని — అది యేమైనను — ముందుగా భగవంతునకు నివేదింపుము. నివేదనచేయని యాహారమును దినరాదు. శుద్ధాహారమువలన శుద్ధరక్తమును, శుద్ధహృదయమును, బలమును లభించును.* శుద్ధహృదయమున ప్రేమభక్తి (అనఁగా ఉత్కృష్టమైన పరభక్తి) యుదయించును."

ఆచారము పేర 'చేదస్తము' కూడదని మాతృదేవి శిష్యులను హెచ్చరించును. †

---

* "ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః, సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః, స్మృతిలమ్భే సర్వగ్రన్థీనాం విప్రమోక్షః"—ఛాందోగ్యోపనిషత్తు.

† ఆమె జయరాంబాటిలో నుండఁగా నొకనాఁడు వంటకత్తె రాత్రి తొమ్మిదిగంటల కామెయొద్దకు వచ్చి, "అమ్మా! నేను కుక్కను

భగవంతునియందలి శ్రద్ధాభక్తులనుగూర్చి మాతృదేవి యిట్లు వచించును: "కేవలపాండిత్యముచే భగవంతుని యందు శ్రద్ధాభక్తు లబ్బునా? మితిమీఱిన చదువువలన మనస్సు కలవరపడును. భగవంతుఁడు నిత్యుఁడనియు ప్రపంచము అనిత్యమనియు శాస్త్రములవలన గ్రహింపవలెనని ఠాకూరనువారు. నాకోసము కొన్నివస్తువులను దెమ్మని నీకు ఉత్తరము వ్రాయుదు ననుకో. ఆయుత్తరముయొక్క అవసరము ఎంతవఱకు? దానిలోనిసంగతులు నీవు గ్రహించు నంతవఱకే గదా? సంగతులు గ్రహించిన తరువాత ఇఁక నుత్తర మెందుకు? ఇఁకను ఆ వస్తువులను సంపాదించి నీవు నావద్దకు వత్తువు. దానికిబదులు అహర్నిశము ఆ లేఖను జదువుచుండుటవలన ఏమిలాభము?"

పాండితిని సాధనసంపదతో సమన్వయించుచు మాతృదేవి యిట్లు పలుకును: "భగవద్భక్తియే నిజముగాఁ మనకుఁ గావలసినది...ధనికులను, పేదలను, పండితులను, పామరులను—అందఱను తరింపఁజేయుటకే ఈ సమయమున ఠాకూరు అవతరించినారు. మలయమారుతము వీచుచున్నది. తన హృదయద్వారమును దెఱచుకొని గురుదేవుని శరణుజొచ్చిన

తాఁకినాను. స్నానముచేయవలయును" అనెను. మాతృదేవి, "రాత్రి యిపుడు స్నానమేల? కాలుసేతులు కడుగుకొని, మఱియొకబట్ట కట్టుకొనుము, చాలును" అనెను. వంటకత్తె, "అది సరిపోదు" అనుటచే మాతృదేవి, "అటులైనఁ గొంచెము గంగాజలమును మీఁదఁ జల్లుకొనుము" అనెను. కాని యాఛాందసురాలికి సమాధానము కాకుండుటచే మాతృదేవి తుదకు, "నన్ను వచ్చి స్పృశింపుము" అనెను. ఆమె యటు లొనర్చి సమాధానమునొందెను.

ప్రతివ్యక్తియు ధన్యమగును. ఈ మలయమారుతస్పర్శచే ఈసారి సమస్తమైన చెట్లును మొక్కలును—బహుశః వెదురును గడ్డియు తప్ప—ఏమాత్రపుం జేవ యున్నవైనను సరియే, చందనవృక్షములుగా మాఱిపోవును. ఐనను విద్యావంతుండగు సాధుపుంగవుండు సువర్ణముచే అలంకరింపంబడిన దంతములు గల గజరాజమువంటివాండని జ్ఞప్తిలో నుంచుకొనుండు.''

ఎల్లవారికిని—అందు ముఖ్యముగా సాధకులకు—సహనము అత్యావశ్యకమని మాతృదేవి యుపదేశించును.* కష్టకాలమున నోరిమికలిగియుండవలయునని శిష్యుల కామె బోధించును. ఒకప్పు డామె యిట్లు పలికెను: ''ప్రతివారును ఇట్లు తమకష్టములను దుఃఖములను వెడలంబోసికొందురు: 'అబ్బా! ఈ జీవితము దుఃఖసాగరము. దేవుని ఎంత ప్రార్థించినను మా కష్టములకు అంతు లేకున్నది.' ఐనను కష్టములు కేవలము భగవత్ప్రసాదము. మనపై దేవుని కరుణకు అవి చిహ్నములుగదా!''† తన భావమును విశదీకరించుచు నామె యిట్లు వచించెను: ''లోకమున కష్టముల ననుభవింపనివా రెవరు? భక్తురాలగు బృంద కృష్ణునితో

* ఆమె యొకప్పు డిట్లు వచించెను: ''ఆపదలును కష్టములును కలుగరాదని తలంచుట పిచ్చితనము. అవికలిగితీరును. కాని భక్తునివిషయమున వంతెనక్రిందనుండి నీటివలె అనాయాసముగా దాటిపోవును.''

† కుంతీదేవి తమకెప్పుడును కష్టములనే యొసంగుచుండుమని శ్రీకృష్ణు నిట్లు ప్రార్థించెను: ''విపదస్సన్తునశ్శశ్వత్ తత్ర తత్ర జగద్గురో, భవతో దర్శనం యత్స్యాత్ అపునర్భవదర్శనమ్.''—భాగవతము. (భవతారకమగు భవదీయదర్శనము కలుగునేని, మాకు సర్వదా విపత్తులే కలుగుంగాక !)

నిట్లనినది : 'నీవు కరుణామయుఁడ వనువా రెవ్వరు? రామావతారమున నీవు సీతను ఆజన్మాంతము విలపింపఁ జేసితివి. ఈ నీ కృష్ణావతారముననో, రాధ నీకోసము విలపించుచున్నది గదా! నీ తల్లిదండ్రులు కంసుని కారాగారమున అహర్నిశము నిన్ను స్మరించుచు రోదనము చేసిరి. ఐనను నీ నామస్మరణ నే నెందుకుఁ జేయుచున్నాను? సంసార సాగరమునుండి నన్నుఁ దరింపఁజేయును గావున.' "

సాధకుఁడు తాను గ్రహింపకున్నను, భగవదనుగ్రహమనుఁడు, గుర్వనుగ్రహమనుఁడు, వానిపైఁ బ్రసరించుచునే యుండును, తన్మూలమున నాతఁ డభివృద్ధినొందుచునే యుండును. జాలిగొలుపు వచనముల నొకశిష్యుఁడు మాతృదేవితో నొకప్పు డిట్లు పలికెను : "అమ్మా! నేను మీ సన్నిధి కింతతఱచుగా, వచ్చుచున్నానుగదా...కాని నే నేమియు సాధింపఁజాలనైతిని : మునుపు ఏ స్థితిలో నుంటినో ఇప్పుడును ఆ స్థితియందే యున్నట్లు తోఁచుచున్నది." మాతృదేవి యిట్లు సమాధానించెను : "నాయనా! నీవు మంచముమీఁదఁ బరుండి నిద్రపోవుచుండఁగా, ఎవరో నిన్ను మంచముతోఁగూడ మఱియొకచోటికి మార్చినా రనుకొనుము. నీవు లేచినవెంటనే క్రొత్తచోటికి వచ్చినట్లు తెలిసికోలేవు. నిద్రమత్తు పూర్తిగా పోయినతరువాతనే ఆ సంగతి తెలిసికోఁగలవు."

చిక్కులలో, తీఱని సందేహములలో, తగుల్కొనుతఱి వ్యాకులపడుటకుమాఱుగా దారి చూపుమని కన్నుల నీరువెట్టుకొని భగవానుని ప్రార్థింపఁదగునని మాతృదేవి

యుపదేశించును. సాక్షాత్కారము నొందవలయునను తీవ్రకాంక్ష యున్నచో, ఎవ్వరైనను బ్రహ్మచర్య మవలంబించితీరవలయునని యామె బోధించును. సంసారసుఖముల యెడ విరక్తియే పారమార్థికజీవనమునకు ప్రథమ సోపానమని యామె యిట్లు పలుకును: "'జీవితము మూఁడునాళ్ల ముచ్చట. నేఁడున్న మానవశరీరము రేపుండదయ్యో. బ్రదికి బట్టకట్టిన కొలఁది కాలమైనను, తాపత్రయనిలయమయ్యో' — ఈ విధముగా వివేచించి వివేకవైరాగ్యముల నలవఱుచుకొందుమేని, నిజమైన భగవద్భక్తి హృదయమున నుదయించును."

"పూలను దాఁకినచో, పరిమళ మబ్బురీతిని, సానపై నఱుగఁదీసినచో, చందనమందలి సుగంధము వెలువడు చందమున, సదా భగవంతునిఁగూర్చి చింతించుటచే, ఆత్మ ప్రబోధము గలుగును. సాక్షాత్కారము లభించును."

"జపతపములు, పూజలు, తీర్థయాత్రలు...వీని నన్నిటిని చిన్ననాఁటనే చేయవలయును...ముసలితనమున జవసత్త్వములు ఉడుగును, శక్తిసామర్థ్యములు సన్నగిల్లును, మనోదౌర్బల్యము సంభవించును. అపు డేమైనను చేయఁగలమా? మన శ్రీరామకృష్ణమఠములోని సన్న్యాసులు చిన్ననాఁటినుండియు మనస్సు భగవంతునివైపు మఱల్చుచుండుట చాల మంచిసంగతి, సరియైనపని. బాల్యమే భగవచ్చింతకు సరియైనకాలము...."

ఇట్లు పరమార్థమునుగూర్చియేకాక, వ్యావహారిక ధర్మములనుగూర్చియు మాతృదేవి శిష్యుల కనేక సదుప

దేశము లోనర్చెను. ఒకప్పు డొకశిష్యునితో నామె యిట్లు పల్కెను: "ఒకతావునుండి నీవు మఱియొకతావునకు వెళ్లు నప్పుడు చుట్టుపట్లనున్న వస్తువులను పరిస్థితులను పరిశీలింపుము, మఱియు నీవు నివసించు తావున జరుగు సంగతుల నన్నిటిని బాగుగాఁ దెలిసికొనుము. కాని, ప్రలాపింపక మౌనము వహింపుము." మఱియొకప్పు డిట్లు తెల్పెను: "మాటలచేఁగూడ మన మెవ్వరిని నొప్పింపరాదు. సత్యమైనను అప్రియమైనచోఁ జెప్పరాదు.* పరుషవాక్యము లాడుటచే స్వభావముగూడ పరుషమగును. మితసంభాషణమును విడిచి నోటికి వచ్చినట్లు వదరుటచేఁ గలిగెడి దేమి? కుంటివానిని జూచి, 'నీ కీ కుంటితనము ఎట్లు వచ్చిన' దని యడుగరాదని ఠాకూ రనుచుండువారు."

అల్పవస్తువులనైతము అలక్ష్యము చేయరాదని మాతృదేవి శిష్యులను హెచ్చరించును. పెరటినిఁ దుడిచి, చీఁపురు నొకవైపునకు గిరాటువేసిన యొకతెను గని మాతృదేవి యిట్లు మందలించెను: "అదే మమ్మా! పని యైనంతనే చీఁపురుకట్ట నంత యలక్ష్యముగా విసరివేయు చున్నావు? దాని నట్లు విసరివేయుటకు నీ కెంతసేపు పట్టునో నెమ్మదిగా ఒకమూలఁ బెట్టుటకును అంతేసేపు పట్టునుగదా? ఎంత యల్పవస్తువైనను మనము దానిని అలక్ష్యము చేయరాదు. ఒకరిని నీవు గౌరవించినపక్షమున

* "సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్, న బ్రూయాత్ సత్య మప్రియమ్; ప్రియం చ నానృతం బ్రూయాత్, ఏష ధర్మ స్సనాతనః."—మనుస్మృతి.

వారును నిన్ను గౌరవింతురు. చీపురుకట్టవిషయముకూడ నిట్టిదే. అది నీకు మఱల అక్కఱలేదా? అదిగాక, ఈ కుటుంబమున అది ఒకయంశము. దానినిబట్టి చూచినను, అది నీకు గౌరవాస్పదము. చీపురుకట్టనుగూడ గౌరవింపవలెను. అల్పకార్యమునైనను అలక్ష్యము చేయరాదు.''

మాతృదేవిజీవితమే మహాసందేశము. భవబంధమధ్యమున, బాంధవసమాజమున, సదా బంధవిముక్తయై, ఆనందమయియై యామె మనఁగల్గెనుగదా! *

* ''వ్యాకులతయన నెట్టిదో నే నెన్నఁడెఱుఁగను'' అని మాతృదేవియే వచించియున్నది.

## ఇరువదవ ప్రకరణము

## అంత్యదశ : మహాసమాధి

మాతృదేవి మహాసమాధి నొందు సమయ మాసన్నమైనది. రాధు ప్రసవింపనుండినకతన ముఖ్యముగా ఆమె యోగక్షేమముల నెంచి మాతృదేవి 1919-వ సంవత్సరారంభమున జయరాంబాటికి వెళ్లి యొక సంవత్సరముకు అదనముగా నుండెను. రాధు బిడ్డను గనినను, మాతృదేవి తన పాలిటి మాతృదేవియై కాపాడుచుండినను, దుర్బలమానసయు దుర్బలశరీరయునగు నామె పలువిధములగు బాధల ననుభవించుచునేయుండెను.

మాతృదేవి యారోగ్యముకూడ విశేషముగా క్షీణింపసాగెను. సిద్ధార్థినామ సం॥ మార్గశిరమాసమున (1919-వ సంవత్సరాంతమున) నామెకు జ్వరము ప్రారంభమై నాఁటి నుండియుఁ దఱచుగా వచ్చుచుండెను. శారదానందస్వామి యామెను చికిత్సకై కలకత్తాకుఁ దోడ్కొని వెడల నేర్పాటు గావించెను. మాతృదేవిశరీరము అతిదుర్బలమగుటయు సమీపమందలి సింహవాహినీ దేవ్యాలయమునకైనను నడవలేని స్థితిలో నుండెను. ఆమె కలకత్తా చేరినంతనే యోగేన్ మాయియు గోలాప్ మాయియు నామె శరీరస్థితినిఁ గాంచి విషాదభరితలై యామెతో వచ్చిన యొకశిష్యునితో నిట్లు పలికిరి: "ఆహా! ఎట్టిస్థితిలో అమ్మను మా వద్దకుఁ దీసికొనివచ్చినావు! అయ్యో! ఆమె యెంత నల్లఁబడిపోయి

నదో! చర్మావృతమైన అస్థిపంజరము నిచటికిఁ దీసికొని వచ్చినావు!''

మాతృదేవిచికిత్సకై కవిరాజ శ్యామదాస వాచస్పతి యను సుప్రసిద్ధాయుర్వేదవైద్యుఁడు నియమింపఁబడియెను. ఆతఁ డొసఁగు మందు భరింపరానంతటి చేదుగా నుండెడిది. ఆ చేదు నోటినిఁ బట్టుకొని భోజనసమయమునఁగూడ విడువ కుండుటచే, ఆమె కాహారము రుచించెడిది కాదు. ఆ కవిరాజు మఱియొకమందీయజాలమి, నీలరత్నసర్కార్ అను మఱి యొక విఖ్యాత (Allopathic) వైద్యుఁడు నియమింపఁబడెను. ఆతఁడు మాతృదేవివ్యాధి 'కాలాఅజార్' (మన్నెపుజ్వరము వంటి యొకవిధమైన భీషణజ్వరము) అని నిర్ణయించెను. రెండునెలలు చికిత్స నడచినను గుణము కనఁబడదయ్యె. అందుచే మఱల ఆయుర్వేదచికిత్స ప్రారంభింపఁబడెను.

క్రమముగా జ్వరము నిరంతరమై యొక్కొకసమయ మున 103 డిగ్రీలవఱకును వచ్చుచుండెడిది. శరీరమంతయు మంటలెత్తసాగెను. ఆ తాపమునుండి కొంచె ముపశాంతిని బొందుటకై యామె గోలాప్‌మాయినిఁ దఱచు కౌఁగిలించు కొనుచుండెడిది. నిరంతర మామెకు విసరుచు, తాపోప శాంతికై చేతులలో మంచుగడ్డల నుంచుచుండవలసివచ్చెడిది.

ఈ దీర్ఘవ్యాధిసమయమున మాతృదేవిస్వభావము అచ్చముగా బాలికాస్వభావమును బోలియుండెను. ఆజన్మాంతము తనకు అఖండప్రీతికరమగు గంగానదియొద్దకు వెడలఁదలఁతునని యామెతనయనుచరులకుఁ దెలుపును, వారు సమ్మతించిననే కాని యామె భుజింపకుండెడిది. సరళ యను

శిష్యురా లొకనాఁడు రాత్రి చాల ప్రొద్దుపోయిన పిమ్మట నామెచే నాహారము దినిపింప యత్నించుచుండెను. కాని మాతృదేవి పసిబాలికవలె నిట్లు పలికెను: "వలదు, నేను తినను. ఎంతసేపు తిను, తిను, తినుమనుటయే నీకుఁ దెలియును. పైఁగా, ఆ పుడకను (అనఁగా ఉష్ణమాపకము) చేతి క్రిందఁ బెట్టుచుందువు." "అటులైన, శారదానందస్వామినిఁ బిలుతు"నని శిష్యురాలు పలుక, మాతృదేవి, "పిలువుము, నీ చేతినుండి నేఁ దినను" అనియెను. శారదానందస్వామి యచటికి వచ్చినంతనే మాతృదేవీప్రవర్తనమును గాంచి యెల్ల రాశ్చర్యచకితులైరి. తఱచు మేలిముసుఁగుతోడను మధ్యవర్తిమూలముననను ఆమె యాతనితో సంభాషించు చుండెడిది. కాని యిపు డామె తనయొద్ద నాతనిఁ గూర్చుండఁ జేసి, చిబుకమును స్పృశించి, కరుణామయవాక్కుల నిట్లని యెను: "చూడు, నాయనా! నన్నెట్లు హింసించుచున్నారో! ఎంతసేపు 'తిను, తిను' మనుచుందురు. చేతిక్రింద ఆ పుడకను బెట్టుటొక్కటే వీరికిఁ దెలియును. నన్ను బాధింపవద్దని నీవు ఆమెకుఁ (అనఁగా శిష్యురాలికిఁ) జెప్పునాయనా!" ఇఁక నామె యట్లు చేయదని చెప్పుచు, మాతృదేవి నోదార్చి, "ఏమైనను భుజింపఁదలఁతురా?" యని స్వామి మెల్లఁగా నడిగెను. ఆమె సమ్మతించుటయు నాతఁడు ఆహారముగైకొనిరమ్మని సరళకుఁ దెలుప, మాతృదేవి యిట్లనియెను: "వద్దు, నీవే నాకుఁ బెట్టు. ఆమెచేతినుండి నేను దినను." తల్లినోటఁ గొంచెము పాలు వోసి, "అమ్మా! కొంచెముసేపు విశ్రమించి, భుజిం పుఁడు" అని స్వామి పలుక, మాతృదేవి సంతసముతో నిట్లని

మెను : "చూడుఁడు, అతఁ డెంత చక్కఁగా మాటలాడు
చున్నాఁడో! 'కొంచెముసేపు విశ్రమించి తిను'మని యాతఁ
డనెను. ఆ విధముగా వీరు పలుకలేరా? మా నాయనను
ఈ నడిరేయిని వా రెంత శ్రమపెట్టిరో! నాయనా! వెళ్లి
యిఁక విశ్రమించు. అహా! నా నిమిత్త మాతఁ డెంత శ్రమ
పడెనోగదా!"

ఆమె మాతృహృదయ మివ్విధమున పరమదుర్బల
స్థితియందు సైతము ప్రకాశించుచునేయుండెను. జనుల
యారోగ్యమునుగూర్చి ప్రేమమీఱ నామె విచారణ
సల్పును; ఎవ్వరైనను బయటికి వెడలునపుడు, 'భుజించి
మఱి వెడలుఁడు' అని తెలుపును. వైద్యులు వచ్చునెడ,
వారలకుఁ దప్పక ప్రసాదము నొసఁగును. ఉపచారకులును
భక్తులును దనకు విసరుచో, కొంచెముసేపైనంతనే మాని
పించును: వారికిఁ జేతులు నొచ్చుననియు, ఆ విషయము
నెంచి తాను నిద్రపోఁజాలననియుఁ దెలుపును. తీవ్రజ్వరగ్రస్త
రాలై యున్నపుడు తన్ను దర్శింపవచ్చినవారి నుచితరీతి
నాదరింపఁజాలనిచో, పదపడి "క్షమింపుఁడు" అని పలుకును.

ఇఁక నొక నెలకు మహాసమాధి నొందుననఁగా, మాతృ
దేవి తనమందిరమునుండి ప్రక్కగదికి గురుదేవునిపటమును
మార్పుఁడని యనుచరులకుఁ దెలిపెను. వారు కారణమరయఁ
గోర, తా నిఁక స్నానాదులకు బైటికి వెడలఁజాలననియు, అట్టి
యెడఁ దనగది ఠాకూరు పూజామందిరమైయుండుట సహింపఁ
జాలననియుఁ బలికెను. మఱియు నేలమీఁదనే పరుండి పరమ

పదింపవలయునను ఆచారము ననుసరించి కాంబోలును, ఆమె తనకు నేలపైఁ బక్క వేయుఁడని తెలిపెను.

ఇంతటి యనారోగ్యస్థితియందుసైత మామె గురుదేవునకు నైవేద్యమొనర్చియే యే యాహారమునైనను గైకొనును. బాహ్యోపచారాత్మకమగు నివేదనము అసాధ్యమైనచో, మానసికముగా నొనర్చును. గురుదేవునకు సంపూర్ణాత్మనివేదమేకదా యామె చరితామృతము! వ్యాధినిఁ గూర్చి, "మీా కెప్పుడు నిమ్మళించును!" అని యెవ్వరైనఁ నడిగినచో, "గురుదేవునిసంకల్పము!" అని యామె పలుకును. శ్రీరామకృష్ణసాంగత్యమున నిముసములై గడచిన తన దక్షిణేశ్వరదివ్యానందదినములనుగూర్చి గౌరీమాయితో నామె యొకనాఁడు ముచ్చటింపసాగెను. "గురునిర్యాణానంతరముసైతము పూజాధ్యానములతో మహానందమున కాలము గడపితిరిగదా; రాధుసంరక్షణబాధ్యతను వహించిన పిదపమాత్రమే మీాయానందమున కిసుమంతలోపము కలిగిన దేమో" యని గౌరీమాయి సమాధానించెను.

ఏబంధముచే మాతృదేవి యిన్నిసంవత్సరములుగాఁ దన్నుఁదాను సంసారమున బంధించుకొనెనో ఆబంధమును—రాధుతోఁ దనసంబంధమును—మాతృదేవి యెట్లు విదళించుకొనెనో ముచ్చటింపవలసియున్నది. రాధూపాఖ్యానము మాతృదేవిచరిత్రమున నెన్నఁటికిని మఱవరానిది. తానింక కొన్నిదినములకు గతించుననఁగా, మాతృదేవి రాధును గూర్చి యెట్టివిచారణగాని, ప్రస్తావముగాని, చేయుట మానివేసెను. తుద కొకనాఁడు రాధుతో నిట్లు పలికెను: "రాధూ!

వెంటనే జయరాంబాటికి వెళ్లు. ఇఁక నిక్కడ నుండకు.'' అపుడు ప్రక్కన నిలుచుండియుండిన శిష్యురాలు—సరళ—కలుగఁ జేసికొని యిట్లు పలికెను : ''అమ్మా! అట్లనెదరేమి? రాధు లేనిదే మీరు జీవింపఁజాలరు.'' మాతృదేవి యిట్లు నొక్కి వక్కాణించెను : ''కాదు, కాదు. నామనస్సును మఱల్చి వేసికొన్నాను.'' సరళ యీవృత్తాంతమును వెంటనే యోగేన్ మాయికిని శారదానందస్వామికిని దెలిపెను. యోగేన్ మాయి మాతృదేవియొద్దకుఁ బరుగిడివచ్చి, ''అమ్మా! రాధు నెందుకు వెళ్లిపొమ్మందురు?'' అని ప్రశ్నించెను. మాతృదేవి యిట్లు సమాధానించెను : ''యోగేన్! ఇంతటినుండియు ఆమె జయరాంబాటిలో నుండవలయును. ఆమెను నీవు అక్కడకుఁ బంపివేయుము. ఆ ప్రసక్తి యిఁకఁ జేయవలదు : నా మనస్సును మఱల్చివేసికొన్నాను. ఇఁక నామె యిక్కడ నుండరాదు.'' యోగేన్ మాయి యిట్లు పలికెను : ''అమ్మా! అటు లనకుఁడు. రాధుయోగక్షేమములనుండి మనస్సు మీరు త్రిప్పుకొన్నపక్షమున, మేమిఁక బ్రదుకుటెట్లు తల్లీ!'' ఆమె మొఱలకు మాతృదేవి యిట్లు సమాధాన మొసఁగెను : ''యోగేన్! ఆబంధమును దెంపుకొన్నాను. ఇఁకను ఆ ప్రస్తావము తేఁబోకు!'' జరిగిన వృత్తాంతము నంతయు యోగేన్ మాయి శారదానంద స్వామికిఁ దెలుప, స్వామి నిర్విణ్ణుఁడై యిట్లు పలికెను : ''ఇఁక నేమున్నది? అమ్మ మననడుమ నుండదన్నమాట. రాధుప్రసక్తినుండి ఆమె తన మనస్సును మఱలించుకొన్నదనిన, ఇఁక నామెజీవితాశ మనకు లేదన్నమాట!'' ఇట్లని

సరళను సంబోధించుచు, స్వామి యిట్లు నుడివెను : "అమ్మకు సేవలుచేయుచు నీ వామెవద్ద నుండుము. రాధుమీఁదికి మఱల నామెమనస్సును ద్రిప్పుటకు శక్తికొలఁది ప్రయత్నింపుము." సరళ విశ్వప్రయత్న మొనర్చెను, కాని లాభము లేదయ్యె; ఆమె తనవ్యర్థప్రయత్నములను జాలింపవలసి వచ్చెను. మాతృదేవి యొకనాఁ డిట్లు ఖండితముగాఁ బలికెను: "సరళా? మఱలిన మనస్సు మఱల దానిపై నిలువఁ జాలదు. జ్ఞప్తి నుంచుకో."

ఇందలిసత్య మెంతయు జాలిగొలుపు నొకసంఘటన ముచే నెల్లరకును దెల్లమయ్యెను. ఒకనాఁడు మధ్యాహ్నము రాధు ప్రక్కగదిలో నిద్రించుచుండ, ఆమెబిడ్డ తల్లిపక్కను వీడి, ప్రాఁకివచ్చి, మాతృదేవిశరీరమును తనచిన్ని చేతులతో అందుకొన యత్నించుచుండెను. అంత మాతృదేవి యా బిడ్డను సంబోధించుచు ని ట్లనియెను : "నీతో నా సంబంధ మును విడఁగొట్టుకొన్నాను. వెళ్లిపో. నీ విఁక నన్ను బంధింపఁ జాలవు." ఇట్లు పలికి, దగ్గఱగా నిలిచియున్న యొకశిష్యునిఁ బిలిచి, యిట్లు తెలిపెను: "ఈ బిడ్డను దీసికొని పో. ఇఁక నాకు దీనితో సంబంధములేదు."

మాతృదేవి మహాసమాధి నొందుట కిఁకదినములు లెక్కకు మిగిలినవి. సమస్తవైద్యములును విఫలమగుటయు మాంత్రికచికిత్సలను జేయించి చూచిరి, కాని ఫలము లేదయ్యె. క్రమముగా రక్తహీనతచే పాదములు ఉబ్బసాగెను. పాన్పునుండి లేచుటకుసైతము శక్తి తప్పెను.

ఐదుదినముల క్రిఁక మాతృదేవి నిర్యాణమొందు ననఁగా, 'అన్నపూర్ణతల్లి' యను నొక భక్తురా లామెను సందర్శింపవచ్చెను. ఆసమయమున నామెగదిలోని కెవ్వరును రానీయఁబడకుండుటచే, భక్తురాలు ద్వారమునొద్దఁగూర్చుండి యుండెను. మాతృదేవి యామెను గాంచి, దగ్గఱకు రమ్మని సంజ్ఞయొనర్చెను. ఆమె వచ్చి పాదాభివందన మాచరించి, "అమ్మా! ఇఁక మా గతి యేమి?" అని వాపోవసాగెను. మాతృదేవి యెంతయు మెల్లని స్వరమున — వినఁబడియు వినఁబడని పలుకుల—నామె నోదార్చుచు నిట్లు వచించెను: "నీకేమి భయము? ఠాకూరును (శ్రీరామకృష్ణుని) జూచితివి గదా!" నిముస మూరకుండి మఱల నిట్లు పలికెను: "కాని నీకొక సంగతి చెప్పెదను—మనశ్శాంతి గోరెదవా, పరుల నెన్నఁడును నిందింపకు, సరికదా, నీ దోషములను నీవు గుర్తింపుము. సమస్త ప్రపంచమును నీది గావించుకొన నేర్చుకో. అమ్మాయీ! లోకమున నీ కెవ్వరును అన్యులు గారు; సమస్తవిశ్వము నీదే." ఇదియే లోకమునకు మాతృదేవి చరమసందేశము, పరమసందేశము.

అంతర్ముఖత్వము మాతృదేవిమానసము నాక్రమించెను. తుదిమూఁడుదినములలో నామె యెవ్వరితోడను మాటాడలేదనియే చెప్పవచ్చును. గౌరీమాయి యొకనాఁ డామెయొద్దకు వెడలి తన్ను గుర్తింపఁజేయుటకై పెక్కుసారులు ప్రయత్నింప మాతృదేవి తుదకు, "నన్నెందు కిట్లు కదిపెదవు?" అనియెను. ఈతుదిదినములలో నామె యొకసారి శారదానందస్వామినిఁ దన ప్రక్కకుఁ బిలిచి యిట్లు వచిం

చెను: "శరత్! నేను వెళ్లుచున్నాను. యోగేన్, గోలాప్, మఱి యితరులును ఇక్కడ నున్నారు; వారినిఁ గాపాడు."

మహాసమాధి నొందుటకుముందు శ్వాసము కొంత సేపు కష్టసాధ్యమైయుండెను. ప్రాణోత్క్రమణసమయమున నామె మోమును శరీరమును చాల నల్లఁబడి సంకోచము నొందెను. కాని మహాసమాధి నొందినంతనే యామెరూపము వికాసము నొంద, ఎల్లరకును విషాదమును మించిన యబ్బురము గలుగ, మోము దివ్యతేజముతో నొప్పారసాగెను. పూజార్థము వినియోగింపఁబడు దుర్గావిగ్రహమున దీపించు స్వర్ణచ్ఛాయయు, అనంతశాంతినైర్మల్యములును ఆమెవదనమున భాసించెనని యొకశిష్యుఁడు పలికియున్నాఁడు. ఈ వికాసము కొంతసేపటివఱకు నుండెను.

రౌద్రినామసంవత్సర శ్రావణశుక్ల చతుర్థీ భానువారము (1920-వ సం॥ జూలై 20-వ తేదిని) రాత్రి యొంటిగంట ముప్పదినిముసములకు మాతృదేవి యఖండపరబ్రహ్మైక్యము నొందెను.

పరమపవిత్రమగు గంగాతీరమున, (బేలూరు) శ్రీరామకృష్ణమఠావరణమున మాతృదేవిశరీరమునకు అంత్యక్రియల నొనర్ప నిర్ణయించి శరీరము నచటికిఁ గొనిపోవుటకై యుదయము భక్తకోటియు శిష్యవర్గమును సముచితప్రయత్నముల నొనర్చెను. గంగాజలములచే మాతృదేవిశరీరము నభిషేకించి, పాదములకు లత్తుక నలఁది, పాదపద్మముద్రలను దీసి, పూజార్థమై భద్రపఱిచిరి. శంఖఘంటారావములతో, ధూపదీపాదికములతో, సమంత్రకముగా మాతృదేవికి

ఆరాత్రికపూజను జరిపిరి. ఎల్లరును సాష్టాంగవందన మాచరించి, కడసారి యామెపాదములను శిరమున కద్దుకొనిరి. అనంతరము దివ్యసుమాలంకృతవాహనమున మాతృదేవి శరీరమును భక్తవరులు తమబుజములపై నిడుకొని వహించుచుండ, శారదానంద శివానందాది శ్రీరామకృష్ణశిష్యవరేణ్యులును, వేలకొలఁదిభక్తు లితరులును జయజయధ్వానములతో వారల ననుగమింపసాగిరి. అపరాహ్ణము రెండుగంటలకు గంగానదీకూలమున, శ్రీరామకృష్ణమఠావరణమున, చందనకర్పూరాదికములతో మాతృదేవిశరీరము జ్వాలార్పితమయ్యెను.

శిష్యబృందమును, పలుభాషలందు వెలయు మాతృదేవి జీవితచరిత్రములును మాత్రమేకాక, దేశదేశాంతరములందు నేఁ డనేక వైజ్ఞానిక పారమార్థిక సంస్థలు ఆమె చరిత్రమును చిరస్మరణీయ మొనరించుచున్నవి. ఖండఖండాంతరములలో ఆమెజన్మదినోత్సవములు అఖండశ్రద్ధాభక్తులతో జరుపఁబడుచున్నవి. ఆమెపేర ననేకబాలికాపాఠశాలలు వెలువడుచున్నవి. మాతృదేవ్యాలయములు మూఁడు కలవు. ధూపదీపనైవేద్యాదికములతో సమంత్రకముగ నిందామెకు నిత్యపూజలు జరుగుచున్నవి. శ్రీరామకృష్ణమఠసేవాసంఘములకు ప్రధానకేంద్రమై కలకత్తానగరమున నొప్పారు (బేలూరు) శ్రీరామకృష్ణమఠమందలి యావరణమున, ఆమె శరీరము దహనసంస్కారము నొందిన తావున, నొక దివ్యాలయము గంగానది కభిముఖముగ నిర్మితమై భక్తజనాకర్షకమై వెలయుచున్నది. ఉద్బోధనకార్యాలయ పూజా

మందిరమున జీవితకాలమున నామె గురుదేవుని రూపపటము నకు అభిముఖియై కూరుచుండురీతినే యామె రూపపటము సుప్రతిష్ఠితమై యలరారుచున్నది. జయరాంబాటియం దామె జననమొందిన తావున, ఆశ్రమముతోఁగూడిన యొక యాలయము శారదానందప్రతిష్ఠితమై దీపించుచున్నది. ఈ పూజామందిరమున తైలచిత్రితమగు నామె నిలువురూప పటము జీవకళలతో నొప్పారుచు, ఆమె యచట నాసీనురాలై యున్నదా యని తోఁపించుచుండును. ఈ యాలయమున పరమసాత్త్వికము, ప్రశాంతమునగు దేవతాస్వరూపమున పవిత్రభావములను బురికొల్పు శారదామాతృమూర్తి సన్నిధి నాసీనులగువారలకు నేఁటికిని "భగవన్మాతృభావమును లోకమునకుఁ బ్రకటించు నిమిత్తము గురుదేవుఁడు నన్ని యిలలో నుంచివెడలెను" అను మాతృదేవి వాక్కులందలి గంభీరార్థము అప్రయత్నముగా భాసించుచుండును.

"జననీం శారదాం దేవీం
రామకృష్ణం జగద్గురుమ్,
పాదపద్మే తయోః శ్రిత్వా
ప్రణమామి ముహుర్ముహుః."



ఓం తత్ సత్

శ్రీ రామకృష్ణార్పణమస్తు!





# అనుబంధము

## మాతృదేవి జాతకము

ఇది శ్రీనారాయణచంద్ర జ్యోతిర్భూషణ్ అను ప్రసిద్ధ జ్యోతిషికునిచే గణింపఁబడియున్నది.

| | | | |
|---|---|---|---|
| | * | శని రాహు | లగ్న |
| | | | |
| శుక్ర | | | కుజ చంద్ర |
| రవి గురు | బుధ కేతు | | |

జన్మసమయ గ్రహస్ఫుటము †

| | | | |
|---|---|---|---|
| రవి | 8- 9-19 | శని(వక్రి) | 1- 4-39 |
| చంద్ర | 4-26-44 | రాహు | 1-18- 2 |
| కుజ | 4-22-15 | కేతు | 7-18- 2 |
| బుధ | 7-17-32 | లగ్న | 2-19-30 |
| గురు | 8-13-24 | దశమ | 11-10-30 |
| శుక్ర | 9-26-31 | | |

జననకాలము : ప్రమాదీచనామ సం॥ మార్గశిర బహుళసప్తమీ గురువారము (1853-వ సం॥ డిసెంబరు 22-వ తేది) సాయంకాలము ఉత్తరఫల్గునీనక్షత్రయుక్త మిథునలగ్నమున 6 గంటల 52 నిమిషములకు వంగదేశమున జయరాంబాటియను గ్రామమున మాతృదేవి జనన

---

* ఈ గడినుండి మేషాదిరాసులను సవ్యముగాఁ జూచుకొనవలయును.

† ఇది శ్రీ అక్షయచైతన్య బ్రహ్మచారియను నాతనిచే వంగభాషయందు రచింపఁబడిన "శ్రీ శ్రీ శారదాదేవి" యను గ్రంథమునుండి గ్రహింపఁబడినది.

పొందెను.* జననకాల రవిమహాదశాశేషము 5 సం॥ 11 నెలల 19 దినములు.

## ఫ ల ము లు

సింహాముస కుజుఁడును మకరమున శుక్రుఁడును వృషభమున శనియు రాజయోగకారకులు. ఇట్లే ధనుస్సున రవిగురులును రాజయోగకారకులు. ఈ గ్రహములు విశేష శక్తిమంతములై సంపూర్ణప్రభావమును జూపుచున్నవి.

రవిగురులస్థితినిబట్టి జాతకురాలు సామాన్యగృహస్థురాలు కాదనిమాత్రమేకాక, ఈమెభర్త మహనీయుఁడనియు విశేషమహిమాన్వితుఁడనియుఁ దెలియనగును. గురుఁడు జితేంద్రియత్వమునకును రవి మహత్త్వనైర్మల్యములకును హేతుభూతులు. ఇట్టి గ్రహస్థితియందు జన్మించిన వ్యక్తి లౌకికచింత లేనిదై, భర్తకు పారమార్థికజీవనమునఁ దోడ్పడునని విదితము.

గురునితోఁ గూడిన రవి లగ్నమును వీక్షించుచున్నాఁడు. మఱియు కుజుఁడు గురునిచే వీక్షింపఁబడుచున్నాఁడు. ఇయ్యవి యసాధారణమగు మనోనిగ్రహమును వినిర్మలస్వభావమును దృఢసంకల్పమును సూచించుచున్నవి.

---

* ఈమె భర్తయగు శ్రీరామకృష్ణపరమహంస జననకాలము: మన్మథనామ సం॥ ఫాల్గునశుక్లద్వితీయా బుధవారమున పూర్వాభద్ర నక్షత్రయుక్త కుంభలగ్న శుక్రనవాంశమందు (1836-వ సం॥ ఫిబ్రవరి 18-వ తేది, ఉదయ మించుమించుగా 5 గంటల 15 నిమిషములకు) వంగదేశమందలి కామార్పుకూరను గ్రామములో నీతఁడు జన్మించెను.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA125B122 |
| పుస్తకం పేరు | శారదాదేవి చరిత్ర |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 263 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 14A |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |